శ్రీగురవేనమః.

వే దాం త ము.

# సుజ్ఞానదీపము-గురుగీతలు.

గు రు - అ ష్ట క ము ల తోఁ డ

౩౧౮. శ్లోకంబులు.



ఇది

శ్రీమత్షిఖానా-శంకరరావుగారిచే

టీకా తాత్పర్యములను రచియింపంబడి

పోకల-శేషాచలమునాయనివారిచే

సరిచూడఁబడి.






మద్రాసు-సిటి ముద్రాక్షరశాలయందు

ముద్రించి-ప్రచురింపంబడియె.

౧౮౯౮ సం॥



దీనివెల. ౧—౪—౦ Price Rs. 1—4—0

# విషయసూచిక.



## ప్రకటన.

| | | రూ. అ. పై. |
|---|---|---|
| ౧. | శ్రీశివరామదీక్షితీయం ౧౪-అధ్యాయముల అవల గ్రంథం. ... | ౧—౦—[illegible] |
| ౨. | రసిక జనానందము నాయకీనాయకసంవాదం జీవేశ్వరైక్యం | ౦—౧౨—౦ |
| ౩. | శ్రీకృష్ణబోధామృతం ౧౨-రాజుల కథలు. ... ... | ౦—౧౨—౦ |
| ౪. | శుద్ధనిర్గుణతత్వ కందార్థధర్వ్యాలు తాత్పర్యసహితం ... | ౦—౧౨—౦ |
| ౫. | అష్టావక్ర గీతాశాస్త్రము తాత్పర్య సహితం ... ... | ౦—౧౦—౦ |
| ౬. | భక్తజన ముక్తావళియను సద్గురు సంకీర్తనలు ... ... | ౦—౮—౦ |
| ౭. | భక్తజనకృత నిజగురుస్తవము కీర్తనలు సహా ... ... | ౦—౮—౦ |
| ౮. | వసిష్ఠజనక సంవాదము అతీతమార్గం ... ... | ౦—౮—౦ |
| ౯. | జనక సులభాసంవాదం ప్రశ్నోత్తర రత్నమాల ... ... | ౦—౮—౦ |
| ౧౦. | జడభరతోపాఖ్యానం వచనకావ్యం. ... ... | ౦—౮—౦ |
| ౧౧. | శ్రీరామ హృదయంబను షట్చక్రవర్తుల యింద్రజాలపు కథలు | ౦—౮—౦ |
| ౧౨. | శ్రీకృష్ణోద్ధవ సంవాదమను పరమపదమార్గం ... ... | ౦—౮—౦ |
| ౧౩. | శుకపంచ వింశతియను చిలుకచెప్పిన ౨౫-కథలు... ... | ౦—౮—౦ |
| ౧౪. | ఉపనిషత్సార రత్నావళి శ్రీరామహనుమంత సం॥ ... | ౦—౮—౦ |
| ౧౫. | భక్తివిజయమను పదుగురు మహాపతివ్రతల కథలు... ... | ౦—౬—[illegible] |
| ౧౬. | సుజ్ఞాన రత్నావళియను వేదాంత కీర్తనలు ... ... | ౦—౬—౦ |
| ౧౭. | ఉషాపరిణయం శృంగార వచనకావ్యం ... ... | ౦—౪—౦ |
| ౧౮. | శ్రీకృష్ణ నృగుమహారాజు సంవాదం శుద్ధనిరాలంబమార్గం ... | ౦—౪—౦ |

☞ ఈ రిజిష్టరుగ్రంథములు. మద్రాసు, నాటుపిళ్లారిగుడివీధి ౨౦-గల మందిరంబున, పోకల-శేషాచలము నాయనివారిచే విక్రయింపంబడును, వి. పి. గా పంపబడును.

# పీ ఠి క.

---

## ప్రథమాధ్యాయమునందు.

జీవేశ్వరులస్వరూపనిర్ణయంబును, విరాట్స్వరూపనిర్ణయంబును, జీవేశ్వరైక్యవిధంబును, సోహమాకీలకంబని యును, కరన్యాసంబును, హృదయాది న్యాసంబును, సద్గురుధ్యానంబును, ఓంకారసింహాసనప్రభావంబును, మానసోపచార పూజావిధానంబును, గురుమాలామంత్రమహిమయును గ్రహించి, మిగులశ్రేష్ఠంబులగు. ౧౭ శ్లోకంబులు టీకా-తాత్పర్యంబులతో నొప్పుచు. ౧౮ పుటలు గలిగియున్నయది.

## ద్వితీయధ్యాయమునందు.

పరబ్రహ్మమును బోధించెడుసద్గురునియందలిభక్తియును, పరమాత్మునకును, సద్గురునకును భేదములేదనియును, పుణ్యతీర్థములుసద్గురుపాదోదకమునకంటె శ్రేష్ఠములుగావనియును, సద్గురుపాదజలమె సంసారసాగరమును దాటింపజేయుననియును, జాతి ఆశ్రమభేదంబులనువిడిచి గురుధ్యానమే చేయవలయుననియును, గురుపాదమును బొందుటకు దేవగంధర్వ యక్షకిన్నరాదులకైన నశక్యంబనియును, దేహములు మల మూత్ర సంబంధములగు హేయ్యములనియును, గురుడే త్రిగుణస్వరూపుండగు పరబ్రహ్మమనియును, గురుధ్యానమువలన ననేకజన్మపాపంబులుపోలంగుననియును, సద్గురుని ధ్యానంబుచేత జ్ఞానసిద్ధియు మోక్షము గలుగుననియును, గురుధ్యానమువలన సర్వకష్టంబులు దీరిపోవుననియును, జెప్పుచు మిగులశ్రేష్ఠంబులగు, ౫౮-శ్లోకంబులు, టీకాతాత్పర్యంబులతో నొప్పుచు, ౮౨-పుటలుగలిగి యున్నయది.

## తృతీయాధ్యాయమునందు.

ఆత్మధ్యానమే భక్తిముక్తులకు కారణంబనియును, గురుండే సూర్యచంద్రాగ్నిస్వరూపుండనియును, గురుదయయనుఖడ్గంబుచే-అష్టపాశంబులగొట్టునని యును, గురువును దిరస్కరించిన బ్రహ్మరక్షస్సుగాబుట్టుననియును, గురువునుగాని గురుమంత్రమునుగాని మరచినవానికి జన్మహేతువనియును. గురునిందనువినగూడదనియును, దేహసన్యాసముకూడదనియును, పిండ-పద, రూప, రూపాతీత భావంబులును, వ్యాఘ్రాసనము శ్రేష్ఠమనియును, ఆసనములు ప్రయోజనంబులును, కుష్టుమొదలైన వ్యాధులు హరించుట

యును, సర్వసిద్ధులను జెప్పంబడి, ౧౧౫-శ్రేష్ఠంబులగు శ్లోకంబులు., టీకా తాత్పర్యంబులతో నొప్పుచు, ౫౨-పుటలు గలిగి యున్నయది.

## చతుర్థాధ్యాయమునందు.

గురుధ్యానము చేయవలసిన స్థానంబులును, గురుధ్యానమే స్నానంబు గాను, గురుని సంతోషింపఁజేయుటే ముక్తియనియును, గురుదుండుస్థానమేపుణ్యభూమియని యును, గురుసేవలేనివారు నరక కూపంబునం బడుదురనియును, గురుకృప లేని వారికి యధోలోకమనియును, గురుమంత్రమే సప్తకోటి మహామంత్రములకు శ్రేష్ఠమనియును, గురుమంత్రమే యిష్టసిద్ధులను బొందింపుననియును జెప్పుచు, ౬౫-శ్రేష్టంబులగుశ్లోకంబులు, టీకా తాత్పర్యంబులతో నొప్పుచు, ౨౯-పుటలు గలిగి యున్నయది.

## గురు-అష్టకములందు.

అపరిమితధనంబును, నవరత్నరాసులును, హేమకొండలును త్రిలోక రాజ్యాధిపత్యమును,సుందరులైనస్త్రీలును, మహాపాండిత్యంబునుగలిగి, సకలైశ్వర్య సంపన్నుడుగానుండియును, సద్గురుపాదపద్మములయందుమనస్సును జేర్పకుండిన, వారికి నివియన్నియును గలిగి యుండినను బ్రయోజనములేదనిచెప్పెడు, ౯-శ్రేష్ఠంబులగు శ్లోకంబులు టీకా తాత్పర్యంబులతో నొప్పుచు, ౬-పుటలు గలిగి యున్నయది.

## భ్రాంతిరహితభావము.

నామరూపరహితమై. సర్వద్వంద్వశూన్యమై. అవాఙ్మానస గోచరంబై - చైతన్యతేజోరహితంబునునై-నిత్యనిరంజనయచల పరిపూర్ణ కేవలాత్మనుగురించిచెప్పిన,౧౪-శ్రేష్ఠంబులగు శ్లోకంబులు, టీకా తాత్పర్యంబులతో నొప్పుచు, 2-పుటలు గలిగియున్నయది.

## గురుసేవాపద్ధతి.

సద్గురునియందుభయభక్తులుగలిగివర్తించుటయు,మొదలగునవిచక్కగావివరించి చెప్పంబడిన, ౧౧-పద్యంబులు గలిగి గురుగీతను ముగింపు చేసియున్నది.

—:O:—

శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః.

శ్రీకృష్ణనిజగురుపరబ్రహ్మణేనమః.

# సుజ్ఞాన దీపము-గురుగీతలు.



టీకాతాత్పర్యసహితము.

శ్రీమత్కారుణికంమహాగుణనిధిం పూర్ణప్రభాభాసురం।
నిర్ద్వంద్వంనిరపేక్షకామమమలం నిస్సంగమాద్యంవిభుం।
నిత్యానందమయంనిరీహమతులం నిర్ముక్తకర్మాదికం।
శ్రీకృష్ణాఖ్యగురుంభజేహమనిశం శ్రీచిత్తసంతోషణం॥ ౧॥

టీక ॥ అహం= నేను, శ్రీమత్కారుణికం = శోభగల దయాళువు డును, మహాగుణనిధిం = అధికములగు శాంతిశమదమాది గుణములకు స్థానమైనవాడును, పూర్ణప్రభాభాసురం=నిండైన తేజస్సుతోఁబ్రకాశిం చువాడును, నిర్ద్వంద్వం= సుఖముదుఃఖము మొదలైనజంటలులేనివాఁడు ను, నిరపేక్షకామం=ఆశ లేనికోరికగలవాడును, (దేనియందునుఅపేక్ష లేనివాడు) అమలం=మైలలేనివాడును, నిస్సంగం=శబ్దాదివిషయముల తోఁగూడుకొననివాడును, ఆద్యం=సమస్తమునకును మొదటివాడును, విభుం=అంతటావ్యాపించియుండువాడును, నిత్యానందమయం= నాశ నము లేనిపరమానందమే స్వరూపముగాఁగలవాడును, నిరీహం=ఇచ్ఛలే నివాడును, అతులం=ఈడు లేనివాడును, నిర్ముక్తకర్మాదికం = విడువబ డిన(తలంచుట,వినుట,చూచుట, మొదలగు)సమస్తపనులుగలవాడును, శ్రీ చిత్తసంతోషణం=మహాలక్ష్మియొక్కమనస్సునకు ఆనందరూపుడునగు, శ్రీకృష్ణాఖ్యగురుం = శ్రీకృష్ణుడను పేరుగలగురువును, అనిశం = ఎల్లప్పు డును, భజే= సేవించుచున్నాను.

తాత్పర్యము॥ ప్రకాశమానమగు దయగలవాడును, శాంతి మొదలగు మహాగుణములకునికిపట్టైనవాడును, పరిపూర్ణమగుప్రకాశముతో వెలుంగువాడును, సుఖదుఃఖశీతోష్ణాదిద్వంద్వములులేనివాడును, దేనినికోరకయుండెడివాడును, నిర్మలుండును, శబ్దము మొదలగువిషయసుఖములతో కూడికలేనివాడును, సమస్తమునకు మొదటివాడును, అంతటవ్యాపించియుండెడివాడును, నిత్యమగు-ఆనందమేరూపముగాగలవాడును, అసమానుడును, కాయిక, వాచిక, మానసిక, వ్యాపారములనన్నిటినివిడిచియుండెడివాడును, ప్రకాశచిత్తములకానందరూపుడును, సాక్షాత్మహాలక్ష్మికి మనస్సంతోషముచేయువాడునునగుశ్రీకృష్ణుండను సద్గురుస్వామిని నేను సేవించుచు గురుస్వరూపుడనే నేనై ఏకభావమునుపొందుచున్నాను.

శ్లో॥ యంబ్రహ్మవేదాన్తవిదోవదన్తి। పరంప్రధానంపురుషంతథాన్యే।
విశ్వోద్గతేఃకారణమీశ్వరంవా। తస్మైనమోవిఘ్ననివారణాయ॥

టీక॥ వేదాన్తవిదః=వేదాన్తము తెలిసినవారలును, తథా = ఆప్రకారముగానే, అన్యే=ఇతరులును, యం=ఎవనిని, బ్రహ్మ=పరబ్రహ్మమునుగాను, పరం = శ్రేష్ఠుడును, ప్రధానం = ముఖ్యుడునగు, పురుషం=పరిపూర్ణుడగుపురుషునిగాను, (పురములనుప్రసిద్ధికెక్కిన ఈదేహములయందునిండియుండెడిపురుషునిగాను) విశ్వోద్గతేః=ప్రపంచముయొక్కపుట్టుకకు, కారణం=హేతువైన, ఈశ్వరంవా = పరమేశ్వరునిగాను, వదన్తి=చెప్పుచున్నారో, తస్మై=అటువంటి, విఘ్ననివారణాయ=సమస్తవిఘ్నములపోగొట్టెడిపరమాత్మకొఱకు, నమః=నమస్కారము.

తాత్పర్యము॥ బ్రహ్మవేత్తలును ఇతరులును ఎవనినిపరబ్రహ్మముగాను, జీవునిగాను,జగత్కారణుండగు ఈశ్వరునిగాను చెప్పెదరో, అటువంటిసర్వమంగళస్వరూపుడై సమస్తవిఘ్నములను నశింపజేయునట్టి పరమాత్మకొఱకు నమస్కారమగునుగాక.

వాక్యం॥ ఓం అస్యశ్రీగురుగీతామాలామంత్రస్యభగవాన్ సదాశివఋషిః
విరాట్ఛన్దః,శ్రీగురుపరమాత్మా దేవతా-హంబీజం,సః,శక్తిః,
సోహం,కీలకం,శ్రీగురుకృపాప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః॥ ౩॥

టీక॥ ఓం=మంగళము, అస్య=ఈ, శ్రీగురుగీతామాలామంత్రస్య=ప్రకాశమగు గురుగీతలయొక్క మాలిక యనెడి మంత్రమునకు, భగవాన్=షడ్గుణైశ్వర్యసంపన్నుడైన. శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య। ధైర్యస్యయశసశ్శ్రియః।జ్ఞానవైరాగ్యయోశ్చైవ।షణ్ణాంభగఇతిస్మృతః॥ అను ఈశ్లోకమునందు చెప్పిన సంపూర్ణమగునైశ్వర్యమును, ధైర్యమును, కీర్తియును, సంపదయును, జ్ఞానమును, వైరాగ్యమును, (ఇవియె షడ్గుణములు) సదాశివః = ఎల్లప్పుడు పరమమంగళస్వరూపుడైన పరమాత్మయె, ఋషిః = ఋషి, విరాట్ = విరాట్టు, (బ్రహ్మాది స్తంభపర్యంతముండెడి సమస్తములైన నామరూపాత్మకములగువస్తుస్వరూపుడై ప్రకాశించెడిపరమాత్మవిరాట్టనబడును) ఛన్దః=ఛందస్సు, శ్రీగురుపరమాత్మా= మంగళస్వరూపుడైన సద్గురువనుపరమాత్మయే, దేవతా=దైవము, హం = హకారస్వరూపుడైనజీవుడే, బీజం=బీజము, సః=సకారస్వరూపుడైన ఈశ్వరుడే, శక్తిః=శక్తి,సోహం=ఆజీవేశ్వరులయొక్క కూడికయె,కీలకం=రహస్యము, శ్రీగురుకృపాప్రసాదసిద్ధ్యర్థే=ప్రకాశమానమగు సద్గురుదయయొక్క సాక్షాత్కారముకొఱకైన, జపే=అనుష్ఠానమునందు, వినియోగః=ఉపయోగము.

తాత్పర్యము॥ ఈప్రకాశములగు గురుగీతలయొక్క మాలయనెడి మంత్రమునకు సర్వమంగళస్వరూపుడై సర్వాతీతుడగు పరమాత్మయే ఋషి, బ్రహ్మాదిసర్వస్వరూపుడై ప్రకాశించెడివిరాట్టెఛందస్సు, ప్రకాశమానమగుసద్గురువను పరమాత్మయే దేవత, జీవుడేబీజము, ఈశ్వరుడే శక్తి; జీవేశ్వరులయొక్క కూడికయే పరమరహస్యము, ఇటువంటి ఈమంత్రమునకు ప్రకాశమగు సద్గురు కృపాసాక్షాత్కారము కొఱకైన అనుష్ఠానము చేయవలయును.

అఙ్గకరన్యాసః.

ఓం, హాం, సాం, సూర్యాత్మనే అంగుష్ఠాభ్యాంనమః

ఓం, హాం, సీం, సోమాత్మనేతర్జనీభ్యాంనమః

ఓం, హాం, సూం, నిరంజనాత్మనే మధ్యమాభ్యాంనమః
ఓం, హాం, సైం, నిరాభాసాత్మనే అనామికాభ్యాంనమః
ఓం, హాం, సౌం, అతనుసూక్ష్మాత్మనే కనిష్ఠికాభ్యాంనమః
ఓం, హాం, సః, అవ్యక్తాత్మనే కరతలకరపృష్ఠాభ్యాంనమః.

టీక॥ ఈచెప్పిన ప్రకారము చేతియంగుష్ఠము మొదలైనవానియం దుక్రమముగానుంచవలయును.

అథహృదయాదిన్యాసః.

ఓం, హాం, సాం, సూర్యాత్మనే హృదయాయనమః
ఓం, హాం, సీం, సోమాత్మనే శిరసేస్వాహాః
ఓం, హాం, సూం, నిరంజనాత్మనే శిఖాయైవషట్
ఓం, హాం, సైం, నిరాభాసాత్మనే కవచాయహుం
ఓం, హాం, సౌం, అతనుసూక్ష్మాత్మనే నేత్రత్రయాయవౌషట్
ఓం, హాం, సః, అవ్యక్తాత్మనే హస్త్రాయఫట్.

టీక॥ ఈప్రకారము హృదయము మొదలైనవానియందు క్రమము గానుంచవలయును.

ధ్యానం.

శ్లో॥ హంసాభ్యాంపరివృత్తపత్రకమలైర్దివ్యైర్జగత్కారణం।
విశ్వోత్తీర్ణమనేకదేహనిలయం స్వచ్ఛందమానందకం।
ఆద్యంతైకమఖండచిద్ఘనరసం పూర్ణంహ్యనంతంశుభం।
ప్రత్యక్షాక్షరవిగ్రహంగురుపదం ధ్యాయేద్విభుంశాశ్వతం॥ ౧॥

టీక॥ దివ్యైః=ప్రకాశమానములును, హంసాభ్యాం= హకార క్ష కారములచేతను, పరివృత్తపత్రకమలైః = అంతటాచలింపఁజేయబడిన రేకులుగలవియునగుపద్మములచేతను, జగత్కారణం= లోకములకుకార ణమును, విశ్వోత్తీర్ణం=లోకములనుతరింపఁజేయునదియును, అనేకదేహ నిలయం=అనేకములైన శరీరములేస్థానముగాగలదియును, స్వచ్ఛందం=

స్వతంత్రమైనదియును, ఆనందకం=ఆనందస్వరూపమైనదియును, ఆద్యంతైకం=ఆద్యంతములయందొకటిగానైనదియును, అఖండచిద్ఘనరసం = అఖండ, సంపూర్ణమైన, చిత్ = జ్ఞానముయొక్క, ఘనరసం=శ్రేష్ఠరసమైనదియును, పూర్ణం=నిండియున్నదియును, అనంతం=అంతములేనిదియును, శుభం=మంగళస్వరూపమైనదియును, విభుం=సర్వవ్యాపకమైనదియును, శాశ్వతం=నిత్యమైనదియును, ప్రత్యక్షగ్రహం,ప్రత్యక్ష=ఎదుట కనబడెడి, అక్షర= నాశనములేని, (అకారాదిపంచాశద్వర్ణములే) విగ్రహం=ఆకారముగలదియునగు, గురుపదం= గొప్పదియగుపరబ్రహ్మవస్తువును, ధ్యాయేత్ =ధ్యానించవలయును.

తా ॥ హకారక్షకారముల చేతచలనమును బొందెడిప్రకాశమానములగు దేహములయందలి మూలాధారాది కమలములతోఁ గూడుకొని సమస్తజగత్కారణమునై ప్రపంచమునుధరించుచు పిపీలికము మొదలుకొని బ్రహ్మవరకుండెడి సమస్తదేహములయందుండి స్వతంత్రమును కేవలానందమును,సమస్తసృష్టికి పూర్వమునందును ఈసృష్టియొక్క నాశమునందును ఏకస్వరూపమైనదియును, ఎడతెగని జ్ఞానరసమైనదియును, అంతటానిండి మంగళస్వరూపమైనదియును, అంతటావ్యాపించినిత్యమైనదియును, ప్రత్యక్షమగు అకారము మొదలైన ఏబదివర్ణములును నాశనరహితమగు ఆకారముగాగలదియునైన అధికమగు పరబ్రహ్మవస్తువును ధ్యానించవలయును.

శ్లో ॥ విశ్వవ్యాపినమాదిదేవమమలం నిత్యంపరంనిష్కలం।
నిత్యోద్బుద్ధసహస్రపత్రకమలే లుప్తాక్షరేమంటపే ।
నిత్యానందమయంసుఖైకనిలయం నిత్యంశివంస్వప్రభం।
ధ్యాయేద్గంసపరంపరాత్పరతరం స్వచ్ఛందతస్సర్వదా॥ ౨॥

టీక॥ నిత్యోకమలే-నిత్య=ఎల్లప్పుడును, ఉద్బుద్ధ=వికసించిన, సహస్రపత్ర=వేయిరేకులుగల, కమలే=పద్మమునందలి, లుప్తాక్షరే - లుప్త=పోయిన,అక్షరే=అకారాదివర్ణములుగల,మంటపే=మంటపమునందు, విశ్వవ్యాపినం,విశ్వ=సమస్తప్రపంచమునందు, వ్యాపినం = వ్యాపించినది

యును, ఆదిదేవం=మొట్టమొదటిదైవస్వరూపమైనదియును,అమలం=ప రిశుద్ధమైనదియును,నిత్యం=శాశ్వతమైనదియును, పరం=బుద్ధిమొదలైన వానికన్నిటికిని వేరైనదియును,నిష్కలం=కలారహితమైనదియును,(ప్రా ణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, జ్యోతిస్సు, ఉదకము, భూమి, ఇం ద్రియము,మనస్సు, అన్నము, వీర్యము,తపస్సు, మంత్రములు, కర్మ,లోకము లు, నామములు, ఈపదియారునుకళలనంబడును. ఇవిమాయచేనిర్మితము లు.ఈకళలు లేనిదినిష్కళయనబడును)నిత్యానందం...నిత్య=ఎడ తెగని, ఆనందమయం=ఆనందస్వరూపమైనదియును, సుఖైకనిలయం-సుఖ = సౌ ఖ్యమునకు,ఏక=ముఖ్యమైన,నిలయం=స్థానమైనదియును, సర్వదా=ఎల్ల ప్పుడును,స్వచ్ఛందతః = స్వతంత్రముగా, హంసపరంపరాత్ -హంస = హంసమంత్రముయొక్క, పరంపరాత్ =వరుసకంటె, పరతరం=మిక్కి లి వేరై యుండునదియును, నిత్యం=శాశ్వతమైనదియును, శివం=మంగళ స్వరూపమైనదియునునగు,స్వప్రభం_స్వ=ఆత్మయొక్క,ప్రభం=తేజస్సు ను, ధ్యాయేత్ =ధ్యానించవలయును.

తా॥ ఎల్లప్పుడునువికసించియున్న సహస్రారము పద్మమునంద లి,అకారాదివర్ణములు లేని మంటపమధ్యమునందుండి సర్వత్రవ్యాపించిన దియును,సృష్టిస్థమునకు మొట్టమొదటి దైవస్వరూపమును, నిర్మలమును, నిత్యమును, అవ్యక్తము మొదలగుసమస్తప్రపంచమునకు వేరైనదియును, ప్రాణము మొదలైన షోడశకళలును లేనిదియును, ఎడతెగని ఆనంద స్వ రూపమైనదియును, పరమసౌఖ్యమునకు స్థానమైనదియును, స్వతంత్రము గా నెల్లప్పుడును నాసికారంధ్రములద్వారా ఉచ్ఛ్వాసనిశ్వాసములతో రాకపోకలును గలిగిన హంసమంత్రముయొక్క వరుసకు వేరై పైగా నుండునదియును, శాశ్వతమును,మంగళస్వరూపమునునగు ఆత్మప్రకాశము ను ధ్యానించవలయును.

శ్లో॥ ఊర్ధ్వామ్నాయగురోఃపదం త్రిభువనోంకారాఖ్యసింహాసనం।
సిద్ధాచారసమస్తవేదపఠితం షట్చక్రసంచారిణం।
అద్వైతస్ఫురదగ్నిమేకమమలం పూర్ణప్రభాశోభితం।
శాంతంశ్రీగురుపంకజంభజమన శ్చైతన్యచంద్రోదయం॥ 3॥

టీక॥ హేమనః=ఓమనస్సా, (త్వం=నీవు) ఊర్ధ్వా...రోః=ఊర్ధ్వామ్నాయ-ఉపనిషత్తులయందలి,గురోః = గురుస్వరూపమైనపరమాత్మకు, పదం = స్థానమును, త్రిభువ-ననం,త్రిభువన=స్వర్గమర్త్యపాతాళముల నెడులోకములయొక్క-స్వరూపమైన, ఓంకార = ప్రణవమను, ఆఖ్య=పేరుగల, సింహాసనం=సింహాసనమును,సిద్ధా-పఠితం,సిద్ధ=సిద్ధులయొక్క,ఆచార=నియమములుగల, సమస్తవేద = అన్నివేదములయందును, పఠితం=చెప్పబడినదియును,షట్చా-రిణం,షట్చక్ర=ఆరుచక్రములయందు, (మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత,విశుద్ధ, ఆగ్నేయములనునవి ఆరుచక్రములు) సంచారిణం=తిరుగునదియును, అ - గ్నిం- అద్వైత=ఏకమై, స్ఫురత్=ప్రకాశించుచున్న, అగ్నిం= తేజస్స్వరూపమును, ఏకం=అద్వితీయమును, అమలం=నిర్మలమును, పూర్ణ - భితం- పూర్ణ=నిండైన, ప్రభా=తేజస్సుతో, శోభితం= ప్రకాశించునదియును, శాంతం=శాంతమును,చైతన్య-దయం,చైతన్య=తేజోరూపమైన,చంద్ర చంద్రునియొక్క, ఉదయం = అభివృద్ధిగలదియునగు,శ్రీ-జం,శ్రీగురు= ప్రకాశించుచున్నసద్గురుస్వరూపమునెడి, పంకజం = పద్మమును, భజ = సేవించుము.

తా॥ ఓమనస్సా సమస్త ఉపనిషత్తులయందును జెప్పబడిన పరమాత్మస్వరూపమునకు స్థానమైనదియును, స్వర్గాదిలోకములుమూడునుస్వరూపముగాగల ఓంకారముసింహాసనమయినదియును,సమస్తవేదములయందును జెప్పబడినదియును, మూలాధారాది షట్చక్రములయందు సంచరించుచున్నదియును, అద్వయస్వరూపమై ప్రకాశించునట్టి తేజోమయమును, అద్వితీయమును, నిర్మలమును,నిండైనప్రకాశముతోప్రకాశించునదియును, ప్రకాశస్వరూపమైన చంద్రునియొక్క అభివృద్ధిరూపమునైనదియగు శ్రీగురుపాదపద్మములను సేవించుము.

శ్లో॥ నమామిసద్గురుంశాంతం । ప్రత్యక్షంశివరూపిణం।
రసాయోగిపీఠస్థం । ముక్తికామార్థసిద్ధిదం

టీక॥ శాంతం=శాంతుడును, ప్రత్యక్షం = ప్రత్యక్షముగా, శివరూపిణం=శివస్వరూపుడును, ముక్తి - ద్ధిదం, ముక్తి= మోక్షమునందలి, కామ్య= కోరిక యొక్క, అర్థ=ప్రయోజనము యొక్క, సిద్ధిదం=ప్రాప్తినిఇచ్చువాడును, యోగ-స్థం-యోగ=జీవబ్రహ్మైక్యమనెడి, పీఠస్థం=సింహాసనమునందుండువాడునునగు, సద్గురుం= శ్రేష్ఠుడైనగురువునకు, శిరసా=శిరస్సుతో, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ప్రత్యక్షముగా శివస్వరూపుడును, జీవబ్రహ్మైక్యమనెడిసింహాసనమందుండి మోక్షాపేక్షయొక్క ప్రయోజనసిద్ధినొసంగువాడును నగుసద్గురువునుగూర్చి శిరస్సుతో నమస్కరించుచున్నాను.

శ్లో॥ ప్రాతఃశిరసిశుక్లాబ్జం । ద్వినేత్రంద్విభుజంగురుం ।
వరాభయకరంశాంతం । స్మరేత్తంనామపూర్వకం॥ ౫॥

టీ॥ శిరసి=శిరస్సునందు, శుక్లాబ్జం= తెల్లనిపద్మముగలవాడును, ద్వినేత్రం= రెండుకన్నులుగలవాడును, ద్విభుజం= రెండుచేతులుగలవాడును, వరాభయకరం, వర= శ్రేష్ఠమయిన, అభయ=భీతిలేకపోవుటను, కరం =చేయుచున్నవాడును, శాంతం=శాంతుండునునగు, తం, గురుం=అగురువును, ప్రాతః=ఉదయకాలమునందు, నామపూర్వకం = పేరుముందు కలుగునట్టుగా, (పేరును చెప్పుచు) స్మరేత్ =తలంచవలయును.

తా॥ జననమరణ ప్రవాహరూపమయిన సంసారభయమును బోగొట్టువాడును, శిరస్సునతెల్లదామరపువ్వునుధరించువాడును, రెండుకన్నులును రెండుభుజములునుగలవాడునునగు ఆసద్గురువునుగూర్చి నామోచ్చారణపూర్వముగా ఉదయకాలమునందు తలంచవలయును.

శ్రీ అనంతలక్ష్మీసమేత శ్రీమద్భాగవత శ్రీకృష్ణసద్గురు పరబ్రహ్మణేనమః.

టీక॥ ప్రకాశించెడి అంతములేని మహాలక్ష్మితోఁ గూడుకొనిన శోభాయుక్తసుగుభగవత్సంబంధుడైన శ్రీకృష్ణుడనుసద్గురుపరబ్రహ్మకొఱకు, నమస్కారము.

తా॥ సులభము.

శ్లో॥ ప్రసన్నవదనాక్షంచ । సర్వదేవస్వరూపిణం ।
తత్పాదోదకజాధారా । నిపతంతీస్వమూర్ధనీ ॥ ౬॥

శ్లో॥ తయాసంక్షాళయేద్దేహ । స్యాంతర్బాహ్యగతంమలం ।
తత్క్షణాద్విరజోభూత్వా । జాయతేస్ఫటికోపమః॥ ౭॥

*టీక॥ ప్రసన్న...క్షం ప్రసన్న=నిర్మలమైన, వదన=ముఖమును, అక్షం =నేత్రములునుగల, సర్వ...ణంచ-సర్వదేవత =సమస్తదేవతలయొక్క, స్వరూపిణంచ=ఆకృతిగలసద్గురువును, (స్మృత్వా = స్మరించి) స్వమూర్ధని=తనశిరస్సునందు, నిపతంతీ = పడుచున్న, తత్పా...జా - తత్ = ఆగురువుయొక్క, పాదోదకజా = పాదములయందలి యుదకమువలన పుట్టిన, ధారా=ఉదకధార, (యా=ఏదియో) తయా=ఆయుదకధార చేత, దేహస్య=శరీరముయొక్క,అంత...గతం-అంతః=లోపలను,బాహ్య =వెలుపలను, గతం=పొందియున్న, మలం=మైలను, సంక్షాళయేత్ = కడగవలయును, తత్క్షణాత్ =ఆసమయమునందే,విరజః=పాపములేనివాడు, భూత్వా=అయి, స్ఫటికోపమః-స్ఫటిక=స్ఫటికమణితో, ఉపమః= పోల్చదగినవాడుగా, జాయతే=అగుచున్నాడు.

తా॥ సర్వదేవస్వరూపుడైన సద్గురువునుస్మరించి, ఆసద్గురు.పాదోదకమువలనఁబుట్టిన యుదకధారచేత (లేకసద్గురుధ్యానమనెడి గురుపాదోదకముచేత) దేహముయొక్క బాహ్యాంతరములయందలి మైలనుకడిగి పోగొట్టుకొని నిర్మలుండై శిష్యుడు స్ఫటికమణితో సమానుడగుచున్నాడు.

శ్లో॥ తీర్థానిదక్షిణేపాదే । వేదాస్తన్ముఖమాశ్రితాః ।
పూజయేదర్చితంతంతు । తదభిధ్యానపూర్వకం॥ ౮॥

టీక॥ (తస్య=ఆగురువుయొక్క, దక్షిణేపాదే= కుడిపాదమునందు, తీర్థాని=పుణ్యోదకములు,(సంతి=కలవు)వేదాః= వేదములు,తన్ముఖం= తత్ =ఆగురువుయొక్క,ముఖం=ముఖమును, ఆశ్రితాః=ఆశ్రయించియున్నవి, అర్చితం=పూజింపఁబడిన,తంతు=ఆగురువునే, తద...కం,తత్ =

ఆగురువుయొక్క, అభిధ్యాన=ధ్యానమే, (ప్రార్థించుట) పూర్వకం= ముందుకలుగునట్లు, పూజయేత్ =అర్చించవలయును.

తా॥ ఏగురువుయొక్క కుడిపాదమునందు సమస్తపుణ్య జలములును, ఏగురువుయొక్క ముఖమునందు సమస్తవేదములును, ఉంచున్నవియో, అట్టిపూజితుండగు సద్గురువును ధ్యానపూర్వకముగా పూజించవలయును.

శ్లో॥ సహస్రదళపంకజే సకలశీతరశ్మిప్రభం ।
వరాభయకరాంబుజం విమలగంధపుష్పాంబరం ।
ప్రసన్నవదనేక్షణం సకలదేవతారూపిణం ।
స్మరేచ్ఛిరసిహంసగం తదభిధానపూర్వంగురుం॥

టీక॥ సక...ప్రభం-సకల=సమస్తమగు, శీతరశ్మి=చంద్రునియొక్క, ప్రభం=కాంతిగల, వరాభయకరాంబుజం, వర=శ్రేష్ఠమైన, అభయ=భయరహితమైన,కరాంబుజం=హస్తపద్మములుగల, విమ...బరం-విమల=స్వచ్ఛమైన, గంధ=మంచిగంధమును, పుష్ప=పుష్పములును, అంబరం=వస్త్రమునుగల, ప్రస...క్షణం-ప్రసన్న=ప్రకాశమగు, వదన=ముఖమును, ఈక్షణం=కన్నులునుగల, సక...పిణం-సకల=సమస్తమైన, దేవతా=దేవతలయొక్క, రూపిణం=స్వరూపముగల, గురుం= గురువును, శిరసి=శిరస్సునందలి, సహ...పంకజే, సహస్రదళ=వేయిరేకులుగల, పంకజే=పద్మమునందున్న, హంసగం=హంసస్వరూపమును బొందినవానిగాను, తద...ర్వం-తత్ =ఆగురువుయొక్క, అభిధాన=పేరే, పూర్వం=ముందుకలుగునట్లు, స్మరేత్ =తలంచవలయును.

తా॥ చంద్రకాంతిగలవాడును సంసారాగ్నిసంతప్తులకుభయనాశనమునుగాబుగాజేసెడి-అభయముద్రతోఁగూడుకొనిన హస్తాబ్జములుగలవాడును, నిర్మలములగుగంధపుష్పాంబరములుగలవాడును, ప్రకాశమానమగు ముఖనేత్రములు గలవాడును, సర్వదేవతా స్వరూపుండునగు

సద్గురువును శిరస్సునందలిసహస్రారపద్మమునందుండెడి హంసస్వరూపమునుంబొందినవానినిగా-ఆగురువుయొక్క నామోచ్ఛారణపూర్వకముగాతలంచవలయును.

> ఇతిధ్యానం - ఈప్రకారముధ్యానము, అథమానసోపచారైః శ్రీగురుంపూజయేత్.

టీక॥ అథ=అనంతరము, మానస=మనస్సంబంధములైన, ఉపచారైః=ఉపచారములచేత, శ్రీగురుం=ప్రకాశించునట్టి సద్గురువును, పూజయేత్=పూజించవలయును.

తా॥ ధ్యానానంతరమునందు మనస్సుయందలి భావనారూపములైనయుపచారములచేతసద్గురువునుబూజించవలయును, అవియేవియనిన.

> వా॥ లం-పృథివ్యాత్మనేగంధ తన్మాత్రా ప్రకృత్యానందాత్మనే
> శ్రీగురుదేవాయనమః। పృథివ్యాత్మకంగంధంసమర్పయామి॥౧॥

టీక॥ లంపృథివ్యాత్మనే-లం=అను బీజస్వరూపమైన భూమియొక్క స్వరూపముగలవాడును, గంధతన్మాత్రా ప్రకృత్యా=గంధతన్మాత్రయొక్క-స్వభావముచేత, ఆనందాత్మనే=ఆనందరూపుండునున్నగు, శ్రీగురుదేవాయ=ప్రకాశించునట్టిగురువనెడి దేవునికొఱకు, నమః = నమస్కారము, పృథివ్యాత్మకం=భూరూపమగు, గంధం = చందనమును, సమర్పయామి=అర్పించుచున్నాను.

> వా॥ హం-ఆకాశాత్మనేశబ్ద తన్మాత్రాప్రకృత్యానందాత్మనే
> శ్రీగురుదేవాయనమః। ఆకాశాత్మకంపుష్పంసమర్పయామి॥౨॥

టీక॥ హం-ఆకాశాత్మనే = హంఅను బీజాత్మకమైన ఆకాశరూపుడును, శబ్దతన్మాత్రా ప్రకృత్యా = శబ్దతన్మాత్రముయొక్క స్వభావముచేత, ఆనందాత్మనే=ఆనందరూపుండునునగు,శ్రీగురుదేవాయ=ప్రకాశించెడిగురువను దేవునికొఱకు,నమః=నమస్కారము,ఆకాశాత్మకం=ఆకాశరూపమైన,పుష్పం=పుష్పమును,సమర్పయామి=అర్పించుచున్నాను.

వా॥ యం - వాయ్వాత్మనేస్పర్శతన్మాత్రాప్రకృత్యానందాత్మనే
శ్రీగురుదేవాయనమః।వాయ్వాత్మకంధూపంసమర్పయామి॥ ౩॥

టీక॥ యం-వాయ్వాత్మనే = యం అనుబీజాత్మకమైన, వాయుస్వరూపుడును, స్పర్శతన్మాత్రాప్రకృత్యా=స్పర్శతన్మాత్రముయొక్క-స్వభావముచేత, ఆనందాత్మనే=ఆనందరూపుండుననగు,శ్రీగురుదేవాయ=ప్రకాశించునట్టిగురువను దైవముకొఱకు, నమః=నమస్కారము,వాయ్వాత్మకం=వాయుస్వరూపమైన, ధూపం = పరిమళించెడిపొగను, సమర్పయామి=అర్పించుచున్నాను.

వా॥ రం-తేజ ఆత్మనేరూపతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే
శ్రీగురుదేవాయనమః। తేజ ఆత్మకందీపంసమర్పయామి॥ ౪॥

టీక॥ రం_తేజఆత్మనే= రం అను బీజాత్మకమగు తేజోరూపుడును, రూపతన్మాత్రాప్రకృత్యా= రూపతన్మాత్రముయొక్క-స్వభావముచేత, ఆనందాత్మనే=ఆనందరూపుండుననగు, శ్రీగురుదేవాయ=ప్రకాశించెడిగురువను దేవునికొఱకు, నమః=నమస్కారము, తేజఆత్మకం= తేజోరూపమైన, దీపం=దీపమును, సమర్పయామి=అర్పించుచున్నాను.

వా॥ వం-అబాత్మనే రసతన్మాత్రాప్రకృత్యానందాత్మనే
శ్రీగురుదేవాయనమః।అబాత్మకంనైవేద్యంసమర్పయామి॥ ౫॥

టీక॥ వం-అబాత్మనే = వం అను బీజాత్మకమగు ఉదకస్వరూపుడును, రసతన్మాత్రాప్రకృత్యా= రసతన్మాత్రముయొక్క- స్వభావముచేత, ఆనందాత్మనే=ఆనందరూపుండుననగు, శ్రీగురుదేవాయ=ప్రకాశించునట్టిగురువను దేవునికొఱకు,నమః=నమస్కారము, అబాత్మకం=ఉదకరూపమైన,నైవేద్యం=నివేదనమును,సమర్పయామి=అర్పించుచున్నాను.

వా॥ సం సర్వాత్మనే సర్వతన్మాత్రాప్రకృత్యానందాత్మనే శ్రీగురు
దేవాయనమః। సర్వాత్మకాన్ సర్వోపచారాన్ సమర్పయామి॥

టీక॥ సం-సర్వాత్మనే=సం అను బీజాత్మకమగుసమస్తస్వరూపుడును,సర్వతన్మాత్రాప్రకృత్యా=సమస్తతన్మాత్రలయొక్క-స్వభావముచేత,

ఆనందాత్మనే= ఆనందస్వరూపుండునునగు, శ్రీగురుదేవాయ=ప్రకాశించునట్టిగురువను దేవునికొఱకు, నమః=నమస్కారము,సర్వాత్మకాన్=సమస్తస్వరూపములైన,ఉపచారాన్=ఉపచారములను,సమర్పయామి = అర్పించుచున్నాను.

తా॥ లం, హం, యం, రం, వం, సం, ఈ బీజములే స్వరూపములుగాగల, భూమియును, ఆకాశమును, వాయువును, తేజస్సును, ఉదకమును, భూమ్యాదిసమస్తతన్మాత్రలును, ఇవియె స్వరూపముగాగలిగినవాడును, గంధము, శబ్దము, స్పర్శము, రూపము, రసము, వీటియొక్క వేరువేరుస్వభావములతోను, ఈ సమస్తములగు గంధము మొదలయిన అయిదు తన్మాత్రలయొక్క కూడికవల్లనైన స్వభావముతోను ఆనందరూపుండునునగుసద్గురువుకొఱకు,భూమి,ఆకాశము, వాయువు, తేజస్సు, ఉదకము, క్రమముగా వీటిస్వరూపములైన గంధము, పుష్పము ధూపము, దీపము, నైవేద్యములనెడి సమస్త యుపచారములను మనోభావముతో సమర్పించుచున్నాను.

ఇతి మానస పూజా.

టీక॥ ఇట్లు మనస్సుతోనైనపూజచేసి.

అథ శ్రీగురుమాలామంత్రః.

టీక॥ అథ=అనంతరము, శ్రీ...మంత్రః, శ్రీ=ప్రకాశమానమగు, గురుమాలామంత్రః=గురుమాలయను పేరుగల మంత్రము.

తా॥ సులభము.

ఓం నమః శ్రీగురుదేవాయ పరమపురుషాయ సర్వదేవతా
వశీకరాయ సర్వారిష్టవినాశనాయ సర్వమంత్రచ్ఛేదనాయ
త్రైలోక్యంవశమానాయస్వాహా॥

టీక॥ పరమపురుషాయ-పరమ=శ్రేష్ఠుడైన, పురుషాయ= పరిపూర్ణుడగు పురుషస్వరూపుడును, సర్వ-కరాయ-సర్వదేవతా = సమస్తదేవ

తలను, వశీకరాయ=స్వాధీనముగాగలవాఁడును, సర్వా...నాయ = స ర్వ=సమస్తములైన, అరిష్ట=అశుభములను, వినాశనాయ = నశింపఁజే యువాఁడును, సర్వ...నాయ-సర్వ=సమస్తములైన, మంత్ర = మంత్ర ములను, భేదనాయ=ఖండించువాఁడుననగు, శ్రీగురుదేవాయ= ప్రకాశ మానుండగుసద్గురువైనదేవునికొఱకు, ఓంనమః=నమస్కారము, త్రై లోక్యం=మూఁడులోకములను, వశం=స్వాధీనమును, ఆనయస్వాహా = పొందించుమా.

తా॥ పరమపురుషుఁడును, సమస్తదేవతలను స్వాధీనముగా గల వాఁడును, సమస్త అమంగళములనుబోఁగొట్టెడివాఁడును, సమస్త మంత్ర ములను ఖండించెడివాఁడునగు సద్గురువుకొఱకు నమస్కారము. అట్టి పరమపురుషుండవగు-ఓసద్గురువా, నాకుసమస్తలోకములనుస్వాధీనము చేయుము.

ఇతి శ్రీస్కాన్దపురాణే ఉత్తరఖండే ఉమామహేశ్వరసంవాదే
శ్రీగురుగీతామాలామంత్రప్రతిపాదకం
నామప్రథమోఽధ్యాయః.

---

గద్య * ఇట్లు స్కాందపురాణాంతర్గత ఉత్తర ఖండమునందలి ఉమా
మహేశ్వర సంవాదమునందు, శ్రీగురుగీతామాలామంత్రమును
ప్రతిపాదించెడి, శ్రీమద్భాగవతకృష్ణదేశికప్రభుస్వాముల
వారిప్రియశిష్యుఁడైన, ఫీల్ఖానా - శంకరరావు
గారిచే, టీకాతాత్పర్యములను
రచియింపఁబడినప్రథమాధ్యాయము
సమాప్తము.

---

శ్రీకృష్ణపరబ్రహ్మార్పణమస్తు.

# సుజ్ఞానదీపమను * గురుగీతలు.

## ద్వితీయాధ్యాయప్రారంభము.

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ । నిర్గుణాయగుణాత్మనే ।
సమస్తజగదాధార । మూర్తయేబ్రహ్మణేనమః॥ ౧॥

టీక॥ అచిం...పాయ, అచింత్యే = తలంచశక్యముగాని, అవ్యక్త = అగుపడని,రూపాయ=స్వరూపముగలదియును, నిర్గుణాయ=గుణరహితమును, గుణాత్మనే-గుణ=సత్వాదిగుణములయొక్క, ఆత్మనే= స్వరూపముగలదియును,సమ... ర్తయే-సమస్తజగత్ =అన్నిలోకములను, ఆధార=మోసికొనియుండెడి, మూర్తయె= ఆకారముగలదియునగు, బ్రహ్మణే=పరబ్రహ్మముకొఱకు, నమః=నమస్కారము.

తా॥ పరబ్రహ్మము, బుద్ధిమొదలగువానికి గోచరముగాకపోవుటవలన-అచింత్యమును, చూచుటకుశక్యమైననామరూపములు లేకపోవుటవలన-అవ్యక్తమును,సత్వరజస్తమస్సులనుగుణములకతీతముగనుక- నిర్గుణమును, ఆపరబ్రహ్మాశ్రయములేక సత్వము మొదలగు గుణముల యొక్క ప్రచారములేకపోవుటవలన గుణస్వరూపమును, ఇట్లు నామ రూపాత్మకమైనజగత్తులకుముఖ్యమైన-ఆధారముగానున్నది,అట్టిపరబ్రహ్మముకొఱకు నమస్కారమగును గాక.

ఋషయః ఊచుః.

టీక॥ ఋషయః=శౌనకాదిమహామునులు, ఊచుః=పలికిరి.

శ్లో॥ గుహ్యాద్గుహ్యతరంసారం । గురుగీతావిశేషతః ।
త్వత్ప్రసాదాచ్ఛ్రోతవ్యా । తత్సర్వంబ్రూహిసూతనః॥ ౨॥

టీక॥ హేసూత=ఓయిసూతుడా, త్వత్ప్రసాదాచ్ఛ-త్వత్ = నీయొక్క, ప్రసాదాచ్ఛ=అనుగ్రహమువలన, విశేషతః=అధికముగా, గురుగీ

తా=గురుగీత,శ్రోతవ్యా=వినదగినది, గుహ్యాత్ =రహస్యముకంటె, గుహ్యతరం=మిక్కిలిరహస్యమైన, సారం=శ్రేష్ఠమగు, తత్సర్వం= ఆసమస్తమును, నః=మాకు, బ్రూహి=చెప్పుము.

తా॥ ఓయిసూతా, గురుగీతలు నీయనుగ్రహమునుండి వినదగినవి, గనుకసమస్తరహస్యములలో మిక్కిలి రహస్యమును,శ్రేష్ఠమునునగు ఆసమస్తమును మాకుచెప్పుమాయని శౌనకాదిమహాఋషులుసూతునింగూర్చియడిగిరి.

సూత ఉవాచ.

టీక॥ సూతః=సూతుడు, ఉవాచ=పలికెను.

శ్లో॥ కైలాసశిఖరేరమ్యే । భక్తిసాధనహేతవే ।
ప్రణమ్యపార్వతీభక్త్యా । శంకరంపరిపృచ్ఛతి॥ ౩॥

టీక॥ పార్వతీ=పార్వతీదేవి, రమ్యే=మనోహరమగు, కైలా...రే-కైలాస = కైలాసపర్వతముయొక్క, శిఖరే=కొనయందు, భక్త్యా = భక్తిచేత, శంకరం=ఈశ్వరునిగూర్చి,ప్రణమ్య=నమస్కరించి, భక్తి...తవే-భక్తిసాధన= భక్తిసాధనముయొక్క, హేతవే = కారణముకొఱకు, పరిపృచ్ఛతి=అడుగుచున్నది.

తా ॥ సూతుడుచెప్పెను, మనోహరమగు కైలాసపర్వతమునందు పార్వతి భక్తితో ఈశ్వరునికి నమస్కరించిభక్తిసాధనముయొక్క కారణముకొఱకు అడుగుచున్నది.

పార్వత్యువాచ.

టీక॥ పార్వతీ=పార్వతిదేవి, ఉవాచ=పలికెను.

శ్లో॥ ఓంనమోదేవదేవేశ । పరాత్పరజగద్గురో ।
సదాశివమహాదేవ । గురుదీక్షాంప్రయచ్ఛమే॥ ౪॥

టీక॥ ఓం-మంగళము, హేదేవదేవ=దేవతలకు దేవుండవగుఓస్వామీ, ఈశ=నియామకుడా, పరాత్పర = అవ్యక్తాదికముకంటెను పరమైనవాడా, జగద్గురో=లోకములకు గురుడా, సదాశివ= ఎల్లప్పుడును

మంగళమైనవాఁడా, మహాదేవ=గొప్పదేవుఁడవగునోస్వామీ, నమః=నమస్కారము, మే=నాకు, గురుదీక్షాం=గురుదీక్షను,ప్రయచ్ఛ=ఇమ్ము.

తా॥ పార్వతీదేవి పరమేశ్వరునికొఱకు నమస్కరించి స్వామీ నాకు గురుదీక్షను ఇమ్మాయని అడిగెను.

శ్లో॥ భగవన్ సర్వధర్మజ్ఞ । వ్రతానాంవ్రతనాయకం ।
బ్రూహిమేకృపయాశంభో । గురుమాహాత్మ్యముత్తమం॥ ౫॥

టీక॥ భగవన్=పూజ్యుడగునోస్వామీ,సర్వ...జ్ఞ- సర్వ = సమస్తములైన, ధర్మ=న్యాయములను,జ్ఞ=తెలిసినవాఁడా,శంభో=సుఖకారణుండవగు,నోఈశ్వరుడా,(త్వం=నీవు) కృపయా=దయతో, మే=నాకు, ఉత్తమం=శ్రేష్ఠమును, వ్రతానాం=వ్రతములలో, వ్రతనాయకం=నియమములకుప్రభువైన,గురుమాహాత్మ్యం=గురుమహిమను,బ్రూహి=చెప్పుము.

తా॥ ఓ ఈశ్వరుడా, నీవు మిక్కిలిదయతోసమస్తవ్రతములలో ప్రభువును శ్రేష్ఠమునగు గురుమాహాత్మ్యమును నాకుచెప్పుము.

శ్లో॥ కేనమార్గేణభోస్వామిన్ । దేహీబ్రహ్మమయోభవేత్ ।
తత్కృపాంకురుమేస్వామిన్ । నమామిచరణౌతవ॥ ౬॥

టీక॥ భోస్వామిన్=ఓప్రభువా, దేహి=జీవుడు, కేన=ఏ,మార్గేణ=మార్గముచేత, బ్రహ్మమయః=పరబ్రహ్మస్వరూపుడు,భవేత్=అగును,తత్ తత్కృపా=అట్టిదయను, మే=నాకు, కురు=చేయుము, ఓస్వామిన్ = ఓ ప్రభువా, తవ=నీయొక్క, చరణౌ=పాదములనుగూర్చి, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ఇట్లు ప్రార్థించిపార్వతీదేవి, ఓస్వామీజీవుడు, ఏమార్గముద్వారాపరబ్రహ్మస్వరూపుడగును. నాకొఱకు అట్టియనుగ్రహమునుదయచేయుము. ఓస్వామీ మీపాదములకు నమస్కరించుచున్నాననిపలికెను.

శ్రీమహాదేవ ఉవాచ.

టీక॥ శ్రీ...వః శ్రీ=ప్రకాశమానుడగు, మహాదేవః=ఈశ్వరుడు, ఉవాచ=పలికెను.

శ్లో॥ యస్యదేవేవరాభక్తి । ర్యథాదేవేతథాగురౌ ।
తస్యైతేకథితాహ్యర్థాః । ప్రకాశంతేమహాత్మనః॥ ౭॥

టీక॥ యస్య=ఎవనికి, దేవే= దేవునియందు, వరా=శ్రేష్ఠమగు, భక్తి=భక్తి, (పూజ్యానురాగము,)యథా=ఏప్రకారమో, తథా=అప్రకారముగా, దేవే=దైవస్వరూపుడగు, గురౌ=గురునియందు, (పరబ్రహ్మస్వరూపమును తెలియఁజేసెడిగురునియందు,) అస్తి=కలదో, తస్య = అటువంటి, మహాత్మనః=గొప్పమనస్సుగలవానికి, ఏతే=ఈ, కథితాః=చెప్పబడిన, అర్థాః=ప్రయోజనములు,ప్రకాశంతేహి=ప్రసిద్ధముగా తెలియుచున్నవి.

తా॥ఎవనికిదేవునియందువలెనే,పరమాత్మస్వరూపమును తెలియజేసెడిసద్గురునియందుశ్రేష్ఠమగుభక్తిగలదోయట్టిమహాత్మునికిఈచెప్పడివిశేషార్థములన్నియుబాగుగ తెలియుచున్నవనిమహాదేవుడుపలికెను.

శ్లో॥ మమరూపాసిదేవిత్వం । త్వద్భక్త్యర్థంవదామ్యహం ।
లోకోపకారకః ప్రశ్నో । నకేనాపికృతఃపురా ॥ ౮॥

టీక॥ హేదేవి=ఓపార్వతీ, త్వం=నీవు, మమ = నాయొక్క, రూపా=స్వరూపురాలవు, అసి=అగుచున్నావు, అహం=నేను, త్వద్భక్త్యర్థం=నీభక్తికొఱకు, వదామి=చెప్పుచున్నాను, పురా=ముందు, కేనాపి=ఎవరిచేతనున్ను,లోకోపకారకః=లోక-జనులకు, ఉపకారకః = సహాయమగు, ప్రశ్న=ప్రశ్న,నకృతః=చేయఁబడలేదు.

తా॥ ఓపార్వతీ, పూర్వము ఇట్టి లోకోపకారమగుప్రశ్న ఎవరిచేతను జేయబడలేదు, నీవుప్రత్యక్షముగా నాస్వరూపురాలవై తివి- గనుక నీభక్తికొఱకై నేను చెప్పుచున్నానువినుము.

శ్లో॥ యోగురుస్సశివప్రోక్తో । యశ్శివస్సగురుస్మృతః ।
వికల్పంయస్తుకుర్వీత । సనరోగురుతల్పగః॥ ౯॥

టీక॥ యః=ఎవడు, గురుః=పరమాత్మస్వరూపమును దెలియఁజేయునట్టిగురువో, సః=వాడు, శివః=ఈశ్వరుడుగా, ప్రోక్తః = చెప్పబడుచు

న్నాడు, యః=ఎవడు, శివః=ఈశ్వరుడో, సః=వాడు, గురుః=గురువు గా, స్మృతః=చెప్పబడెను, యస్తు=ఎవడైతే, వికల్పం= దీనికిసంశయ మును, కుర్వీత=చేయునో, సః నరః=ఆమనుష్యుడు, గురుతల్పగః = గురువుయొక్క భార్యనుపొందినవాడు, (భవతి=అగుచున్నాడు.)

తా॥ ఓపార్వతీ, పరమాత్మస్వరూపమును తెలియఁజేయునట్టిగురువు ఈశ్వరుడుగాను, ఈశ్వరుడు గురువుగాను జెప్పబడినది. ఇందు యీవిషయమై సంశయమనస్సుగలమనుజుడు గురుభార్యను బొందినదోషముగలవాడగుచున్నాడు.

శ్లో॥ దుర్లభంత్రిషులోకేషు । తచ్ఛృణుష్వవదామ్యహం ।
గురుర్బ్రహ్మవినానాన్య । స్సత్యంసత్యంవరాననే॥ ౧౦॥

టీక॥ త్రిషులోకేషు=మూడులోకములయందును, దుర్లభం= పొందనలవిగాని, తత్=దానిని, అహం=నేను, వదామి=చెప్పుచున్నాను, శృణుష్వ=వినుము, హేవరాననే=శ్రేష్ఠమగుముఖముగలఓపార్వతీ, గురుః =గురువు, బ్రహ్మవినా=పరబ్రహ్మముతప్ప, అన్యః= ఇతరుడు, న=కాడు, సత్యంసత్యం=నిజము,నిజము.

తా॥ ఓపార్వతీ మూడులోకములయందును పొందుటకలవిగాని దానిని చెప్పెదనువినుము. పరమాత్మస్వరూపమును దెలియఁజేసెడిగురువు పరమాత్మస్వరూపుడేగాని అన్యుడుగాడు. ఇది సత్యము సత్యము (మిక్కిలియాదరణకొఱకు రెండుసార్లు చెప్పబడినది.)

శ్లో॥ వేదశాస్త్రపురాణాని । ఇతిహాసాదికానిచ।
మంత్రయంత్రాదివిద్యానాం । స్మృతిరుచ్చాటనాదికం॥ ౧౧॥

శ్లో॥ శైవశాక్తాగమాదీని । హ్యన్యేచబహవోమతాః ।
అపభ్రంశాస్సమస్తానాం । జీవానాంభ్రాంతచేతసాం॥ ౧౨॥

టీక॥ వేద...ణాని = వేద - ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగు వేదములును, శాస్త్ర=వ్యాకరణము మొదలైనశాస్త్రములును, పురాణాని=బ్రహ్మాండాదిపురాణములును,ఇతిహాసాదికానిచ=భారతము మొదలై

న్రప్రాచీనపుకథలును, మంత్ర...ధ్యానాం = మంత్ర, గాయత్ర్యాదిమం త్రములును, యంత్ర=యంత్రములును, (బంగారురాగి మొదలగువాటిరేకు కు రేకులయందు ఆయామంత్రములతో నుద్ధారములప్రకారము వ్రాయబడునవి,) ఆది=మొదలైన, విద్యానాం=విద్యలయొక్క, స్మృతిః= స్మరణమును,ఉచ్చాటనాదికం=ఉచ్చాటనము మొదలైనవియును, (ఉచ్చాటనము, వశ్యము, స్తంభనము, మోహనము, విమోచనము, మారణములను ఈ ఆరును మంత్రముయొక్క క్రియలు.)

టీక॥ శైవ...దీని-శైవ = శివసంబంధములైన, శాక్త = శక్తిసంబంధములైన, ఆగమాదీని=ఆగమములు మొదలైనవియును, అన్యేచ=ఇతరములగు, బహవః=అనేకములగు, మతాః=సాంఖ్యము మొదలైనమతములును, (ఇవియన్నియును,)భ్రాంతచేతసాం...భ్రాంత=భ్రమణమునుపొందిన, చేతసాం=మనస్సులుగల, సమస్తానాం జీవానాం=సమస్తములైనజీవులయొక్కయు, అపభ్రంశాః=వెఱ్ఱిపనులుగా, (మనోభ్రమవల్లనైన పనులుగా, భవంతి=అగుచున్నవి.)

తా॥ వేదశాస్త్రపురాణేతిహాసములును మంత్రయంత్రాదికములును శైవాగమాదులును, అనేకములగు సాంఖ్యాది మతములును, ఇవియన్నియును- అజ్ఞానమువలనస్వస్వరూపమును దెలియక అవాస్తవమగు దేహాదిప్రపంచమునుజూచుచుండెడి జీవులయొక్క అజ్ఞానపుపనులే.

శ్లో॥ జపస్తపోవ్రతంతీర్థం । యజ్ఞోదానంతథైవచ ।
గురుతత్త్వమవిజ్ఞాయ - సర్వంవ్యర్థంభవేత్ప్రియే॥ ౧౩॥

టీక॥ జపః=జపమును, (మంత్రమునుఆవృత్తిచేయుట,) తపః = తపస్సును, వ్రతం=నియమమును, తీర్థ=పుణ్యక్షేత్రమును, యజ్ఞః= యాగమును, దానం=ఈవియును, తథైవచ=ఆప్రకారముగానే, సర్వం= సమస్తమును, హేప్రియే=ఇష్టురాలవగుఓపార్వతీ, గురుతత్త్వం=గురువుయొక్కనిజస్వరూపమును, అవిజ్ఞాయ= తెలిసికొనక, వ్యర్థం= నిష్ఫలమైనదిగా, భవేత్ =అగును.

తా॥ ఓపార్వతీ, జనుఁడు గురుస్వరూపముయొక్క నిజస్థితిని తెలిసికొనక చేసెడిజపమును,తపస్సును, నియమమును,గంగాది పుణ్యతీర్థసేవయును, యాగమును,గోదానము మొదలైన ఇవియన్నియును, నిష్ఫలమైనవేయగును.

శ్లో॥ గురుబుద్ధ్యాత్మనోనాన్యత్ । సత్యంసత్యంవరాననే।
తల్లాభార్థంప్రయత్నస్తు । కర్తవ్యశ్చమనీషిభిః ॥ ౧౪॥

టీక॥ హేవరాననే=శ్రేష్ఠమైనముఖముగలఓపార్వతీ, గురుబుద్ధ్యా సద్గురువుయొక్క జ్ఞానముచేత, ఆత్మనః=ఆత్మస్వరూపముకంటె, అన్యత్ =ఇతరమైనది, న=లేదు, సత్యంసత్యం=నిజమునిజము, త...ర్థం-తత్ =ఆఆత్మయొక్క, లాభార్థం=లాభముకొఱకు, మనీషిభిః= విద్వాంసులచేత, ప్రయత్న=ప్రయత్నమును, కర్తవ్యః=చేయదగినది.

తా॥ ఓపార్వతీ, సద్గురుజ్ఞానముచేత ఆత్మకంటెనన్యమైనదేదియును లేదు, ఇది సత్యముసత్యము. అట్టి ఆత్మస్వరూపమును బొందుటకు విద్వాంసులచే ప్రయత్నించవలయును.

శ్లో॥ గూఢావిద్యాజగన్మాయా । దేహశ్చాజ్ఞానసంభవః ।
విజ్ఞానంతత్ప్రసాదేన । గురుశబ్దేనకథ్యతే ॥ ౧౫॥

టీక॥ జగత్ =లోకము, గూఢా=రహస్యమును, అవిద్యా = అజ్ఞానస్వరూపమునగు, మాయా=ప్రకృతియే, దేహశ్చ=శరీరమును,అజ్ఞానము వలనబుట్టినది, తత్ =దానిని, విజ్ఞానం=తెలిసికొనుట, ప్రసాదేన=నిర్మలమగు, గురుశబ్దేన=గురుశబ్దము, కథ్యతే=చెప్పబడుచున్నది.

తా॥ లోకము అతిరహస్యమైన అజ్ఞానస్వరూపమగు ప్రకృతిగానున్నది. దేహము పరబ్రహ్మస్వరూపజ్ఞానము లేకపోవుటవలనకలుగుచున్నది. అట్టి అజ్ఞాననాశనరూపమైన పరబ్రహ్మవిజ్ఞానమునిర్మలమగుగురుశబ్దముచేతఁజెప్పంబడుచున్నది.

శ్లో॥ యదంఘ్రికమలద్వంద్వం । ద్వంద్వతాపనివారకం।
తారకంభవసింధోశ్చ । శ్రీగురుంప్రణమామ్యహం॥ ౧౬॥

టీక॥ యద...ద్వంద్వం-యత్ = ఏగురువుయొక్క, అంఘ్రికమ లు=పాదపద్మములయొక్క, ద్వంద్వం జంట,ద్వం...కం-ద్వంద్వ=ఝం టలను,తాప=సుఖదుఃఖాదిసంతాపములను, నివారకం=పోగొట్టునదియు ను,భవసింధోః=సంసారసముద్రమునకు, తారకంచ = దాటించునదియు ను, (భవతి=అగుచున్నదో, తం=అటువంటి,) శ్రీగురుం=ప్రకాశమానుడ గుసద్గురువునుగూర్చి,అహం=నేను,ప్రణమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ఏసద్గురువుయొక్కపాదకమలములు శీతోష్ణము మొదలై నద్వంద్వదుఃఖములనుబోగొట్టునవియును, సంసారసముద్రమును తరింపఁ జేయునవియునగుచున్నవో, అట్టిసద్గురువునుగూర్చి నేను నమస్కరించు చున్నానని ఈశ్వరుడు గురువందనమును జేసిచెప్పుచున్నాడు.

శ్లో॥ దేహీబ్రహ్మభవేద్యస్మాత్ । త్వత్కృపార్థంవదామితత్ ।
సర్వపాపవిశుద్ధాత్మా । శ్రీగురోఃపాదసేవనాత్ ॥ ౧౭॥

టీక॥ దేహీ=జీవుడు, యస్మాత్=ఏకారణమువలన, శ్రీగురోః= ప్ర కాశమానుడగుసద్గురువుయొక్క, పాదసేవనాత్=పాదములయొక్క సేవవలన, సర్వ...త్మా-సర్వ=సమస్తమైన, పాప=పాపములవలన, వి శుద్ధ=పరిశుద్ధమగు, ఆత్మా=స్వరూపముగలవాడై,బ్రహ్మ=పరబ్రహ్మస్వ రూపము,భవేత్=అగునో, తత్ = దానిని,త్వం...ర్థం-త్వత్=నీయంద లి; కృపార్థం=దయకొఱకు, వదామి=చెప్పుచున్నాను.

తా॥ జీవుడెందువలనసద్గురుపాదపద్మముల సేవనుండిసమస్తపా పములునశించుటవలన పరిశుద్ధస్వరూపుడై పరబ్రహ్మస్వరూపముగునో, దానిని,నీయందుండెడి దయతోచెప్పుచున్నానువినుము.

శ్లో॥ సర్వతీర్థావగాహస్య । సంప్రాప్నోతిఫలంనరః ।
గురోఃపాదోదకంపీత్వా । శేషంశిరసిధారయన్॥ ౧౮॥

టీక॥ నరః=మనుష్యుడు, గురోః=సద్గురువుయొక్క, పాదోదకం =పాదములయందలియుదకమును, పీత్వా=త్రాగి, శేషం=మిగిలినయు దకమును, శిరసి=తలయందు, ధారయన్=ధరించినవాడై, సర్వ...హ

స్య-సర్వ=సమస్తములైన, తీర్థ=గంగాదిపుణ్యతీర్థములయందు, అవగాహ
స్య= స్నానముయొక్క, ఫలం = లాభమును,సంప్రాప్నోతి = పొందు
చున్నాడు.

తా॥ మనుజుడు సద్గురువుయొక్క పాదప్రక్షాళనోదకమును
త్రాగి మిగిలినజలమును శిరస్సునధరించిన సమస్తపుణ్యతీర్థ స్నానము
లవల్లనైన ఫలమునుబొందుచున్నాడు.

శ్లో॥ శోషణంపాపపంకస్య । దీపనంజ్ఞానతేజసః।
గురోఃపాదోదకంసమ్యక్ । సంసారార్ణవతారకం॥ ౧౯॥

టీక॥ పాపపంకస్య=పాపమనెడిబురదకు, శోషణం = ఎండింపజే
యునదియును, జ్ఞాన తేజసః=పరబ్రహ్మజ్ఞానమను తేజస్సునకు, దీపకం =
ప్రకాశకమైనదియునగు, గురోః=గురువుయొక్క, పాదోదకం=పాదజ
లము, సమ్యక్=విశేషముగా,సం...కం-సంసార=సంసారమనెడి, అర్ణవ
=సముద్రమును, తారకం=దాటించునదిగా, (భవతి=అగుచున్నది.)

తా॥ పాపమనెడియడుసును శుష్కింపజేయునదియును, పర
బ్రహ్మజ్ఞానమునకు ప్రకాశకమునునగు గురుపాదోదకముసంసారసముద్ర
మును - తరింపజేయుచున్నది.

శ్లో॥ అజ్ఞానమూలహరణం । జన్మకర్మనివారణం।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం । గురుపాదోదకంపిబేత్॥ ౨౦॥

టీక॥ అజ్ఞా...రణం- అజ్ఞాన=అజ్ఞానముయొక్క, మూల= కారణ
మును,హరణం=హరించునదియును,జన్మ...రణం-జన్మ=పుట్టుకయొక్క
కర్మ=కర్మను, నివారణం=నశింపజేయునదియునునగు, గురు...దకం-
గురు=గురువుయొక్క, పాదోదకం=పాదజలమును, జ్ఞాన...ద్ధ్యర్థం -
జ్ఞాన=పరబ్రహ్మజ్ఞానముయొక్కయు, వైరాగ్య=విరక్తియొక్కయు,(దా
రాపుత్రాదులయందాశలేకయుండుట,)సిద్ధ్యర్థం=ప్రాప్తికొఱకు, పిబే
త్ =త్రాగవలయును.

తా॥ మనుష్యుడు సమస్తజగత్కారణమైన అజ్ఞానకారణమును
నశింపజేయునట్టిదియును- జన్మకర్మనివారకమును - నగుసద్గురుపాదోదక
మునుబ్రహ్మజ్ఞానవైరాగ్యములకొఱకు త్రాగవలయును.

శ్లో॥ గురుపాదోదకంపానం। గురోరుచ్ఛిష్టభోజనం।
గురుమూర్తేస్సదాధ్యానం । గురుస్తోత్రంసదాజపః॥ ౨౧॥

టీక॥ గురు...దకం- గురు=సద్గురువుయొక్క, పాదోదకం= పాద జలమును, పానం=త్రాగడమును, గురోః=గురువుయొక్క, ఉచ్ఛి... జనం-ఉచ్ఛిష్ట=ఎంగిలిసి, భోజనం=తినుటను, సదా=ఎల్లప్పుడును, గురుమూర్తేః=గురుస్వరూపముయొక్క, ధ్యానం=ధ్యానమును, సదా=ఎల్లప్పుడును, గురుస్తోత్రం=గురుస్తవమును, జపః=జపించుటయును, (కర్తవ్యం=చేయదగినది.)

తా॥ జనుడు గురుపాదోదకమును ద్రాగవలయును. గురువుయొక్క ఎంగిలినితినవలయును. ఎల్లప్పుడును గురుస్వరూపమును ధ్యానించవలయును. ఎల్లప్పుడును గురుస్తోత్రమును జపించవలయును.

శ్లో॥ స్వదేశికస్యైవచనామకీర్తనం । భవేదనంతస్యశివస్యకీర్తనం।
స్వదేశికస్యైవచనామచింతనం । భవేదనంతస్యశివస్యచింతనం॥

టీక॥ స్వ...స్యైవచ-స్వ=తనయొక్క, దేశికస్యైవచ = జ్ఞానోపదేశమును జేసిన గురువుయొక్కయే, నామకీర్తనం- నామ=పేరుయొక్క, కీర్తనం=స్తుతి, అనంతస్య=అంతములేని, శివస్య=ఈశ్వరునియొక్క, కీర్తనం=స్తుతియే, భవేత్=అగును, స్వదేశికస్యైవచ-స్వ=తనయొక్క, దేశికస్యైవచ=గురువుయొక్కయే, నామచింతనం=పేరుయొక్కతలంచుట, అనంతస్య=అంతములేని, శివస్య=ఈశ్వరునియొక్క, చింతనం=తలంచుట, భవేత్=అగును.

తా॥ జనుడు తనకు బ్రహ్మజ్ఞానోపదేశము చేసిన గురువుయొక్క నామమును స్తోత్రముచేయుటయే- అంతములేని పరమశివునియొక్క నామస్తుతి యగును. ఆగురువుయొక్క నామమునుదలంచుటయే-ఆపరమశివునియొక్క నామమును తలంచుటయగును.

శ్లో॥ యత్పాదరేణుకణికా నిత్యం । కోపిసంసారవారిధౌ।
సేతుబంధాయతేనాథం దేశికంతముపాస్మహే॥ ౨౩॥

టీక॥ అథ=అనంతరము, కోపి = అనిర్వచనీయమగు, యత్పా ... దైవ-యత్ =ఏగురువుయొక్క, పాద=చరణములయందలి, రేణురైవ =పరాగమే, నిత్యం=ఎల్లప్పుడును, సంసారవారిధౌ = సంసారమనెడి సముద్రమునందు, సేతుబంధాయతేచ = వారధివలెనెయగుచున్నదో; తం=అటువంటి, దైశికం = బ్రహ్మజ్ఞానోపదేశమును జేసెడి గురువును, ఉపాస్మహే=సేవించుచున్నాను.

తా॥ సంసారసముద్రమును దాటుటకు, ఏగురువుయొక్క పాదరేణువే వారధిగానగుచున్నదియో, అట్టి సద్గురువును సేవించుచున్నాను.

శ్లో॥ యస్మాదనుగ్రహంలబ్ధ్వా । మహదజ్ఞానముత్సృజేత్ ।
తస్మైశ్రీదైశికేంద్రాయ । నమశ్చాభీష్టసిద్ధయే॥ ౨౮॥

టీక॥ యస్మాత్ =ఏగురువువల్లను, అనుగ్రహం=దయను, లబ్ధ్వా = పొంది, మహత్ =అధికమైన, అజ్ఞానమును, ఉత్సృజేత్ = విడుచునో; తస్మై=అటువంటి, దైశికేంద్రాయ = శ్రేష్ఠుడైనగురువుకొఱకు, అభీష్టసిద్ధయె- అభీష్ట = కోరిక, సిద్ధయే = నెఱవేరుబడుటకై, నమః = నమస్కారము, (అస్తు=అగునుగాక-)

తా॥ జనుడు ఏగురువువలనజ్ఞానోపదేశానుగ్రహమునుబొంది, విశేషమగు అజ్ఞానమునువిడుచునో, అట్టి సద్గురువుకొఱకు కోరికసిద్ధించుటకై నమస్కారమగునుగాక.

శ్లో॥ కాశీక్షేత్రంనివాసశ్చ । జాహ్నవీచరణోదకం ।
గురుర్విశ్వేశ్వరఃసాక్షాత్ । తారకంబ్రహ్మనిశ్చితం॥ ౨౯॥

టీక॥ గురుః=గురువు, సాక్షాత్ =ప్రత్యక్షముగా, విశ్వేశ్వరః = విశ్వేశ్వరుడు, నివాసశ్చ=గురువుఉండెడిస్థానము, కాశీక్షేత్రం = కాశీయనెడిపుణ్యప్రదేశము, చరణోదకం= గురువుయొక్క పాదోదకము, జాహ్నవీ=గంగ, నిశ్చితం=నిశ్చయింపఁబడిన, బ్రహ్మ = పరబ్రహ్మము, తారకం= తారకోపదేశము, (భవతి=అగుచున్నది).

తా॥ గురువే విశ్వేశ్వరుడుగాను, ఆగురుని వాసస్థలమే కాశీ క్షేత్రముగాను, ఆగురుపాదోదకమే గంగగాను, ఆగురువుచే నుపదేశింపఁబడినిశ్చయమైనపరబ్రహ్మజ్ఞానమే తారకోపదేశముగానుఅగుచున్నది.

శ్లో॥ శిరఃపాదాంకితోదేశః । గయాస్తిచాక్షయోవటః।
తీర్థరాజప్రయోగోసౌ గురుమూర్త్యైనమోనమః॥ ౨౮॥

టీక॥ శిరః=శిరస్సు,గయా=గయగాను,పాదాంకితః=పాదములచేత గురుతుగాఁజేయబడిన, దేశః = ప్రదేశము, అక్షయోవటః = నాశనములేనివటవృక్షముగాను, అసౌ=ఈగురుస్వరూపము, తీర్థరాజప్రయాగశ్చ=పుణ్యతీర్థములకు రాజైనప్రయాగక్షేత్రముగాను,అస్తి=ఉండుచున్నది,(తస్మై-అటువంటి,)గురుమూర్త్యై= గురువుయొక్క, మూర్త్యై =స్వరూపముకొఱకు, నమోనమః=నమస్కారము నమస్కారము.

తా॥ శిరస్సేగయగాను గురువుయొక్క పాదములచేత చిహ్నితమైన ప్రదేశమే అక్షయవటముగానుగురుస్వరూపమే సమస్తపుణ్యతీర్థములలో రాజైన ప్రయాగక్షేత్రముగాను ఉండెడి గురువుయొక్క ఆకారముకొఱకు మిక్కిలి నమస్కారమగునుగాక.

శ్లో॥ గురుమూర్తింస్మరేన్నిత్యం । గురోర్నామసదాజపేత్ ।
గురోరాజ్ఞాంప్రకుర్వీత । గురోరన్యంనభావయేత్॥ ౨౯॥

టీక॥ నిత్యం=ఎల్లప్పుడును, గురుమూర్తిం గురు = గురువుయొక్క, మూర్తిం=స్వరూపమును, స్మరేత్ =స్మరింపవలయును, గురోః = గురువుయొక్క, నామ=పేరును, సదా=ఎల్లప్పుడును, జపేత్ =జపముచేయవలయును, గురో=గురువుయొక్క, ఆజ్ఞాం= ఆజ్ఞను, ప్రకుర్వీత = చేయవలయును; గురోః=గురువుకంటె, అన్యం = ఇతరమును, నభావయేత్ =తలంచఁగూడదు.

తా॥ ఎల్లప్పుడు సద్గురు స్వరూపమునే స్మరించవలయును, ఆస ద్గురు నామమునే జపించవలయును, సద్గురువుయొక్క ఆజ్ఞప్రకారమే చేయవలయును, సద్గురువుకంటె నితరమగుదాని తలంచ నేకూడదు.

శ్లో॥ గురువక్త్రేస్థితంబ్రహ్మ । ప్రాప్యతేతత్ప్రసాదతః ।
గురోర్ధ్యానంతథాకుర్యా । త్పురుషంస్వైరిణీయథా॥ ౨౭॥

టీక॥ గురువక్త్రే - గురు=గురువుయొక్క, వక్త్రే=ముఖమునందు, స్థితం=ఉన్నటువంటి, బ్రహ్మ=పరబ్రహ్మము, తత్ప్రసాదతః - తత్ = ఆ గురువుయొక్క, ప్రసాదతః = అనుగ్రహమునుండి, ప్రాప్యతే = పొంద బడుచున్నది. స్వైరిణీ= స్వేచ్ఛగాతిరిగెడి(స్త్రీ), (విటకత్తె), పురుషం= అన్యపురుషుని, యథా=ఏప్రకారమో; తథా=ఆప్రకారము, గురోః = గురువుయొక్క, ధ్యానం=ధ్యానమును, కుర్యాత్ = చేయవలయును.

తా॥ జనులచేత గురుముఖమునందున్న పరబ్రహ్మము ఆగురువు అను గ్రహమువలన పొందబడుచున్నది, గనుక జనులుగురువును ఎల్లప్పుడువిడ తెగకుండవ్యభిచారియగుస్త్రీ తనకెన్ని పనులుండియు పరపురుషునియం దుమనస్సుంచుట వలెనే, ఏకాగ్రచిత్తులై ధ్యానించవలయును.

శ్లో॥ స్వాశ్రమంచస్వజాతించ । స్వకీర్తింపుష్టివర్ధనం ।
ఏతత్సర్వంపరిత్యజ్య । గురోరన్యన్నభావయేత్ ॥ ౨౮ ॥

టీక॥ స్వాశ్రమంచ=స్వ=తనయొక్క, ఆశ్రమంచ = బ్రహ్మచర్యా ద్యాశ్రమములున్ను, స్వజాతించ=స్వ=తనయొక్క, జాతించ=బ్రాహ్మ ణాదిజాతినిన్ని, స్వకీర్తించ=స్వ=తనయొక్క,కీర్తించ=యశస్సునున్ను, పుష్టివర్ధనం =పుష్టి=బలముయొక్క, వర్ధనం=వృద్ధినిన్ని, ఏతత్సర్వం= ఈసమస్తమును, పరిత్యజ్య = విడిచిపెట్టి, గురోః=గురువుకంటె, అన్య త్=వేరైనదానిని, నభావయేత్=తలంచకూడదు.

తా॥ జనుడు బ్రహ్మచర్యము మొదలైన ఆశ్రమములున్ను బ్రాహ్మ ణాదిజాతులనున్ను కీర్తినిన్ని బలాతిశయమునున్ను సర్వమునువిడిచి గు రువుకంటె వేరగుదానిని దేనినిన్ని తలంచకూడదు.

శ్లో॥ అనన్యాశ్చింతయంతోయే । సులభంపరమంసుఖం ।
తస్మాత్సర్వప్రయత్నేన । గురోరారాధనంకురు ॥ ౩౦ ॥

టీక॥ ఏ=ఎవరు, అనన్యాః = గురువునకితరులుగానివారై, చింత యంతః=గురుధ్యానముచేసెడివారలు, (భవంతి = అగుచున్నారో; తే షాం=వారలకు,) పరమం = శ్రేష్ఠమైన సుఖం=సౌఖ్యము, (పరబ్రహ్మా నందము,) సులభం = సుఖముగాపొందదగినది, (భవతి=అగుచున్నది.) తస్మాత్ =అందువలన, సర్వప్రయత్నేన = సమస్తప్రయత్నముల చేతను, గురోః=గురువుయొక్క, ఆరాధనం=పూజను, కురు=చేయుము.

తా॥ గురుస్వరూపమునకితరములులేకగురుస్వరూపులైగురుధ్యా నముచేసెడివారలకు పరమానందసుఖము సులభముగా పొందదగినదగు చున్నది, గనుకసర్వప్రయత్నముల చేతను గురునిఆరాధనమునే చేయుము.

శ్లో॥ గురువక్త్రేస్థితావిద్యా । గురుభక్త్యాచలభ్యతే ।
త్రైలోక్యస్ఫుటవక్తారో । దేవాద్యసురపన్నగాః ॥ ౩౧ ॥

టీక॥ గురువక్త్రే=గురువుయొక్క, వక్త్రే=ముఖమునందు, స్థితా =ఉన్నటువంటి, విద్యా=పరబ్రహ్మవిద్య, గురుభక్త్యా=గురువు యందలి భక్తిచేతను, లభ్యతే=పొందబడుచున్నది. త్రై...రో = త్రైలోక్య = మూడులోకములయందు. స్ఫుట = స్ఫుటముగా, వక్తారః=పలుకునట్టి, దే...గాః=దేవ=దేవతలు, ఆది=మొదలుగాగల, అసుర = రాక్షసులు ను, పన్నగాః=పన్నగులును, (భవంతి=అగుచున్నారు.)

తా॥ జనులచేత గురుముఖమునందున్న పరబ్రహ్మవిద్య గురువు యందలి భక్తిచేతపొందబడుచున్నది, ఇట్లుపొందినవారు మూడు లోక ములయందునుస్ఫుటవాక్కుగల దేవాసురపన్నగులవలెనేఅగుచున్నారు.

శ్లో॥ గుకారశ్చాంధకారోహి । రుకారస్తేజఉచ్యతే ।
అజ్ఞానగ్రాసకంబ్రహ్మ । గురు రేవనసంశయః ॥ ౩౨ ॥

టీక॥ గుకారశ్చ=గువర్ణము, అంధకారోహి = గాఢమైనచీకటిగా ను, రుకారః=రువర్ణము, తేజః=తేజస్సుగాను, ఉచ్యతే= చెప్పబడుచు

న్నది. అజ్ఞానగ్రాసకం = అజ్ఞానమును భక్షించునట్టి, బ్రహ్మ = పరబ్రహ్మము, గురురేవ = బ్రహ్మజ్ఞానోప దేశమునుచేసిన గురువే, (భవతి = అగుచున్నాడు.) నసంశయః=సందేహము లేదు.

తా॥ గుకారమే గాఢచీకటిగాను, రుకారమే ఆగాఢచీకటినిహరించెడి తేజస్సుగాను చెప్పబడుచున్నది గనుక అజ్ఞానాంధకారమునునశింపఁజేసెడి పరబ్రహ్మము గురువేయగుచున్నాడు దీనికి సంశయములేదు.

*శ్లో॥ గుకారశ్చాంధకారస్తు । రుకార స్తన్నిరోధకృత్ ।
అంధకారవినాశిత్వా । ద్గురురిత్యభిధీయతే ॥ 33 ॥

టీక॥ గుకారశ్చ=గుకారమును, అంధకారస్తు = కటికచీకటియును; రుకారః=రుకారమును, తన్నిరోధకృత్=తత్ = ఆఅంధకారమునకు, నిరోధ=అడ్డును, కృత్=చేయునది, అంధకారవినాశిత్వాత్ = అంధకార =చీకటిని, వినాశిత్వాత్ =నశింపఁజేయుటవలన, గురురితి = గురువని, అభిధీయతే=చెప్పబడుచున్నాడు.

తా॥ గాఢమైన చీకటియేగుకారము, ఆచీకటినినశింపఁజేయునదియే రుకారము ఇట్లు అజ్ఞానాంధ కారమును నశింపఁ జేయుట వలననే గురువని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ గుకారశ్చగుణాతీతో । రూపాతీతోరుకారకః ।
గుణరూపవిహీనత్వా । ద్గురురిత్యభిధీయతే ॥ 34॥

టీక॥ గుకారశ్చ=గుకారమును, గుణాతీతః=సత్వాదిగుణములనతిక్రమించినది, రుకారః=రుకారము, రూపాతీతః = ఆకృతిని అతిక్రమించినది,. గుణ... త్వాత్ =గుణరూప=గుణరూపములతో, విహీనత్వాత్ = శూన్యమగుటవలన,గురురితి=గురువని, అభిధీయతే=చెప్పఁబడుచున్నది.

తా॥ సత్వాదిగుణములనతిక్రమించియుండునది గుకారముకరచరణా ద్యాకృతిలేనిది రుకారమును ఇట్లు గుణరూపములు లేకపోవుట వలన గురువని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ గుకారశ్ప్రథమోవర్ణో । మాయాదిగుణభాసకం ।
రుకారోస్తిపరంబ్రహ్మ । మాయాభ్రాంతివిమోచకం ॥ ౩౫॥

టీక॥ ప్రథమః=మొదటిదియగు, గుకారః=గుకారమనెడి, వర్ణః = అక్షరము, మా...కం=మాయాది=మాయ మొదలైనదానియొక్క, గుణ=గుణములను, భాసకం=ప్రకాశింపఁజేయునదిగా, అస్తి = అగుచున్నది. రుకారః=రువర్ణము, మా...కం=మాయా = మాయవల్లనైన, భ్రాంతి=చలనమును, విమోచకం=విడిపించునట్టి, పరం = శ్రేష్ఠమగు, బ్రహ్మ =బ్రహ్మముగా, అస్తి=ఉండుచున్నది.

తా॥ గురుపదమునందలి మొదటివర్ణమగు గుకారముమాయమొదలైన గుణములను ప్రకాశింపఁజేయుచున్నది, రెండవవర్ణమగు,రుకారము ఆమాయయొక్క భ్రాంత్యాదిగుణములను నశింపఁజేసెడి పరబ్రహ్మమైయున్నది, ఇట్లు గురుపదమేమాయగాను పరబ్రహ్మముగాను ఉన్నది.

శ్లో॥ ఏవంగురుపదంశ్రేష్ఠం । దేవానామపిదుర్లభం ।
హాహాహూహూగణైశ్చైవ। గంధర్వాద్యైశ్చపూజితం॥౩౬॥

టీక॥ ఏవం = ఈప్రకారము, గురుపదం గురువనుపదము, శ్రేష్ఠ = అధికమైనదిగాను, దేవానామపి=దేవతలకును, దుర్లభం = పొందుటకు శక్యముకానిదిగాను, గంధర్వాద్యైః = గంధర్వులుమొదలైన, హాహాహూహూగణైశ్చైవ = హాహాహూహూలనువారియొక్కసమూహములచేతనున్ను, పూజితం=అర్చింపఁబడినదిగాను, భవతి=అగుచున్నది.

తా॥ ఇట్లు శ్రేష్ఠమైన గురుపదము దేవతలకును పొందుటకశక్యమైనదై హాహాహూహూ మొదలైన గంధర్వులచే పూజింపఁబడినదియైయుండుచున్నది.

శ్లో॥ ధృవంతేషాంచసర్వేషాం । నాస్తితత్వంగురోఃపరః ।
గురోరారాధనంకార్యం । స్వజీవిత్వంనివేదయేత్ ॥ ౩౭ ॥

టీక॥ తేషాం=అటువంటి,సర్వేషాంచ=అందరికిని,గురోః=గురువుకంటె, పరం=ఇతరమగు, తత్వం=పరమాత్మస్వరూపము, నాస్తి =

లేషు, ధృవం=నిశ్చయము, గురోః=గురువుయొక్క, ఆరాధనం=పూజ, కార్యం=చేయదగినది, స్వజీవిత్వం-స్వ=తనయొక్క, జీవిత్వం=జీవభావమును, నివేదయేత్=అర్పించవలయును.

తా॥ అందరికిని గురువుకంటెనన్యమగుపరమాత్మస్వరూపము లేదు. నిశ్చయముగా గురువునే పూజించవలయును. తనబ్రతుకునంతయు గురువునకే అర్పించవలయును.

శ్లో॥ ఆసనంశయనంవస్త్రం । వాహనంభూషణాదికం।
సాధకేనప్రదాతవ్యం । గురుసంతోషకారణం ॥ ౩౮ ॥

టీక॥ సాధకేన=సాధకుడగువానిచేత, గురుసంతోషకారణం = గురు=గురువుయొక్క, సంతోష=ఆనందమునకు, కారణం= హేతువైన, ఆసనం=సింహాసనమును, శయనం=పడకను, వస్త్రం = వస్త్రమును, వాహనం=గుఱ్ఱమును, భూషణాదికం = నగలుమొదలైనవానినన్ని, ప్రదాతవ్యం=ఇవ్వవలయును.

తా॥ పరబ్రహ్మవిద్యను సాధించవలయుననెడికోరికగలవానిచేత. గురువునకుసంతోషమునుకలుగఁజేయునట్టి ఆసనమునుపడకను వస్త్రమును వాహనమునునగలుమొదలగువానిని గురువుకొఱకు ఇవ్వవలయును.

శ్లో॥ కర్మణామనసావాచా । సర్వదారాధయేద్గురుం ।
దీర్ఘదండంనమస్కృత్య । నిర్లజ్జోగురుసన్నిధౌ॥ ౩౯॥

టీక॥ గురుసన్నిధౌ-గురు=గురువుయొక్క, సన్నిధౌ=సమీపమునందు, నిర్లజ్జః=సిగ్గులేనివాడై, దీర్ఘదండం = పొడుగైనకొయ్యయగునట్లుగా, (సాష్టాంగముగా,) నమస్కృత్య=నమస్కరించి, కర్మణా = కర్మచేతను, మనసా=మనస్సుచేతను, వాచా=వాక్కుచేతను, గురుం=గురువును, సర్వదా=ఎల్లప్పుడును, ఆరాధయేత్=పూజించవలయును.

తా॥ జనుడు గురుసమీపమునందు లజ్జలేనివాడై సాష్టాంగనమస్కారముచేసి మనోవాక్కాయ కర్మములచేత త్రికరణశుద్ధిగా గురువును పూజించవలయును.

శ్లో॥ శరీరమింద్రియంప్రాణ । మర్థస్స్వజనబాంధవాః ।
ఆత్మదారాదికంసర్వం । సద్గురుభ్యోనివేదయేత్ ॥ ౭౦॥

టీక॥ శరీరం=దేహమును, ఇంద్రియం=ఇంద్రియములను, ప్రాణం = ప్రాణమును, అర్థ...ధవాః-అర్థ= ధనమును, స్వజన = తనజనులగుస హోదరులు మొదలైనవారిని, బాంధవాః=చుట్టములను, ఆత్మదారాదికం=తనయొక్క భార్యమొదలైనవారిని, సర్వం=సమస్తమును,సద్గురుభ్యః=సద్గురువులకొఱకు, నివేదయేత్ =అర్పించవలయును.

తా॥ దేహమును ఇంద్రియములను ప్రాణమును ధనమును తనజనులగు సహోదరులు మొదలైనవారిని చుట్టములను భార్యమొదలైనవారిని సమస్తమును సద్గురువులకొఱకునర్పించవలయును.

శ్లో॥ గురురేకోజగత్సర్వం । బ్రహ్మావిష్ణుశివాత్మకం।
గురోఃపరతరంనాస్తి । తస్మాత్సంపూజయేద్గురుం॥ ౭౧॥

టీక॥ ఏకః=ఒక్కడగు, గురుః=గురువే, బ్రహ్మావిష్ణుశివాత్మకం=బ్రహ్మ,విష్ణు,శివులయొక్క స్వరూపమైన, సర్వం=సమస్తమైన,జగత్ = జగత్తును, (భవతి=అగుచున్నాడు,) గురోః= గురువుకంటె, పరతరం = మిక్కిలిశ్రేష్ఠమైనది, నాస్తి=లేదు, తస్మాత్ = అందువలన, గురుం = గురువును, సంపూజయేత్ =పూజించవలయును.

తా॥ సమస్తజగత్తునకును గురుడుయొకడే బ్రహ్మ, విష్ణు, శివాత్మకస్వరూపమగుచున్నాడు గురువుకంటెను శ్రేష్ఠమగునదియేదియును లేదు. అందువలన సద్గురుస్వామిని పూజించవలయును.

శ్లో॥ సర్వశ్రుతిశిరోరత్న । నీరాజితపదాంబుజం ।
వేదాన్తార్థప్రవక్తారం । తస్మాత్సంపూజయేద్గురుం॥ ౭౨॥

టీక॥ తస్మాత్ =అందువలన, సర్వ...బుజం-సర్వ=సమస్తమైన,శ్రుతిశిర=ఉపనిషత్తులనెడి, రత్న=మణులచేత, నీరాజిత = ఆరాధనచేయబడిన, పదాంబుజం=పాదపద్మములుగల, వేదా...క్తారం = వేదాన్త=ఉపనిషత్తులయందలి, అర్థ= తాత్పర్యమును, ప్రవక్తారం = చెప్పునట్టి,

గురుం=సద్గురువును, సంపూజయేత్ =పూజించవలయును.

తా॥ సమస్త ఉపనిషత్తులనెడి గొప్పమణులచేత నీరాజనముచేయ బడిన పాదపద్మములుగలవాడును. ఉపనిషత్తులతాత్పర్యమును జెప్పెడి వాడుననగు సద్గురువును మిక్కిలి పూజించవలయును.

శ్లో॥ యస్యస్మరణమాత్రేణ । జ్ఞానముత్పద్యతేస్వయం ।
సఏవసర్వసంపత్తి । స్తస్మాత్సంపూజయేద్గురుం ॥ ౪౩॥

టీక॥ యస్య=ఎవనియొక్క, స్మరణమాత్రేణ= స్మరించుటచేత నే, జ్ఞానం=బ్రహ్మజ్ఞానము, స్వయం=తనంతటనే, ఉత్పద్యతే = పుట్టుచున్న దో, సఏవ=ఆగురువే, సర్వసంపత్తిః=సమస్తసమృద్ధి, (భవతి= అగుచు న్నాడు.) తస్మాత్ =అందువలన, గురుం = గురువును, సంపూజయేత్ = మిక్కిలి పూజించవలయును.

తా॥ ఏగురువుయొక్క స్మరణ మాత్రముచేతనే పర బ్రహ్మజ్ఞాన ముస్వకీయముగానే పుట్టుచున్నదియో; ఆగురువే సర్వసంపత్స్వరూ పుఁడుగనుకనే, గురువును మిగుల పూజించవలయును.

శ్లో॥ క్రిమికోటిభిరావిష్టం । దుర్గంధిమలమూత్రకం ।
శ్లేష్మరక్తకపైర్మాంసై । ర్నద్ధంచైతద్వరాననే ॥ ౪౪॥

టీక॥ హేవరాననే=శ్రేష్ఠమైనముఖముగల ఓపార్వతీ,ఏతత్ =ఈశ రీరము, క్రిమికోటిభిః=క్రిమి=పురుగులయొక్క, కోటిభిః=కోట్లచేతను, అవిష్టం=కూడుకొనినదియును, దుర్గంధి=చెడువాసన గలదియును, మల మూత్రములుగలదియును, శ్లేష్మరక్తకఫైః = శ్లేష్మ=తెమడచేతను, రక్త =రక్తముచేతను, కఫైః=కళ్లెలచేతను, మాంసైః = మాంసముచేతను, నద్ధం=కూడుకొనినదియును, (భవతి=అగుచున్నది.)

తా॥ ఓపార్వతీ ఈదేహము అనేక పురుగులతో కూడి నదియును, చెడువాసనగలదియును, మలమూత్రములుగలదియును, తెమడ, కళ్లెరక్త ము,మాంసము ఈమొదలైనవాటితో కూడుకొని నదియైయున్నది.

శ్లో॥ సంసారవృక్షమారూఢాః । పతంతినరకార్ణవే ।
యస్తానుద్ధరతేసర్వాన్ । తస్మైశ్రీగురవేనమః ॥ ౪౫॥

టీక॥ సం...క్షం=సంసార=దేహమనెడి, వృక్షం=చెట్టును, ఆరూఢాః=ఎక్కినవారు, నరకార్ణవే=నరకమనెడి సముద్రమునందు, పతంతి=పడుచున్నారు. యః=ఎవఁడు, తాన్ సర్వాన్ = ఆఅందరిని, ఉద్ధరతే=యెత్తిరక్షించుచున్నాడో; తస్మై=అటువంటి, శ్రీగురవే= ప్రకాశించెడి గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఈదేహమను చెట్టును యెక్కియున్న జీవులు, నరకసముద్రమునందుపడుచున్నారు. అటువంటివారలనందరిని ఏగురువుజ్ఞానోపదేశముచేత నెత్తిరక్షించుచున్నాడో; అట్టిగురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ గురుర్బ్రహ్మాగురుర్విష్ణు । గ్గురుర్దేవోమహేశ్వరః ।
గురురేకంపరంబ్రహ్మ । తస్మైశ్రీగురవేనమః ॥ ౪౬॥

టీక॥ గురుః=గురువు, బ్రహ్మా = బ్రహ్మదేవుడు, గురుః = గురువు, విష్ణుః=విష్ణువు, గురుః=గురువు, దేవః = ప్రకాశమానుడగు, మహేశ్వరః=ఈశ్వరుడు, గురుః=గురువు, ఏకం=అద్వితీయమైన, పరంబ్రహ్మ = పరబ్రహ్మము, తస్మై=అటువంటి, శ్రీగురవే = ప్రకాశమానుడగుసద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ బ్రహ్మవిష్ణు మహేశ్వర స్వరూపుండును అద్వితీయ పరబ్రహ్మస్వరూపుండునునగు సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య । జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితంయేన । తస్మైశ్రీగురవేనమః ॥ ౪౭॥

టీ॥ యేన = ఏగురువుచేతను, అజ్ఞా...ధస్య = అజ్ఞాన = అజ్ఞానమనెడి, తిమిర=చీకటిచేతను, అంధస్య = గ్రుడ్డివాడైనజనునియొక్క, చక్షుః=జ్ఞాననేత్రము, జ్ఞానాంజనశలాకయా=జ్ఞాన = బ్రహ్మజ్ఞానమనె

డి, అంజన=కాటుక యొక్క, శలాకయా=కణిక చేతను;ఉన్మీలితం= తె
రువఁబడినదో; తస్మై=అటువంటి, శ్రీగురవే= ప్రకాశమానుండగు గురు
వుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఏగురువుచేత అజ్ఞానము నెడుచీకటిచే గ్రుడ్డివాఁడగు జనుని
యొక్క జ్ఞానచక్షుస్సు పరబ్రహ్మజ్ఞానమను కాటుక యొక్క కణికతో
తెరువఁబడుచున్నదో; అట్టి సద్గురువుకొఱకునమస్కారము.

శ్లో॥ స్థావరంజంగమంవ్యాప్తం । యత్కించిత్సచరాచరం ।
త్వంపదందర్శితంయేన । తస్మైశ్రీగురవేనమః॥ ౪౭॥

టీక॥ యేన = ఏగురువుచేత, స్థావరం = స్థిరముగానుండెడివృక్షాదిక
మును, జంగమం=తిరిగెడిమనుష్యాదికమును, వ్యాప్తం= సర్వత్రవ్యాపిం
చియుండెడి, యత్కించిత్ =సమస్తమైన, సచరాచరం = తిరిగెడిమను
ష్యులు మొదలైనస్వరూపములునగు, త్వంపదం=యుష్మచ్ఛబ్దార్థమగుజీవ
పదము, దర్శితం=చూపింపఁబడినదో, తస్మై=అటువంటి, శ్రీగురవే= ప్ర
కాశించెడిసద్గురువుకొఱకు, నమః=నమస్కారము, .

తా॥ ఏగురుచేత అంతటావ్యాపించియుండెడి, స్థావరజంగమా
త్మకమగుచరాచరాత్మకముతోఁ గూడుకొనిన యుష్మత్పదార్థమైన జీవ
స్వరూపమునుజూపింపఁబడినదో,అట్టిసద్గురువుకొఱకునమస్కారము.

శ్లో॥ అఖండమండలాకారం । వ్యాప్తంయేనచరాచరం।
తత్పదందర్శితంయేన । తస్మైశ్రీగురవేనమః॥ ౪౮॥

టీక॥ యేన=ఏపరమాత్మచేతను, అఖం...కారం = అఖండ = మొద
లెగని,మండలాకారం=మండలాకృతియగునట్లు,చరాచరం=జంగమస్థా
వరాత్మకమైన సమస్తలోకములు, వ్యాప్తం=వ్యాపింపఁబడియున్నదో,త
త్పదం=తచ్ఛబ్దార్థమగుపరమేశ్వరపదము, యేన = ఏగురువుచేత, దర్శితం
=చూపింపఁబడినదో, తస్మై=అటువంటి, శ్రీగురవే= ప్రకాశమానుఁడగు
గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఏపరమాత్మచే సమస్తప్రపంచము పరిపూర్ణమైనమండలస్వరూపముగునట్లువ్యాపింపఁబడియున్నదో, అట్టిపరమేశ్వరస్థానము-ఏగురువుచేత చూపింపఁబడినదో, అట్టిసద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ చిన్మయంవ్యాపితంసర్వం । త్రైలోక్యంసచరాచరం।
అసిత్వందర్శితంయేన । తస్మైశ్రీగురవేనమః॥ ౫౦॥

టీక॥ ఏన=ఏగురువుచేత, సచరాచరం = చరాచరములతోఁగూడుకొనియున్న, సర్వం=సమస్తమగు, త్రైలోక్యం = మూడులోకములను, వ్యాపితం=వ్యాపింపఁజేయబడియున్న, చిన్మయం = బ్రహ్మస్వరూపమగు, అసిత్వం=అసిపదముయొక్క భావము, దర్శితం = చూపింపఁబడినదో, తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశవంతుడగు గురువుకొఱకు, నమః = నమస్కారము.

తా॥ ఏగురువుచేత జంగమస్థావరములతోఁ గూడియున్నసమస్తలోకములను వ్యాపింపఁబడినదై బ్రహ్మస్వరూపమగు జీవేశ్వరులయొక్క ఐక్యస్వరూపమగు పరబ్రహ్మభావమును జూపింపఁబడినదో, అట్టి సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ నిమిషార్థార్థపాతాద్వా । యద్వాక్యాద్వైవిలోక్యతే ।
స్వాత్మానంస్థిరమాదత్తే । తస్మైశ్రీగురవేనమః॥ ౫౧॥

టీక॥ యద్వాక్యాత్ =యత్ =ఏగురువుయొక్క, వాక్యాత్ = వాక్యమునుండి, నిమి...తాద్వా=నిమిష=నిమిషకాలముయొక్క, అర్థ= సగములో, అర్థ=సగము, పాతాద్వా = గడచిపోవుటనుండియును, (ఆత్మా =పరమాత్మస్వరూపము,)విలోక్యతే=చూడఁబడుచున్నదో, స్థిరం= శాశ్వతమైన, స్వాత్మానం=స్వ=తనయొక్క, ఆత్మానం = ఆత్మస్వరూపమును, ఆదత్తే=గ్రహించుచున్నాడో, తస్మై = అటువంటి, శ్రీగురవే = ప్రకాశమైనసద్గురువుకొరకు, నమః=నమస్కారము.

తా॥ జనులు ఏగురువాక్యమునుండి మిక్కిలిశీఘ్రముగా(ఒకనిమి

షముయొక్క సగములోగాని ఇంకా అంతకు తగ్గిన సగముకాలములోగాని)స్థిరమైనఆత్మస్వరూపమునుబొందుచున్నారో, అట్టి సద్గురువుకొఱకునమస్కారము.

శ్లో॥ చైతన్యంశాశ్వతంశాంతం । వ్యోమాతీతంనిరంజనం ।
నాదబిందుకళాతీతం । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౨॥

టీక॥ చైతన్యం=ప్రకాశాత్మకమగుపరబ్రహ్మము, శాశ్వతం = నిత్యమైనదియును, శాంతం=శాంతమైనదియును, వ్యోమాతీతం=ఆకాశమునతిక్రమించియుండునదియును, నిరంజనం=పాపరహితమైనదియును, నాద...తీతం=నాద=ప్రణవనాదమునకును, బిందు=బుద్ధికిని, కళా=బుద్ధియందుప్రతిబింబించియున్న ఆత్మప్రతిబింబమునకును, అతీతం = అతిక్రమించియుండునదియును, (భవతి = అగుచున్నది.) తస్మై = అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానమగు, సద్గురుస్వరూపముకొఱకు నమస్కారము.

తా॥ ఏగురుస్వరూపము, నిత్యమును, శాశ్వతమునుశాంతమును, ఆకాశాతీతమును, పాపరహితమును,ప్రణవధ్వనిని,బుద్ధిని, బుద్ధిప్రతిబింబితమైన-ఆత్మను ఈమూటిని అతిక్రమించిన ప్రకాశాత్మకమగు పరబ్రహ్మముగుచున్నదో, అట్టిప్రకాశమానమగు సద్గురు స్వరూపము కొఱకు నమస్కారము.

శ్లో॥ నిర్గుణంనిర్మలంశాంతం । జంగమంస్థిరమేవచ ।
వ్యాప్తంయేనజగత్సర్వం । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౩॥

టీక॥ ఏన= ఏపరబ్రహ్మముచేతను, సర్వం=సమస్తమైన, జగత్ = లోకము, వ్యాప్తం=వ్యాపింపఁబడియున్నదో, (తత్ = ఆపరబ్రహ్మస్వరూపము,)నిర్గుణం=సత్వరజస్తమముల నెడు మాయాగుణములు లేనిదియును, నిర్మలం=స్వచ్ఛమైనదియును, శాంతం=నెమ్మదిమైనదియును, జంగమం= చేతనస్వరూపమునునై, (భవతి=అగుచున్నది.) తస్మై= అటు

వంటి, శ్రీగురవే = ప్రకాశమానమైన సద్గురుస్వరూపమగు పరబ్రహ్మము కొఱకు, నమః= నమస్కారము.

తా॥ ఏపరబ్రహ్మము సమస్తజగత్తునువ్యాపించి నిర్గుణమును నిర్మలమును శాంతమును జంగమస్థావరాత్మకమునునైయున్నదియో, అట్టిపరబ్రహ్మస్వరూపమగు సద్గురు స్వరూపమ్మునకొఱకు, నమస్కారము.

శ్లో॥ త్వంపితాత్వంచమేమాతా । త్వంబంధుస్త్వంచదేవతా ।
సంసారప్రీతిభంగాయ । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౪॥

టీక॥ త్వం=నీవు, పితా=తండ్రివి, త్వం=నీవు, మే=నాకు, మాతా చ=తల్లివియును, త్వం=నీవు, బంధుశ్చ=చుట్టమును్ను, త్వం=నీవు దేవతా చ=దైవమును్ను, (భవతి=అగుచున్నావు,) సంసార...భంగాయ= సంసార = సంసారమునందలి, (అనగా దేహమునందలి, ప్రీతి = ప్రేమను, (అనురాగమును లేని అసక్తిని,) భంగాయ = పోగొట్టుటకొఱకు, తస్మై=అటువంటి, శ్రీగురవే= ప్రకాశమానమైన గురువగు నీకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఓస్వామీ; తల్లియు తండ్రియు చుట్టముదైవముసర్వమునాకునీవేగనుక, కేవలనీచమగుసంసారమునందలినాయాశనుబోగొట్టుటకు-అట్టిసద్గురుస్వరూపుండవైననీకొఱకు నమస్కారము.

శ్లో॥ యత్సత్త్వేనజగత్సత్వం । యత్ప్రకాశేనభాతితత్ ।
యదానందేననందన్తి । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౫॥

టీక॥ యత్సత్త్వేన=యత్ =ఏగురుస్వరూపమైనపరబ్రహ్మముయొక్క, సత్త్వేన=ఉండుటచేత, జగత్సత్వం=జగత్ =లోకముయొక్క, సత్వం= ఉండుట, (భవతి=కలుగుచున్నదో,)యత్ప్రకాశేన=యత్ = ఏబ్రహ్మము యొక్క, ప్రకాశేన=ప్రకాశముచేత, తత్ =ఆజగత్తు, భాతి=ప్రకాశించుచున్నదియో, (జనాః=జనులు,) యదానందేన=యత్ = ఏపరబ్రహ్మము యొక్క, ఆనందేన=ఆనందముచేత, నందన్తి=సంతోషించుచున్నారో,

తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానమగు సద్గురుస్వరూపమైనపర బ్రహ్మముకొఱకు,నమః=నమస్కారము.

తా॥ ఏపరబ్రహ్మముయుండుటచేతనే ఈజగత్తుఅంతయునున్నదో, ఏపరబ్రహ్మప్రకాశముచేతనే జగత్తంతయు వెలుగుచున్నదో, ఏపర బ్రహ్మముయొక్క ఆనందముచేతనే లోకులందరును ఆనందించుచున్నారో, అట్టి సద్గురుస్వరూపమైనపర బ్రహ్మముకొఱకు నమస్కారము.

శ్లో॥ యస్మిన్ స్థితమిదంసర్వం । భాతియద్భానురూపతః ।
యత్ప్రీత్యాప్రియపుత్రాది । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౬॥

టీక॥ ఇదంసర్వం = ఈసమస్తజగత్తును, యస్మిన్ = ఏపరబ్రహ్మమునందు, స్థితం=ఉన్నదై, యద్భానురూపతః=యత్ = ఏపరబ్రహ్మముయొక్క,భానురూపతః=సూర్యస్వరూపమునుండి, భాతి=ప్రకాశించుచున్నదో, యత్ప్రీత్యా=యత్ =ఏపరబ్రహ్మముయొక్క, ప్రీత్యా=ప్రేమచేతను, ప్రియపుత్రాది=ప్రియ=ఇష్టమగు, పుత్రాది= కొమాళ్లుమొదలైనవిఅన్నియును, (భవతి=అగుచున్నవో, తస్మై=అటువంటి, శ్రీగురవే = ప్రకాశమానమగు గురుస్వరూపముకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఏపరబ్రహ్మమునందు ఈసమస్తజగత్తును ఉండి పరబ్రహ్మస్వరూపమైన సూర్యునివలన ప్రకాశించుచున్నదియో, ప్రేమరూపమైన పుత్రాదికమంతయు ఏపరబ్రహ్మముయొక్క ప్రేమచేత కలుగుచున్నవో, అటువంటి పరబ్రహ్మస్వరూపమైనగురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ ఏనచేతయతాహీదం । చిత్తంచేతయతేనరః ।
జాగ్రత్స్వప్నసుషుప్త్యాది । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౭॥

టీక॥ ఇదం=ఈ, చిత్తంహి=చిత్తమునున్ను, చేతయతా = చేతనముగలదిగా చేయుచున్న (చలనాది వ్యాపారముతోఁ గూడినవ్యాపారముగలదిగా జేయుచున్న,) ఏన=ఏపరమాత్మచేతను, నరః = మనుజుడు, జాగ్ర...ప్త్యాది=జాగ్రత్ = మేలుకొనియుండుటయును, స్వప్న

=స్వప్నమును,సుషుప్తి=గాఢనిద్రయును, ఆది=మొదలైనవానినిగూర్చి, చేతనముతోఁగూడుకొనినవాడుగా చేయఁబడుచున్నాడో, తస్మై=అట్టి వంటి, శ్రీగురవే=ప్రకాశమానుడగు పరమాత్మస్వరూపుడైన గురువు కొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఈచిత్తమునుచలనాదివ్యాపారము గలిగి చేతనముగలదాని నిగా జేయుచున్న ఏపరమాత్మచే జనుడు జాగ్రత్స్వప్నసుషుప్త్యాదిసమస్తప్రపంచమునుగూర్చి చలనాదివ్యాపారముగలవాడుగా చేయఁబడుచున్నాడో, అట్టిపరమాత్మస్వరూపుడైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ యస్యజ్ఞానమిదంవిశ్వం । నదృశ్యంభిన్నభేదతః ।
సదైకరూపరూపాయ । తస్మైశ్రీగురవేనమః॥ ౫౮॥

టీక॥ యస్య=ఏపరమాత్మయొక్క, జ్ఞానం=ఎఱుక, ఇదంవిశ్వ=ఈసమస్తమైన, భిన్నభేదతః=భిన్న=వేఱైనఘటపటాదివస్తువులయొక్క, భేదతః=భేదమువలన, నదృశ్యం= తెలియదగినదికాదో, తస్మై= అటువంటి, సదా=యెల్లప్పుడును, ఏకరూపరూపాయ=అద్వితీయరూపముగు ఆకృతిగల,శ్రీగురవే=ప్రకాశమానమగుగురువుకొఱకు,నమః=నమస్కారము.

తా॥ ఏపరమాత్మసంబంధమగుయెఱుకయే- ఈసమస్తజగత్తును నైప్రపంచమునందలి వేరువేరువస్తువులయొక్కభేదములవలన తెలియఁబడకయున్నదో - అటువంటివాడు యెల్లప్పుడును, అద్వితీయస్వరూపుడునగుపరమాత్మస్వరూపుడైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ యస్యజ్ఞాతంమతంతస్య । మతంయస్యనవేదసః ।
అనన్యభావభావాయ । తస్మైశ్రీగురవేనమః ॥ ౫౯॥

టీక॥ యస్య=ఏపరమాత్మకు, జ్ఞాతం= తెలియఁబడినది, తస్య =ఆపరమాత్మకు, మతం = ఇష్టమైనదగుచున్నది. యస్య = ఏపరమాత్మకు, మతం=ఇష్టమైనదానిని, సః=ఆపరమాత్మ, నవేద= తెలిసికొనడము లేదు.

అనన్యభావ భావాయ = అన్యవస్తువులులేని స్వరూపముగల, తస్మై= అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానుఁడగు గురువుకొఱకు, నమః= నమస్కారము.

తా॥ పరమాత్మకు జీవేశ్వరస్వరూపములచేత ప్రకాశించుచు తెలియవచ్చెడి ఈసమస్తము, కేవలస్వరూపమే యైయున్నది. అట్టి ఆపరమాత్మయగుతనయొక్క కేవలస్వరూపము తానేయై తనకు వేరొకటిలేకపోవుటవలన వేరుగ చూచి తెలిసికొనుటలేదు. అట్టి అద్వితీయమగు పరమపదస్వరూపమైనప్రకాశమానుడగు సద్గురువుకొఱకునమస్కారము

శ్లో॥ యస్మైకారణరూపాయ । కార్యరూపేణభాతియత్ ।
కార్యకారణరూపాయ । తస్మైశ్రీగురవేనమః॥ ౬౦॥

టీక॥ కారణరూపాయ=కారణస్వరూపమైన, యస్మై = ఏపరమాత్మకొఱకు, యత్ =ఏది, కార్యరూపేణ = కార్యస్వరూపముతో, భాతి =ప్రకాశించుచున్నదో; తస్మై = అటువంటి, కార్యకారణరూపాయ = కార్యకారణస్వరూపమగు,శ్రీగురవే= ప్రకాశమానమగు సద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ సర్వకారణుఁడగు భగవంతునికొఱకు కార్యరూపమైనసమస్తప్రపంచము ప్రకాశించుచున్నయది, అట్టికార్యకారణస్వరూపమైన భగవంతుఁడగు సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ నానారూపమిదంవిశ్వం । నకేనాప్యస్తిభిన్నతా।
కార్యకారణరూపాయ । తస్మైశ్రీగురవేనమః॥ ౬౧॥

టీక॥ నానారూపం=అనేకరూపములుగల, ఇదంవిశ్వం = ఈప్రపంచము, కేనాపి=ఏపరమాత్మతోను, భిన్నతా=వేరగుట, నాస్తి= లేదు, కార్యకారణరూపాయ=కార్యకారణస్వరూపమైన, తస్మై= అటువంటి,

శ్రీగురవే=ప్రకాశమానమగు సద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ నానారూపాత్మకమగు ఈసమస్తప్రపంచము ఏపరమాత్మకువేరుగాకయుంచున్నదియో, అట్టి కార్యకారణాత్మకమగు పరమాత్మయైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ జ్ఞానశక్తింసమారుహ్య । తత్త్వమాలావిభూషిణే ।
భుక్తిముక్తిప్రదాత్రేచ । తస్మైశ్రీగురవేనమః॥ ౬౨॥

టీక॥ జ్ఞానశక్తిం = పరబ్రహ్మజ్ఞానసామర్థ్యమును, సమారుహ్య = పొంది, తత్త్వ...షిణే=తత్త్వ=పరమాత్మస్వరూపమనెడి, మాలా = పూలదండ, విభూషిణే=అలంకారముగాగలవాడును, భుక్తి...త్రేచ = భుక్తి=భోజనమును, ముక్తి=మోక్షమును,ప్రదాత్రేచ=ఇచ్చెడివాడునగు, తస్మై=అటువంటి, శ్రీగురవే = ప్రకాశమానుఁడగు సద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ పరమాత్మస్వరూపజ్ఞానసామర్థ్యముపొందిపరమాత్మజ్ఞానమను పూలదండలచే నలంకరింపఁబడి ఆశ్రితులకుభోగమోక్షములనురెంటిని యొసంగెడిఆపరమాత్మస్వరూపుడైనశ్రీగురువుకొఱకునమస్కారము

శ్లో॥ అనేకజన్మసంప్రాప్త । కర్మధర్మవిదాహినే।
జ్ఞానానలప్రభావేన । తస్మైశ్రీగురవేనమః॥ ౬౩॥

టీక॥ జ్ఞానా...వేన=జ్ఞాన=తత్త్వజ్ఞానమనెడి,అనల=అగ్నియొక్క ప్రభావేన=సామర్థ్యముచేత, అనేక...హినే=అనేక = అపరిమితములగు, జన్మ=పుట్టుకలయందు, సంప్రాప్త = పొందఁబడిన, కర్మ = కర్మలయొక్క, (పుణ్యపాపకర్మలయొక్క,) ధర్మ= స్వభావమును, విదాహినే=మిక్కిలిదహింపఁజేయుచున్న, తస్మై=ఆ,శ్రీగురవే=ప్రకాశమానుఁడగు సద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ పరబ్రహ్మజ్ఞానాగ్నియొక్క సామర్థ్యముచేత ఆశ్రితులగు

శిష్యులయొక్క అనేకజన్మములయందు పొందబడిన పుణ్యపాపకర్మము
లయొక్క స్వభావమును భస్మము చేయుచున్న ఆ-శ్రీసద్గురువుకొఱకు
నమస్కారము.

శ్లో॥ శోషణంభవసింధోశ్చ । దీపనంక్షరసంపదాం।
గురోఃపాదోదకంయస్య । తస్మైశ్రీగురవేనమః॥ ౬౪॥

టీక॥ యస్య=ఏ, గురోః=గురువుయొక్క, పాదోదకం=పాదోదకము, భవసింధోః=సంసారసముద్రమునకు, శోషణంచ = ఎండింపఁజేయునదియును, క్షరసంపదాం= క్షీణించెడు సంపదలకు, దీపనం= ప్రకాశింపఁజేయునదియును, (భవతి=అగుచున్నది.) తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానుఁడగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఏగురువుయొక్క పాదోదకము సంసారసముద్రమును ఇంకింపఁజేయునది గాను నశ్వరములగు సంపదలను ప్రకాశింపఁజేయునది గాననగుచున్నదో అట్టిప్రకాశమానుఁడగు సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ నగురోరధికంతత్వం । నగురోరధికంతపః।
తత్వజ్ఞానాత్పరంనాస్తి । తస్మైశ్రీగురవేనమః॥ ౬౫॥

టీక॥ గురోః=గురువుకంటె, అధికం=శ్రేష్ఠమైన, తత్వం= పరమాత్మస్వరూపము, న=లేదు, గురోః=గురువుకంటె, అధిక = శ్రేష్ఠమైన్న, తపః=తపస్సు, న=లేదు, తత్వజ్ఞానాత్ = పరమాత్మను దెలుసుకొనుటకంటె, పరం=అన్యమైనది, నాస్తి=లేదు, తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానుఁడగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ గురువుకంటె నధికమగు పరమాత్మస్వరూపమును, గురువుకంటె నధికమగు తపస్సును, పరతత్వజ్ఞానముకంటె నన్యమైనదియును లేదు, అట్టి పరమాత్మస్వరూపమగు సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ మన్నాథశ్శ్రీజగన్నాథో । మద్గురుశ్శ్రీజగద్గురుః ।
స్వాత్మైవసర్వభూతాత్మా । తస్మైశ్రీగురవేనమః॥ ౬౬॥

టీక॥ మన్నాథః=మత్=నాకు, నాథః=ప్రభువగు గురువే, శ్రీజగన్నాథః=ప్రకాశమానుఁడగు లోకప్రభువైనఈశ్వరుఁడు, మద్గురుః=మత్=నాయొక్క, గురుః=గురువు, శ్రీజగద్గురుః=ప్రకాశ మానుఁడగులోకగురువైనపరమేశ్వరుఁడు, స్వాత్మైవ=నాయాత్మయే, సర్వభూతాత్మా=సమస్తభూతములయొక్క ఆత్మస్వరూపము, తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానమగు సద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ నాప్రభువే లోకప్రభువు. నాగురువే లోకగురువు, నాయాత్మయే సమస్తభూతములయొక్క ఆత్మస్వరూపము. అట్టి సద్గురుస్వరూపమైన పరమాత్మకొఱకునమస్కారము.

శ్లో॥ గురురాదిరనాదిశ్చ । గురుఃపరమదైవతం ।
గురుమంత్రసమోనాస్తి । తస్మైశ్రీగురవేనమః ॥ ౬౭॥

టీక ॥ గురుః=గురువు, ఆదిః=మొదటివాఁడును, (సమస్తమునకు మొట్టమొదటివాఁడు,) అనాదిశ్చ=ఆదిలేనివాఁడును, (తనకు మొట్టమొదటయెవరును లేనివాఁడును, భవతి=అగుచున్నాఁడు.) గురుః=గురువు, పరమదైవతం=శ్రేష్ఠమైనదైవము, గురుమంత్రసమః=గురుమంత్ర = గురుమంత్రమునకు, సమః=సమానమైనది, నాస్తి=లేదు, తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానమగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ గురువే సమస్తమునకు మొదటివాఁడును తనకు ఆదిలేనివాఁడును శ్రేష్ఠమైన దైవమును అగుచున్నాఁడు. గురుమంత్రమునకు సమానమైనది లేనే లేదు. అట్టి పరమాత్మస్వరూపమైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ ఏకఏవపరోబంధు । ర్విషమేసముపస్థితే ।
గురుస్సకలధర్మాత్మా । తస్మైశ్రీగురవేనమః ॥ ౬౮॥

టీ॥ విషమే=ఎక్కువతక్కువలు,(ఆపద)సముపస్థితేసతి=పొందఁబడు

చుండగా, సకలధర్మాత్మా=సకల = సమస్తములైన, ధర్మ = ధర్మములే, ఆత్మా=స్వరూపముగాగలవాడును, పరః=శ్రేష్ఠుఁడును, ఏకః=ఒకఁడు నగు, గురురేవ=గురువే, బంధుః=చుట్టము, (భవతి=అగుచున్నాడు.) తస్మై=అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానమగు గురువుకొఱకు, నమః =నమస్కారము.

తా॥ ఆపత్తుపొందినప్పుడుసర్వధర్మస్వరూపుఁడైన శ్రేష్ఠుఁడగు ఒకఁడైన గురువే బంధువగుచున్నాడు. అట్టిపరమబంధువైన సద్గురువు కొఱకు నమస్కారము.

శ్లో॥ గురుమధ్యేస్థితంవిశ్వం । విశ్వమధ్యేస్థితోగురుః ।
గురుర్విశ్వంసమస్తంతు । తస్మైశ్రీగురవేనమః ॥ ౬౯॥

టీక॥ విశ్వం=ప్రపంచము,గురుమధ్యే=గురువుయొక్క మధ్యయందు, స్థితం=ఉన్నది, గురుః=గురువు, విశ్వమధ్యే=ప్రపంచముయొక్క మధ్యయందు, స్థితః=ఉన్నాడు, సమస్తం=సమస్తమైన, విశ్వంతు= ప్రపంచమైతే, గురుః=గురువు, (భవతి = అగుచున్నది.) తస్మై = అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానమగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఈప్రపంచమంతయు సద్గురువునందున్నది సద్గురువుప్రపంచమునందున్నాడు. ప్రపంచమంతయు సద్గురువేను. అట్టి సర్వస్వరూపుఁడైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ భవారణ్యప్రవిష్టస్య । దిఙ్మోహభ్రాంతచేతసః ।
యేనసందర్శితఃపంథాః । తస్మైశ్రీగురవేనమః ॥ ౭౦॥

టీక॥ యేన=ఎవనిచేత, భవా...ష్టస్య=భవ=సంసారమనెడి (అనగా దేహమనెడి,) అరణ్యా=అడవియందు, ప్రవిష్టస్య = ప్రవేశించియున్న, ది...సః=దిక్=దిక్కులయొక్క, మోహ=అజ్ఞానముచేతను, భ్రాంత= చలించుచున్న, చేతసః=మనస్సుగలవానికి, పంథాః=జ్ఞానమార్గము, సం

దర్శితః=చూపింపఁబడెనో; తస్మై=అటువంటి, శ్రీగురవే = ప్రకాశమాన మగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ జననమరణప్రవాహరూపమైనశరీరమనెడియరణ్యమునందు ప్రవేశించి స్వరూపజ్ఞానములేకపోవుటచేత చంచలమగు మనస్సుగలవానికి, ఎవనిచేతస్వస్వరూపసాక్షాత్కారమనెడి జ్ఞానమార్గము చూపింపఁబడినదో, అట్టిశ్రీసద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ తాపత్రయాగ్నితప్తానా । మశాంతప్రాణినాముదే ।
గురురేవపరాగఙ్గా । తస్మైశ్రీగురవేనమః ॥ ౭౧॥

టీక॥ తాప...ప్తానాం=తాపత్రయ = ఆధ్యాత్మికాదితాపత్రయములనెడి, అగ్ని=అగ్నిచేతను, తప్తానాం = దహింపఁబడిన, అశాంతప్రాణినాం=అశాంత=నెమ్మదిలేని, ప్రాణినాం=జీవముగలవారల యొక్క, ముదే=సంతోషముకొఱకు, గురురేవ = గురువే, పరా = శ్రేష్ఠమైన, గఙ్గా=గంగానది, (భవతి=అగుచున్నది.) తస్మై= అటువంటి, శ్రీగురవే= ప్రకాశమానుఁడగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ జ్వరాదిరోగములవల్లనైన అధ్యాత్మికతాపమును, సర్పవృశ్చికాదులవల్లనైన ఆధిభౌతికతాపమును, పిడుగుమొదలైనవానివలన కలిగెడి ఆధిదైవికతాపమును, ఈమూఁడు తాపములనెడి నిప్పుచేత కాల్చబడి నెమ్మదిలేని జీవముగలమనుజులకు ఆబాధలనుబోగొట్టి సంతోషమునుగలుగఁజేయుటకు సద్గురువే అధికమగు గంగానదిగానున్నాఁడు అట్టి పరమసంతోషకారణుఁడైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ అజ్ఞానేనాహినాగ్రస్తాః । ప్రాణిస్తాన్ చికిత్సకః ।
విద్యాస్వరూపోభగవాన్ । తస్మైశ్రీగురవేనమః ॥ ౭౨॥

టీక॥ ప్రాణినః=జీవులు, అజ్ఞానేన=అజ్ఞానమనెడి, (తన్నుతానుదెలియకపోవుటవల్లనైన తెలివిలేనితనము,) అహినా = సర్పముచేతను, గ్రస్తాః=మ్రింగఁబడియున్నారు, తాన్=అట్టిజీవులనుగూర్చి, చికిత్సకః=

నెవ్వుదిపరిచెడివైద్యుడు, విద్యాస్వరూపః = జ్ఞానస్వరూపుడగు, భగవాన్=భగవంతుఁడు, (భవతి = అగుచున్నాడు.) తస్మై = అటువంటి, శ్రీగురవే=ప్రకాశమానుఁడగు గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ లోకమునందలి జీవులు అజ్ఞానమనుగొప్పసర్పముచేతబ్రమింగబడియున్నారు.అటులబ్రమింగఁబడినజీవులనుగూర్చి అజ్ఞాననాశముచేసిబాగుపరిచెడి మహావైద్యుడగువాడు, జ్ఞానస్వరూపుడైన భగవంతుడే యగుచున్నాడు. అటువంటి భగవత్స్వరూపుడైన సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ హేతవేజగతామేవ । సంసారార్ణవసేతవే ।
ప్రభవేసర్వవిద్యానాం । శంభవేగురవేనమః ॥ ౭౩॥

టీక॥ జగతామేవ=లోకములకు, హేతవే=కారణుండును, సంసా...తవే=సంసార=సంసారమనెడి, అర్ణవ=సముద్రమునకు, సేతవే = వారధియైనవాడును, సర్వవిద్యానాం=అన్నివిద్యలకును, ప్రభవే=జన్మకారణుఁడగు, శంభవే=సుఖకారణుండగు ఈశ్వరుడైన, గురవే=గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ జగత్తులకు కారణుండును, సంసారసముద్రమునకు వారధియును సమస్తవిద్యలకు జన్మస్థానమును, సుఖకారణుడైనఈశ్వరుడునగుసద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ ధ్యానమూలంగురోర్మూర్తిః । పూజామూలంగురోఃపదం ।
మంత్రమూలంగురోర్వాక్యం । ముక్తిమూలంగురోఃకృపా॥ ౭౪॥

టీక॥ గురోః=గురువుయొక్క, మూర్తిః=స్వరూపము, ధ్యానమూలం=ధ్యానమునకు కారణము, గురోః=గురువుయొక్క, పదం = పాదము, పూజామూలం=పూజకుకారణము, గురోః=గురువుయొక్క, వాక్యం=వాక్యము, మంత్రమూలం=మంత్రమునకుకారణము, గురోః =గురువుయొక్క, కృపా=దయ, ముక్తిమూలం = మోక్షమునకుకారణము.

తా॥ గురువుయొక్క దేహమే ధ్యానమునకు కారణము, గురువు యొక్క పాదమే పూజించుటకు కారణము. గురువాక్యమే మంత్రమునకు కారణము. గురుకృపయే మోక్షమునకు కారణము.

శ్లో॥ సప్తసాగరపర్యన్త । తీర్థస్నానఫలంచయత్ ।
గురోఃపాదోదబిందోశ్చ । సహస్రాంశేనతత్ఫలం ॥ ౭౫॥

టీక॥ సప్త...ఫలం=సప్తసాగరపర్యంత=ఏడు సముద్రముల వరకుం డెడి, తీర్థ=పుణ్యతీర్థములయందు, స్నాన=స్నానము చేతనైన, ఫలం=ఫలము,యత్=ఏదియో,తత్ఫలం=ఆఫలము,గురోః=గురువుయొక్క,పాదో...దోశ్చ=పాద=చరణములయందున్న,ఉదక =జలముయొక్క,బిందోశ్చ=బొట్టులో, సహస్రాంశేన=వెయ్యోభాగముతో, (తుల్యం=సమానము, భవతి = అగుచున్నది.)

తా॥ సప్తసముద్రములవరకుండెడి పుణ్యోదకములయందు స్నానము చేయుటవల్లనైన ఫలమేదియో; అది గురుపాదోదకము యొక్క బిందువులో వెయ్యోభాగముతో సమానమగుచున్నది.

శ్లో॥ శివేరుష్టేగురుస్త్రాతా । గురౌరుష్టేనకశ్చన ।
లబ్ధ్వాకులగురుంసమ్యక్ । గురుమేవసమాశ్రయేత్ ॥ ౭౬॥

టీక॥ శివే=ఈశ్వరుడు, రుష్టేసతి = కోపించుచుండగా, గురుః=గురువు, త్రాతా=రక్షించువాడు, (భవతి=అగుచున్నాడు,) గురౌ= గురువు, రుష్టేసతి=ఆగ్రహించుచుండగా, కశ్చన=ఎవడును, న = రక్షించువాడులేడు. కులగురుం=వంశమునకు గురువైనవానిని, లబ్ధ్వా = పొంది, సమ్యక్=బాగుగా, గురుమేవ=గురుస్వరూపమునే, సమాశ్రయేత్=ఆశ్రయించవలయును.

తా॥ ఈశ్వరుడాగ్రహించుచుండగా గురువే రక్షించెడి వాడగుచున్నాడు. గురువు ఆగ్రహించునపుడెవడును రక్షించెడి వాడులేడు. గనుక కులగురువగు సద్గురువునే పొంది బాగా ఆశ్రయించ వలయును.

శ్లో॥ మధులుబ్ధోయథాభృంగః । పుష్పాత్పుష్పాంతరంవ్రజేత్ ।
జ్ఞానలుబ్ధ స్తథాశిష్యో । గురోర్గుర్వ న్తరంవ్రజేత్ ॥ ౭౭॥

టీక ॥ మధులుబ్ధః=మధు=పూదేనెయందు, లుబ్ధః= ఆశగల, భృంగః= తుమ్మెద, యథా =ఏప్రకారము, పుష్పాత్ =ఒకపువ్వునుండి, పుష్పాంతరం=వేరొకపుష్పమునుగూర్చి, వ్రజేత్ = పొందునో, తథా = ఆ ప్రకారము, జ్ఞానలుబ్ధః=జ్ఞాన=స్వాత్మజ్ఞానమునందు, లుబ్ధః = ఆశగల, శిష్యః=శిష్యుడు, గురోః=ఒకగురువునుండి, గుర్వంతరం= వేరొకగురువును, వ్రజేత్ =పొందవలయును.

తా॥ మకరందమునందాస_క్తిగల తుమ్మెద ఒకపుష్పమునుండి వేరొకపుష్పము నెట్లుపొందునో, ఆప్రకారమే స్వస్వరూపజ్ఞానము నందాస_క్తిగలశిష్యుడు, ఒకగురువునుండి వేరొకనిజగురువును బొందవలయును.

శ్లో॥ వందేగురుపదద్వంద్వం । వాఙ్మనోతీతగోచరం।
శ్వేతర_క్తప్రభాభిన్నం । శివశ_క్త్యాత్మకంపరం॥ ౭౮॥

టీక॥ వాఙ్మనోతీతగోచరం=వాక్ =వాక్కునకు,మనః=మనస్సునకు, అతీత=అతిక్రమించిన,గోచరం=విషయముగలదియును,శ్వేత...భిన్నం=శ్వేతర_క్త=పాటలవర్ణమైన, ప్రభా=కాంతిచేత, భిన్నం= వేరైనదియును, శివశ_క్త్యాత్మకం=శివశ_క్తి=ఈశ్వరమాయలయొక్క, ఆత్మకం= స్వరూపమైనదియును, పరం=శ్రేష్ఠమైనదియునగు,గురుపదద్వంద్వం=గురువుయొక్కపాదద్వంద్వమునుగూర్చి, వందే=నమస్కరించుచున్నాను.

తా.॥ వాఙ్మనస్సులకు కనబడనిదియును పాటలవర్ణము కలదియును శివశ_క్తి స్వరూపమునగు శ్రేష్ఠమైన సద్గురు పాదద్వంద్వమును గూర్చినమస్కరించుచున్నాను.

శ్లో॥ గుకారంచగుణాతీతం । రుకారంరూపవర్జితం ।
గుణాతీతమరూపంచ । యోదద్యాత్సగురుస్స్మృతః॥ ౭౯॥

టీక ॥ గుకారంచ=గువర్ణమును, గుణాతీతం= సత్వాదిగుణములనతిక్రమించినది, రుకారం=రువర్ణము, రూపవర్జితం=రూప = ఆకారమును,

వర్జితం=శూన్యమైనది, గుణాతీతం=సత్త్వాదిగుణరహితమును, అరూపం చ=రూపము లేనిదియునగు స్వస్వరూపమును, యః=ఎవడు, దద్యాత్ = ఇచ్చునో, సః=వాడు, గురుః=గురువుగా, స్మృతః=చెప్పఁబడుచున్నాడు.

తా॥ గువర్ణము నిర్గుణస్వరూపమును రువర్ణము కేవలనిరాకారమును గనుక నిర్గుణమును నిరాకారమునగు పరమాత్మస్వరూపమునుపదేశించెడి గురుడే గురువని చెప్పఁబడుచున్నాడు.

శ్లో॥ అత్రినేత్రశ్శివస్సాక్షా । ద్ద్విబాహుశ్చ హరిస్స్వయం ।
అచతుర్వదనో బ్రహ్మా । శ్రీగురుః కథితః ప్రియే॥ ౮౦॥

టీక॥ హే ప్రియే=ఓ ప్రియురాలగు ఓ పార్వతీ, శ్రీగురుః = ప్రకాశమానుఁడగు సద్గురువు, స్వయం=తాను, సాక్షాత్ =ప్రత్యక్షముగా, అత్రినేత్రః=మూడుకన్నులు లేని, శివః=ఈశ్వరుఁడుగాను, ద్విబాహుః= రెండు చేతులుగల, హరిశ్చ=విష్ణువుగాను, అచతుర్వదనః=నాలుగుముఖములు లేని, బ్రహ్మా=బ్రహ్మగాను, కథితః= చెప్పఁబడుచున్నాడు.

తా॥ ఓ పార్వతీ! సద్గురువు తానుప్రత్యక్షముగా మూడుకన్నులు లేని ఈశ్వరుఁడుగాను, రెండుభుజములుగల విష్ణువుగాను, నాలుగుముఖములు లేని బ్రహ్మగాను జెప్పఁబడుచున్నాడు.

శ్లో॥ అయం మయాంజలిర్బద్ధో । దయాసాగరసిద్ధయే ।
యదనుగ్రహతో జంతు । శ్చిత్రసంసారముక్తిభాక్॥ ౮౧॥

టీక॥ దయాసాగర=కరుణాసముద్రుడవగు ఓస్వామీ, జంతుః= జంతువు, యదనుగ్రహతః=యత్ =దేనిని, అనుగ్రహతః=అనుగ్రహించుటవలన, చిత్ర. . . భాక్ =చిత్ర=ఆశ్చర్యమైన, సంసార=సంసారమునుండి, ముక్తి= మోక్షమును, భాక్ =పొందినవాడు, (భవతి=అగుచున్నాడో, తస్య= అట్టిఅనుగ్రహమును, )సిద్ధయే = పొందుటకొఱకు, అయం=ఈ, అంజలిః=దోసిలి, మయా=నాచేత, బద్ధః=కూర్చఁబడినది.

తా॥ ఓస్వామీ లోకమునందు జీవుడు దేనిని అనుగ్రహించుటవలన ఆశ్చర్యమగు సంసారమునుండి ముక్తినిపొందుచున్నాడో-అట్టిముక్తియొక్క ప్రాప్తికొఱకు నాచేత ప్రార్థింపఁబడుచున్నది.

శ్లో॥ శ్రీగురోఃపరమంరూపం । వివేకంచక్షురగ్రతః ।
మందభాగ్యానపశ్యన్తి । అంధస్సూర్యోదయంయథా ॥ ౮౨ ॥

టీక॥ మందభాగ్యాః= మంద=అల్పమైన, భాగ్యాః=అదృష్టముగల వారలు, అగ్రతః= ముందుగా, శ్రీగురోః= సద్గురువు యొక్క, పరమం రూపం=శ్రేష్ఠమైనరూపమును, వివేకంచక్షుః=జ్ఞాననేత్రమునున్ను, అంధః=గ్రుడ్డివారు, సూర్యోదయంయథా= సూర్య=సూర్యుని యొక్క, ఉదయంయథా=ఉదయమునువలెనే, నపశ్యన్తి=చూడరు.

తా ॥ అదృష్టములేనివారు సద్గురువు యొక్క శ్రేష్ఠమైన రూపమును, గ్రుడ్డివాడు సూర్యోదయమును, ఎదురుగానిలిచిచూడలేరు.

శ్లో॥ కులానాంకులకోటీనాం । తారక స్తత్రతత్క్షణాత్ ।
అత స్తంసద్గురుంజ్ఞాత్వా । త్రికాలమభివాదయేత్ ॥ ౮౩ ॥

టీక॥ తత్ర=అక్కడ, తత్క్షణాత్ = అప్పుడే, కులానాం = కులములను, కులకోటీనాం=కులముల యొక్క అనేక కోటులను, తారకః= తరింపజేయువాడు, (ఉద్ధరించెడివాడు, భవతి = అగుచున్నాడు.) అతః =అందువలన, తం= అటువంటి, సద్గురుం = శ్రేష్ఠమైన గురువును, జ్ఞాత్వా= తెలిసికొని, త్రికాలం=మూడు కాలములయందున్ను, అభివాదయేత్ =నమస్కరించవలయును.

తా ॥ జనుడు సద్గురువును జూచినప్పుడే అనేకకోటి వంశములనుద్ధరించినవాడగుచున్నాడు గనుక అటువంటి సద్గురువును దెలిసికొని త్రికాలములయందు నమస్కరించవలయును.

శ్లో॥ శ్రీనాథచరణద్వంద్వం । యస్యాందిశివిరాజతే ।
తస్యాందిశినమస్కుర్యా । ద్భక్త్యాప్రతిదినంప్రియే॥ ౮౪॥

టీక॥ హేప్రియే=ఇష్టురాలవగు ఓపార్వతీ, శ్రీనా...ద్వంద్వం = శ్రీనాథ=ప్రకాశమానమగు ప్రభువైన సద్గురువు యొక్క, చరణ = పాదము యొక్క, ద్వంద్వం= రెండును, యస్యాందిశి= ఏదిక్కుయందు, విరాజతే=ప్రకాశించుచున్నవో, తస్యాందిశి = ఆదిక్కుయందు, భక్త్యా

భక్తితో, ప్రతిదినం=ప్రతిదినమున్ను, నమస్కుర్యాత్ =నమస్కరించవలయును.

తా॥ ఓపార్వతీ సద్గురుపాదయుగళము-ఏదిక్కునప్రకాశించునో ఆదిక్కుననే జనుడు ప్రతిదినము భక్తితోనమస్కరించవలయును.

శ్లో॥ సాష్టాంగప్రణిపాతేన । స్తువన్నిత్యంగురుంభజేత్ ।
భజనాత్థైర్యమాప్నోతి । స్వస్వరూపమయోభవేత్ ॥ ౮౫॥

టీక॥ సాష్టాంగప్రణిపాతేన= సాష్టాంగనమస్కారముచేత, స్తువన్ =స్తోత్రముచేయుచు, గురుం=గురువును, నిత్యం=ఎల్లప్పుడున్ను, భజేత్ =సేవించవలయును, భజనాత్ =సేవించుటవలన, స్థైర్యం = చంచలము లేకపోవుటను, (ధైర్యమును,) ఆప్నోతిః=పొందుచున్నాడు, స్వస్వరూపమయః=ఆత్మస్వరూపమైనవాడును, భవేత్ =అగుచున్నాడు.

తా॥ జనుడు గురువును ఎల్లప్పుడుస్తోత్రముచేయుచు సాష్టాంగనమస్కారముతో సేవించవలయును. అట్లు సేవించుటవలన (ధైర్యమును) చలనరహితమును బొంది ఆత్మస్వరూపుడగుచున్నాడు.

శ్లో॥ దోర్భ్యాంపద్భ్యాంచజానుభ్యాం । మురసాశిరసాదృశా ।
మనసావచసాచేతి । ప్రణామోష్టాంగ ఉచ్యతే॥ ౮౬॥

టీక॥ దోర్భ్యాం=భుజములచేతను, పద్భ్యాం = పాదములచేతను, జానుభ్యాం= మోకాళ్లచేతను, ఉరసా = వక్షస్థలముచేతను, శిరసా = శిరస్సుచేతను, దృశా=దృక్కుచేతనున్ను, మనసా=మనస్సుచేతను; వచసాచ=వాక్కుచేతనున్ను, (చేయబడిన నమస్కారము,) అష్టాంగః=యెనిమిది అవయవములుగల, ప్రణామ ఇతి=నమస్కారమని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

తా॥ భుజములు, పాదములు, మోకాళ్లు, వక్షస్థలము, శిరస్సు, చూపు, మనస్సు, వాక్కు ఈయెనిమిదింటిచే చేయఁబడిన నమస్కారము,సాష్టాంగనమస్కారమని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ తస్మై ద్యది శేసతతమంజలి రేషనిత్యం । ప్రక్షిప్యతాం ముఖరితైర్మధురైఃప్రసూనైః । జాగర్తియత్రభగవాన్ గురు చక్రవర్తీ । విశ్వస్థితి ప్రళయనాటక నిత్యసాక్షీ ॥ ౮౭॥

టీక॥ విశ్వ...సాక్షీ=విశ్వ=ప్రపంచముయొక్క, స్థితిప్రళయ=రక్షణసంహారములనెడి, నాటక=నాటకమును, నిత్య=ఎల్లప్పుడును, సాక్షీ=చూచువాడును, భగవాన్=పూజ్యుడునగు, గురుచక్రవర్తీ= సద్గురువనెడిమహారాజు, యత్ర=ఏదిక్కుయందు, జాగర్తి= జాగ్రతతోనుండుచున్నాడో, తస్మై=అటువంటి, దిశే=దిక్కులకొఱకు, ఏషః=ఈ,అంజలిః=దోసలి, మధురైః=మనోజ్ఞములైన, ముఖరితైః=శబ్దించెడి, ప్రసూనైః,=పుష్పములతో, సతతం=ఎల్లప్పుడున్ను, ప్రక్షిప్యతాం=చిమ్మునుగాక.

తా॥ జగత్తుయొక్క స్థితిప్రళయముల నెడునాటకములకు సాక్షియైన పూజ్యుఁడగు సద్గురువు-ఏదిక్కునప్రకాశించునో, ఆదిక్కుకొఱకు ఎల్లప్పుడును మనోహరములగుతుమ్మెద ధ్వనులతో గూడుకొనినపుష్పాంజలులు చల్లవలయును.

శ్లో॥ అభ్యస్తైః కిముదీర్ఘకాలవిమలై ర్వ్యాధిప్రదై ర్దుష్కరైః । ప్రాణాయామ శతైరనేకకరణై ర్దుఃఖాత్మకై ర్దుర్జయైః । యస్మిన్నభ్యుదితేవి నశ్యతిబలీ వాయుస్స్వయం తత్క్షణాత్ । ప్రాప్తుంతత్సహజస్వభావమనిశం సేవేతమేకంగురుం॥ ౮౮॥

టీక॥ దీర్ఘ...మలైః=దీర్ఘకాల = బహుకాలమునుండి, విమలైః = స్వచ్ఛములైనవియును; అభ్యస్తైః=వాడుకచేయ బడినవియును, వ్యాధిప్రదైః=రోగమును ఇచ్చెడివియును, దుష్కరైః= చేయుట కశక్యమైనవియునగు, ప్రాణాయామశతైః=ప్రాణాయామ ములయొక్క నూరులతోను, దుఃఖాత్మకైః=దుఃఖస్వరూపములైనవియును, దుర్జయైః = జయించుటకశక్యమైనవియునగు, అనేకకరణైః=బహుసాధనములతో, కిము = ఏమిప్రయోజనము, యస్మిన్=ఏస్వరూపము, అభ్యుదితేసతి=కలుగుచుం

డగా, బలీ=బలవంతుఁడగు, వాయుః=వాయువు, స్వయం=తాను, త త్క్షణాత్ =అప్పుడె, వినశ్యతి=నశించుచున్నాఁడో, తత్ = ఆస్వరూపము ను, ప్రాప్తుం=పొందుటకు, సహజస్వభావం =సహజ = కూడాపుట్టిన, స్వభావం = ప్రకృతిగల, ఏకం=ఒక్కఁడగు, తం=అట్టిప్రసిద్ధుడైన, గు రుం=సద్గురువును, అనిశం=ఎల్లప్పుడును, సేవేత = సేవించవలయును.

తా॥ అభ్యసింపఁ బడునవియును రోగప్రదములును కఠినములును ప్రాణాయామములతోను ఇంకా ఇతరసాధనములతో నేమిప్రయోజనము. ఏస్వరూపముకలుగుచుండగా బలవత్తరమైనవాయువు తనంతటతా నుఅప్పుడేయడగునో, అట్టిస్వరూపమునుపొందుటకు సహజమైన ప్రకృతి గల అద్వితీయుఁడగు సద్గురువును ఎల్లప్పుడు సేవించవలయును.

శ్లో॥ జ్ఞానంవినాముక్తిపదం । లభ్యతేగురుభక్తితః ।
గురోఃసామాన్యతోనాన్యత్ । సాధనంగురుమార్గిణాం ॥ ౮౯॥

టీక॥ ముక్తిపదం=మోక్షస్థానము, జ్ఞానంవినా = జ్ఞానములేకుండా నే, గురుభక్తితః=గురువుయొక్కభక్తివలన, లభ్యతే = పొందఁబడుచు న్నది. గురుమార్గిణాం=సద్గురుమార్గముగలవారలకు, సామాన్యతః = సాధారణముగా, గురోః=గురువుకంటె, అన్యత్ =ఇతరమైన, సాధ నం=ఉపాయము, న= లేదు.

తా॥ మోక్షస్థానము=జ్ఞానములేకుండా నే గురుభక్తివలన పొంద బడుచున్నది. గనుక సద్గురుమార్గముగలవారలకు సామాన్యముగా గురు వుకంటె వేరైనయుపాయమే లేదు.

శ్లో ॥ యస్మాత్పరతరంనాస్తి । నేతినేతీతివైశ్రుతిః ।
మనసావచసాచైవ । సత్యమారాధయేద్గురుం ॥ ౯౦॥

టీక॥ యస్మాత్ =ఏగురుస్వరూపముకంటె, పరతరం = మిక్కిలి శ్రే ష్ఠమైనది, నాస్తీతి= లేదని, నేతినేతి= నేతినేతియను,శ్రుతిః= వేదవాక్య ము, వై=ప్రసిద్ధముగానున్నదో, (తం=అటువంటి) సత్యం= సత్యస్వరూ పుడైన, గురుం=గురువును, మనసా=మనస్సుతోను, వచసాచైవ = వా క్కుతోనున్ను, ఆరాధయేత్ =పూజించవలయును.

తా॥ నేతి నేతియనుశ్రుతి యీగురుస్వరూపముకంటె నధికమైనది లేద ని చెప్పునో, అట్టిసత్యమగు గురుస్వరూపమును వాఙ్మనస్సులతో పూజించ వలయును.

శ్లో॥ గురోఃకృపాప్రసాదేన । బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ।
సామర్థ్యమగమన్సర్వే । కేవలంగురుసేవయా॥ ౯౧॥

టీక॥ బ్రహ్మవిష్ణు మహేశ్వరాః= బ్రహ్మవిష్ణుమహేశ్వరులుమున్గురు ను, సర్వే=అందరును, గురోః=గురువుయొక్క, కృపాప్రసాదేన=దయ కుపాత్రులగుచున్నారు, కేవలం=మిక్కిలి, గురుసేవయా=గురువును సే వించుటచేతను, తత్ =అ, సామర్థ్యం=శక్తిని, అగమన్=పొందిరి.

తా॥ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మొదలైన వారందరును గురుకృపను బొందుటచేతను, మిక్కిలిగా గురుసేవచేయుటచేతను, అట్టిసామర్థ్యమును బొందిరి.

శ్లో॥ దేవకిన్నరగంధర్వాః । పితృయక్షాస్తుతుంబురుః ।
మునయోపినజానన్తి । గురుశుశ్రూషణేవిధిం॥ ౯౨॥

టీక॥ దేవకిన్నరగంధర్వాః=దేవ = దేవతలును, కిన్నర =కిన్నరులు ను, గంధర్వాః=గంధర్వులును, పితృయక్షాస్తు=పితృ= పితృదేవతలును, యక్షాస్తు=యక్షులును, తుంబురుః=తుంబురుడను యక్షుడును, మున యోపి=ఋషులును,గురుశుశ్రూషణే=గురు=గురువుయొక్క,శుశ్రూష ణే=సేవయందలి,విధిం=విధానమును, నజానన్తి=గుర్తెఱుగరు.

తా॥ దేవకిన్నరగంధర్వులును,పితృదేవతలును,యక్షులును,ఋషులును వీరెవరును గురుశుశ్రూషణవిధిని తెలిసినవారుకారు.

శ్లో॥ మహాహంకారగర్వేణ । తపోవిద్యాబలేనచ ।
భ్రమన్తిచాస్మిన్సంసారే । ఘటీయంత్రంయథాపునః॥ ౯౩॥

టీక॥ (జనాః= జనులు), మహాహంకారగర్వేణ= గొప్ప అహంకా రముయొక్క అభిమానముచేతను, తపో. . . లేనచః=తపః=తపస్సుయొ క్కయు, విద్యా=చదువులయొక్కయు, బలేనచ=బలముచేతనున్ను, అ స్మిన్=ఈ, సంసారే=సంసారమునందు, పునః=మరల, ఘటీయంత్రంయ

ధా = బావిగిలకవలెనే, (నీళ్లు తోడుటకు బావికినేర్పరచినగిలక,) భ్రమన్తి= పుట్టుచున్నారు.

తా ॥ జనులుగొప్ప అహంకారముచేతను తపోవిద్యలయొక్క బలముచేతనున్న ఈదేహమనెడి సంసారమునందు జననమరణములతోతిరిగితిరిగి, నీటియొక్క శాకపోకలతో బావియందలి గిలకవలెనే భ్రమవలనజననమరణములనుబొందుచున్నారు.

శ్లో ॥ నముక్తాగణగంధర్వాః । పితృయక్షాస్తుచారణాః ।
ఋషయస్సిద్ధదేవాద్యాః । గురుసేవాపరాఙ్ముఖాః॥ ౯౪॥

టీక॥ గణగంధర్వాః=గణ=ప్రమథగణములును, గంధర్వాః=గంధర్వులును, పితృయక్షాస్తు=పితృ=పితృదేవతలును, యక్షాస్తు=యక్షులును-చారణాః = చారణులును, ఋషయః=మునులును, సిద్ధదేవాద్యాః= సిద్ధ=సిద్ధులును, దేవాద్యాః = దేవతలు మొదలైనవారును-గురుసేవాపరాఙ్ముఖాః=గురు= గురువుయొక్క సేవ= సేవించుటయందు, పరాఙ్ముఖాః=దూరస్థులైముక్తినిపొందినవారు, న=కారు.

తా ॥ ప్రమథగణములును గంధర్వులును ఈమొదలైన వారందరును గురుసేవయందువిముఖులైముక్తినిపొందుటలేదు.

ఇతి శ్రీస్కాందపురాణే ఉత్తరఖండే ఉమామహేశ్వరసంవాదే శ్రీగురుగీతాయాం శ్రీగురుప్రభావవర్ణనంనామ ద్వితీయోధ్యాయః.

గద్య ॥ ఇది స్కాంధపురాణ ఉత్తరఖండము నందలి ఉమా
మహేశ్వరసంవాదమునందు గురుప్రభావ వర్ణనమును
శ్రీమద్భాగవతకృష్ణదేశిక ప్రభుస్వాములవారిప్రియ
శిష్యుడైనఫీల్లానాశంకరరావుగారిచేటీకా
తాత్పర్యములనురచియింపఁబడినద్వితీ
యాధ్యాయం - సమాప్తము.

---

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

## సుజ్ఞానదీపమను * గురుగీతలు.

### స్తుతి యా ధ్యా య ప్రా ర ంభ ము.

శ్లో॥ ॥ ధ్యానంశ్రృణుమహాదేవీ । సర్వానందప్రదాయకం ।
సర్వసౌఖ్యకరంచైవ । భక్తిముక్తిప్రదాయకం॥ ౯౫॥

టీక॥ హేదేవీ=ఓపార్వతీ! సర్వానందప్రదాయకం . . . సర్వ=సమస్తములైన, ఆనంద=సంతోషములను, ప్రదాయకం= ఇచ్చునదియును, సర్వ. . . కరంచైవ=సర్వ= సమస్తములైన, సౌఖ్యకరంచైవ = సుఖములనిచ్చునదియును, భుక్తి. . . యకం=భుక్తి=భోగమును, ముక్తి = మోక్షమును, ప్రదాయకం=కలుగఁజేసెడు, ధ్యానం=ధ్యానమును, శ్రృణు=వినుము.

తా॥ ఓపార్వతీ! నీవు సమస్తానందముల నొసంగునదియును, సమస్తసౌఖ్యములను జేయునట్టిదియును,భుక్తి-ముక్తులనుఇచ్చునదియునునగు ఆత్మధ్యానమును జెప్పుచున్నానువినుము.

శ్లో ॥ శ్రీమత్పరం బ్రహ్మగురుంస్మరామి । శ్రీమత్పరం బ్రహ్మగురుంభజామి । శ్రీమత్పరంబ్రహ్మగురుంవదామి । శ్రీమత్పరంబ్రహ్మగురుంనమామి॥ ౯౬॥

టీక॥ శ్రీమ. . . గురుం=శ్రీమత్ =ప్రకాశముగల, పరంబ్రహ్మ= పరబ్రహ్మస్వరూపమైన, గురుం=గురువును, స్మరామి= తలంచుచున్నాను, శ్రీమత్పరంబ్రహ్మగురుం=ప్రకాశముగల పరబ్రహ్మస్వరూపమైన గురువును, భజామి=సేవించుచున్నాను, శ్రీమత్పరంబ్రహ్మగురుం = ప్రకాశముగల పరబ్రహ్మస్వరూపమైనగురువును, వదామి=చెప్పుచున్నాను, శ్రీమత్పరంబ్రహ్మగురుం= ప్రకాశముగల పరబ్రహ్మస్వరూపమగు గురువునుగూర్చి, నమామి=నమస్కరించుచున్నాను.

తా ॥ ప్రకాశముగల పరబ్రహ్మ స్వరూపమైన సద్గురువును స్మరించుచున్నాను, సేవించుచున్నాను, చెప్పుచున్నాను, నమస్కరించుచున్నాను.

శ్లో ॥ బ్రహ్మానందంపరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం । ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం । ఏకంనిత్యంవిమలమచలం సర్వధీసాక్షిభూతం । భావాతీతం త్రిగుణ రహితం సద్గురుంతంనమామి॥ ౯౭॥

టీక॥ బ్రహ్మానందం=బ్రహ్మానంద స్వరూపుడును, పరమసుఖదం... పరమ = శ్రేష్ఠమైన, సుఖదం = సుఖమునిచ్చువాడును, కేవలం= ఏక స్వరూపుడును, జ్ఞానమూర్తిం= జ్ఞానస్వరూపుడును, ద్వంద్వాతీతం = ద్వంద్వ = శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములను, అతీత = అతిక్రమించెడివాడును, గగనసదృశం...గగన=ఆకాశముతో, సదృశం = సమానుడును, తత్త్వమస్యాదిలక్ష్యం, తత్త్వమస్యాది=తత్త్వమసి మొదలైన మహావాక్యముల యొక్క, లక్ష్యం=లక్ష్యార్థమైనవాడును, ఏకం=అద్వితీయుడును, నిత్యం=శాశ్వతుడును, విమలం=స్వచ్ఛమైనవాడును. అచలం=కదలనివాడును, సర్వధీసాక్షిభూతం = సర్వధీ=సమస్త జ్ఞానములకును, సాక్షిభూతం=సాక్షియైనవాడును, భావాతీతం = తలంపునకతిక్రమించి యుండెడివాడును, త్రిగుణరహితం = సత్వాది గుణములు మూడును లేనివాడునునగు, తంసద్గురుం=ఆశ్రేష్ఠమైనగురుస్వరూపమునుగూర్చి, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ బ్రహ్మానందస్వరూపుడును, పరమసౌఖ్యము నిచ్చువాడును కేవల పరమాత్మస్వరూపుండును జ్ఞానస్వరూపుండును, సుఖదుఃఖాదిద్వంద్వములు లేనివాడును, ఆకాశసమానుండును,తత్త్వమస్యాదిమహావాక్యములకులక్ష్యార్థమైన అఖండమగు పరబ్రహ్మస్వరూపుండును, అద్వితీయుండును, శాశ్వతుండును, విమలుండును, చలన వర్జితుండును బుద్ధికి సాక్షిమాత్రుండును, తలంపులకు లోబడక అతిక్రమించి యుం,

డెడువాడును, రజసత్వతమోగుణములు లేనివాడునునగు, అట్టిసద్గురుస్వ రూపునింగూర్చి, నమస్కరించుచున్నాను.

శ్లో॥ హృదయాంబుజేకర్ణిక మధ్యసంస్థం । సింహాసనే సంస్థిత దివ్య మూర్తిం । ధ్యాయేద్గురుంచంద్రకళాప్రకాశం । సచ్చిత్సు ఖాభీష్టవరందధానం॥ ౯౮॥

టీక॥ సింహాసనే=సింహాసనమునందు, సంస్థిత దివ్యమూర్తిం=సం స్థిత=ఉన్నటువంటి, దివ్య=ప్రకాశమానమగు, మూర్తిం= స్వరూపము గలవాడును, చంద్రకళాప్రకాశం=చంద్ర=చంద్రుని యొక్క, కళా = కళవలెనే, ప్రకాశం = ప్రకాశించెడివాడును, సచ్చిత్సుఖాభీష్టవరం = సచ్చిత్ =సత్తుచిత్తుల యొక్క, సుఖ = ఆనందముచేత, అభీష్ట = ప్రియ మగు,వరం=దైవప్రసాదమును, దధానం=ధరించియుండెడివాడునునగు, గురుం=సద్గురువును, హృదయాంబుజే=హృదయకమలమునందలి, కర్ణిక మధ్యసంస్థం, కర్ణిక=దుద్దుయొక్క, మధ్య=నడుమను, సంస్థం= ఉన్న వానినిగా, ధ్యాయేత్ = ధ్యానించవలయును.

తా॥ సింహాసనమునందు దివ్య స్వరూపము గలవాడును, చంద్ర కళవలెనే ప్రకాశించెడివాడును, సత్తుచిత్తుల యొక్క సుఖము చేతనైన పరమానందముచేత ప్రియమగు దైవప్రసాదమును ధరించి యుండెడి వాడునునగు, సద్గురువునుహృదయకమల కర్ణికామధ్యమునందున్న వాని నిగా, ధ్యానించవలయును.

శ్లో॥ శ్వేతాంబరం శ్వేత విలేపపుష్పం । ముక్తావిభూషం ముదితద్వి నేత్రం । వామాంకపీఠస్థితదివ్యశక్తిం । మందస్మితం పూర్ణ కృపానిధానం॥ ౯౯॥

శ్లో॥ ఆనంద మానందకరం ప్రసన్నం । జ్ఞానస్వరూపం నిజభావయు క్తం । యోగీంద్రమీడ్యంభవరోగవైద్యం । శ్రీమద్గురుం నిత్య మహంనమామి॥ ౧౦౦॥

టీక॥ శ్వేతాంబరం, శ్వేత = తెల్లని, అంబరం = వస్త్రముగలవా
డును, శ్వేత...పుష్పం, శ్వేత= తెల్లని, విలేప=విశేషముగా పూసు
కొనినచందనమును, పుష్పం = పుష్పముగలవాడును, ముక్తావిభూషం,
ముక్తా = ముత్యములయొక్క, విభూషం = అలంకారముగల వాడును,
ముదితద్వినేత్రం, ముదిత = సంతోషముతోఁగూడుకొనిన, ద్వినేత్రం =
రెండుకన్నులుగలవాడును, వామాఙ్కపీఠే, వామ = ఎడమప్రక్క, అ
ఙ్క పీఠే=తొడయనెడి సింహాసనమునందు, స్థితదివ్యశక్తిం, స్థిత = ఉ
న్న, దివ్య = ప్రకాశమగు, శక్తిం = శక్తిగలవాడును, మందస్మితం,
మంద=స్వల్పమైన, స్మితం=చిఱునగవుగలవాడును, పూర్ణ...ధానం,
పూర్ణ = నిండైన, కృపా = దయకు, నిధానం = స్థానమైనవాడును,
ఆనందం=ఆనందస్వరూపుడును, ఆనందకరం = సంతోషమును గలుగఁ
జేయువాడును, ప్రసన్నం=నిర్మలుడును, జ్ఞానస్వరూపం= జ్ఞానమేస్వ
రూపముగాగలవాడును, నిజభావయుక్తం, నిజ=స్వకీయమైన, భావ=
నిజస్వరూపముతో, యుక్తం=కూడియుండెడివాడును, యోగీంద్రం =
యోగిశ్రేష్ఠుడును, ఈడ్యం = స్తుతించదగినవాడును, భవరోగవైద్యం
భవ = సంసారమనెడి, రోగ = వ్యాధికి, వైద్యం=చికిత్సకుఁడునునగు,
శ్రీమద్గురుం = ప్రకాశముగల సద్గురువునుగూర్చి, అహం = నేను
నిత్యం=ఎల్లప్పుడును, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ తెల్లని వస్త్రములు గలవాడును, తెల్లని గంధపుష్పములను
గలవాడును, ముత్తెపుభూషణములు గలవాడును, సంతోష యుక్తమగు
రెండునేత్రములుగలవాడును, ఎడమతొడయందు దివ్యశక్తి గలవాడు
ను, స్వల్పమైన చిఱునగవుగలవాడును నిండైన దయకు స్థానభూతు
డును, ఆనందస్వరూపుడును, ఆనందమునుగలుగఁజేయువాడును, నిర్మ
లుఁడును, జ్ఞానస్వరూపుడును, సహజమైనస్వరూపముతోఁ గూడియుం
డెడివాడును, యోగిశ్రేష్ఠుడును, స్తుతించదగినవాడును,సంసారమనెడు
రోగమునకు వైద్యుండునునగు సద్గురువునకుసదానమస్కరించుచున్నాను.

శ్లో ॥ వందేగురూణాంచరణారవిందం । సందర్శితస్వాత్మసుఖాంబుధీనాం । జనస్యయేషాంగుళికాయమానం । సంసారహాలాహలమోహశాంత్యై॥

టీక॥ జనస్య=జనుల యొక్క, సంసారహాలాహలమోహశాంత్యై, సంసార = సంసారమనెడి, హాలాహల = విషమువల్లనైన, మోహ=మూర్ఛయొక్క, శాంత్యై = శాంతికొఱకు, గుళికాయమానం = మాత్రలుగానుండెడి, సందర్శి... ధీనా, సందర్శిత = చూపింపఁబడిన, స్వాత్మ సుఖ = తనఆత్మసుఖము యొక్క, అంబుధీనాం = సముద్రములు గల, ఏషాం=ఈ, గురూణాం=గురువు యొక్క, చరణారవిందం = పాదపద్మములను గూర్చి, వందే=నమస్కరించుచున్నాను.

తా ॥ జనుల యొక్క జన్మజరామరణాది స్వరూపమైన దేహమనెడి విషమువల్లనైన అజ్ఞానస్వరూపమగు మూర్ఛయొక్క శాంతి కొఱకు, మాత్రయైన జ్ఞానబోధచేత చూపింపఁబడిన పరమాత్మ, స్వరూపమును సుఖసముద్రములుగల, సద్గురువు యొక్క పాదపద్మములనుగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో ॥ యస్మిన్ సృష్టిస్థితిధ్వంస । నిగ్రహానుగ్రహాత్మకం ।
కృత్యంపంచవిధంశశ్వ । ద్భాసతేతంగురుంభజేత్ ॥ ౧౦౨॥

టీక॥ సృష్టి...త్మకం, సృష్టి= సృజించుటయును, స్థితి = పరిపాలించుటయును, ధ్వంస = నశింపఁజేయుటయును, నిగ్రహ = నిరోధించుటయును, అనుగ్రహ = అనుగ్రహించుటయును, (కరుణ), ఆత్మకు = స్వరూపములుగా గలిగిన, పంచవిధం=అయిదువిధములైన, కృత్యం =పనులు, యస్మిన్=ఏగురువునందు, శశ్వత్ =ఎల్లప్పుడును. భాసతే= ప్రకాశించుచున్నవో, తం=అటువంటి, గురుం=సద్గురువును, భజేత్ = సేవింపవలయును.

తా ॥ సృష్టిస్థితి సంహార నిగ్రహానుగ్రహాత్మకములైన అయి

మువిధములగు వ్యాపారములు=ఏ గురువునం దెల్లప్పుడును ప్రకాశించు చుండునో; అట్టి సద్గురువును సేవించవలయును.

శ్లో॥ పాదాబ్జేసర్వసంసార । దావకాలానలంస్వకే । బ్రహ్మరంధ్రే స్థితాంభోజ । మధ్యస్థం చంద్రమండలం॥ ౧౦౩॥

శ్లో॥ అకథాదిత్రిరేఖాబ్జే । సహస్రదళమండలే ।
హంసంపార్శ్వత్రికోణేచ । స్మరేత్తంమధ్యగంగురుం॥ ౧౦౪॥

టీక॥ స్వకే=స్వకీయమగు, పాదాబ్జే=పాదపద్మమునందు, సర్వసంసార దావకాలానలం, సర్వ=సమస్తమైన, సంసార = సంసారమనెడి, దావ = వనమునకు, కాలానలం = ప్రళయకాల అగ్ని స్వరూపుడును, బ్రహ్మరంధ్రే= బ్రహ్మరంధ్రమునందు, స్థితాం...ధ్యస్థం, స్థిత = ఉన్న, అంభోజ=పద్మము యొక్క, మధ్యస్థం=నడుమనున్న, చంద్రమండలం= చంద్రబింబ స్వరూపుడును, పార్శ్వత్రికోణే=పార్శ్వ, ప్రక్కయందు= త్రికోణే = త్రికోణాకృతియైన, సహస్రదళమండలే= వేయి రేకుల యొక్క సమూహముగల, అకథాది త్రిరేఖాబ్జే, అకథాది=అకార, కకార, థకారాది వర్ణములే, త్రిరేఖా = మూడురేఖలుగా గల, అబ్జే = పద్మమునందు,మధ్యగం=మధ్యభాగమున,హంసంచ=హంసస్వరూపుడునగు, తం=ఆ, గురుం=గురుస్వరూపుని, స్మరేత్ =స్మరించవలయును.

తా॥ సహస్రార పద్మమునకు మధ్య ప్రదేశమున సూర్య చంద్రాగ్ని స్వరూపములుగా ప్రకాశించుచున్న సద్గురుస్వరూపమును స్మరించవలయును.

శ్లో॥ నిత్యశుద్ధంనిరాభాసం । నిరాకారంనిరంజనం।
నిత్యబోధంచిదానందం । గురుంబ్రహ్మనమామ్యహం॥ ౧౫౦॥

టీక॥ నిత్యశుద్ధం = ఎల్లప్పుడు పరిశుద్ధుడును, నిరాభాసం = దూషణము లేనివాడును, నిరంజనం=పాపము లేనివాడును, నిత్యబోధం= ఎల్లప్పుడు బోధస్వరూపుడును, చిదానందం =జ్ఞానానందస్వరూపుడునగు,

గురుం=గురువు-అనెడి, బ్రహ్మ = పరమాత్మను గూర్చి, అహం= నేను, నమామి = నమస్కరించుచున్నాను.

తా॥ నిత్యశుద్ధుండును నిరాభాసుండును నిరాకారుండును నిరంజనుండును నిత్యబుద్ధుండును చిదానందుండును నగు, గురుస్వరూపమైనపర బ్రహ్మమును గూర్చి నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ సకలభువనసృష్టిః కల్పితాశేషసృష్టి । ర్నిఖిలనిగమ దృష్టిస్స
త్పదార్థైకసృష్టిః । అథగణపరమేష్ఠి స్సత్పదార్థైక దృష్టి ।
ర్భవగుణపరమేష్ఠిర్మోక్షమార్గైకదృష్టిః॥ ౧౦౬॥

శ్లో॥ సకలభువన భంగస్థాపనా స్తంభయష్టిః । సకరుణరస వృష్టి స్త
త్త్వమాలాసమష్టిః । సకలసమయసృష్టి స్సచ్చిదానంద దృష్టి ।
ర్నివసతుమయినిత్యం శ్రీగురోర్దివ్యదృష్టిః॥ ౧౦౭॥

టీక॥ సక...సృష్టిః, సకల = సమస్తములైన, భువన = లోకముల ను, సృష్టిః = సృజించునదియును, కల్పి...సృష్టిః, కల్పిత = రచింపబడి న, అశేష = సమస్తమును, సృష్టిః = సృజించునదియును, నిఖి...దృ ష్టిః, నిఖల = సమస్తములగు, నిగమ=వేదములను, దృష్టిః = చూచునది యును, సత్ప...సృష్టిః, సత్ = శ్రేష్టములైన, పదార్థ = వస్తువులను, ఏక = ముఖ్యముగా, సృష్టిః = సృజించునదియును, అథగణపరమేష్టిః = అథ = సాకల్యములగు, గణ = ప్రమథగణములకు, పరమేష్ఠి = సృష్టిక ర్తయైనదియును, సత్ప...దృష్టిః, సత్ = శ్రేష్టమైన, పదార్థ = పర మార్థవస్తువునందు, ఏక = ముఖ్యమైన, దృష్టిః = చూపుగలది యును, భవగుణపరమేష్ఠిః, భవ = ఈశ్వరుని యొక్క, గుణ =గుణములకు, పర మేష్ఠి = సృష్టికర్తయైనదియును, మోక్షమార్గైకదృష్టిః, మోక్ష = ముక్తి యొక్క, మార్గ = దారియందు, ఏక = ముఖ్యమైన, దృష్టిః = చూపుగ లదియును, సక...యష్టిః, సకల=సమస్తములైన, భువన= లోకముల యొక్క, భంగ = నాశమును, స్థాపన=నిలుపుటకు, స్తంభయష్టిః= స్తం

భరూపమైన కోయ్యైమెనదియును, సకరుణరసవృష్టిః = దయారసము తోఁగూడుకొనినవర్షముగలదియును, తత్వమాలాసమష్టిః, తత్వ = పర మాత్మస్వరూపములగు, మాలా = పూలదండలయొక్క, సమష్టిః = స మూహముగలదియును, సకలసమయసృష్టిః, సకల = సమస్తములైన, సమయ = ఆచారములను, సృష్టిః = సృజించునదియును, సచ్చిదానంద దృష్టిః, సత్ = పరమాత్మయొక్క, చిత్ =జ్ఞానమువల్లనైన, ఆనంద= సంతోషముయొక్క, దృష్టి=చూపుగలదియునునగు, శ్రీగురోః= ప్రకాశ మానుడగు సద్గురువుయొక్క, దివ్యదృష్టిః = స్వప్రకాశ మానమగు చూపు, మయి = నాయందు, నిత్యం = ఎల్లప్పుడును, నివసతు=ఉండు నుగాక.

తా॥ సమస్తలోకములను సృజించునదియును, సమస్త వేదముల యొక్క చూపుగలదియును, శ్రేష్ఠములైన వస్తువులను ముఖ్యముగా సృజించునది యును, సంపూర్ణులగు ప్రమథాది గణములకు సృష్టిక ర్తయును, పరమాత్మవస్తువునందు ముఖ్యమైన చూపుగలది యును, ఈశ్వర గుణముల సృజించునదియును, ముక్తిమార్గమునందు ముఖ్య మైన చూపుగలదియును, సమస్తలోకములయొక్క నాశమును నిలువు టకు స్తంభమైనదియును, దయారసముతోఁ గూడిన వర్షము గలది యును, పరతత్వమనెడి పూలదండలయొక్క సమూహముగలదియును, సమస్తములైన నియమములను సృజించునదియును, సచ్చిదానంద స్వ రూపమైన పరమాత్మయందు చూపుగలదియునునగు సద్గురువుయొక్క స్వప్రకాశమగు చూపుయెల్లప్పుడు నాయందుండునుగాక.

శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం । శివ శాసనతశ్శివశాసనతశ్శివశాసనతశ్శివశాసనతః ॥ ౧౦౫॥

టీక॥ శివశాసనతః =ఈశ్వరాజ్ఞవలన, గురోః=గురువుకంటె, అధి కం = శ్రేష్ఠమైనది, న = లేదు. శివశాసనతః = ఈశ్వరాజ్ఞ వలన,

గురోః=గురువుకంటె, అధికం=శ్రేష్ఠమైనది, న=లేదు, శివశాసనతః = ఈశ్వరాజ్ఞవలన, గురోః = గురువుకంటె, అధికం = శ్రేష్ఠమైనది, న = లేదు, శివశాసనతః=ఈశ్వరాజ్ఞవలన, గురోః=గురువుకంటె, అధికం= శ్రేష్ఠమైనది, న = లేదు.

తా॥ ఈశ్వరాజ్ఞవలన గురువుకంటె శ్రేష్ఠమైనదిలేదు. దృఢము కొఱకు ఈశ్లోకమునందు, నాలుగు పాదములయందును యొక్కటే యర్థమును జెప్పంబడినది.

శ్లో॥ ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం । మమ శాసనతో మమశాసనతో మమశాసనతో మమశాసనతః॥౯౦॥

టీక॥ మమ=నాయొక్క, శాసనతః = ఆజ్ఞవలన, ఇదమేవ = ఇదియే, శివం=మంగళమైనది, మమ=నాయొక్క, శాసనతః = అజ్ఞవలన, ఇదమేవ=ఇదియే, శివం = మంగళమైనది, మమ = నాయొక్క, శాసనతః=ఆజ్ఞవలన, ఇదమేవ = ఇదియే, శివం = మంగళమైనది, మమ = నాయొక్క, శాసనతః = ఆజ్ఞవలన, ఇదమేవ=ఇదియే, శివం=మంగళమైనది.

తా॥ నాయాజ్ఞవలన ఈ గురుస్వరూపమే మంగళ స్వరూపమైనదని శ్లోకమునందు నాలుగు పాదములయందును యొకటే యర్థమును, స్ఫుటమగుటకు, పార్వతికి, ఈశ్వరుఁడు చెప్పెను.

శ్లో॥ విదితంవిదితంవిదితంవిదితం । విజనంవిజనంవిజనంవిజనం । హరి శాసనతో హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతః॥౧౧౦॥

టీక॥ హరిశాసనతః=విష్ణువుయొక్క ఆజ్ఞవలన, విదితంవిదితం = మిక్కిలి జ్ఞానస్వరూపమైనది. హరిశాసనతః=విష్ణువుయొక్క ఆజ్ఞవలన, విదితంవిదితం=మిక్కిలి జ్ఞానస్వరూపమైనది, హరిశాసనతః = విష్ణువు యొక్క ఆజ్ఞవలన, విజనం = మిక్కిలి జన్మరహితమైనది, హరిశాసనతః=విష్ణువుయొక్క ఆజ్ఞవలన, విజనంవిజనం= మిక్కిలిజన్మరహితమైనది.

తా॥ విష్ణువుయొక్క అజ్ఞవలన సద్గురుస్వరూపము మిక్కిలి విజ్ఞానస్వరూపమైనది, విష్ణువుయొక్క అజ్ఞవలనసద్గురు స్వరూపముమిక్కిలి జన్మరహితమైనది అని ఈశ్వరుఁడు పార్వతికొఅకుస్పష్టముగాచెప్పెను.

శ్లో॥ ఏవంవిధం గురోర్ధ్యానాత్ । జ్ఞానముత్పద్యతేస్వయం ।
తదాగురూపదేశేన । ముక్తోహమితిభావయేత్ ॥ ౧౧౧॥

టీక॥ ఏవంవిధం = ఈ విధముగా, గురోః=గురువుయొక్క, ధ్యానాత్ = ధ్యానించుటవలన, జ్ఞానం = పరమాత్మ జ్ఞానము, స్వయం= స్వకీయముగా, ఉత్పద్యతే = పుట్టుచున్నది, తదా = అప్పుడు=గురూపదేశేన=గురువుయొక్క యుపదేశముచేత, అహం= నేను, ముక్తః = ముక్తుడనైతిని, ఇతి = అని, భావయేత్ = తలంచవలయును.

తా॥ ఈ పూర్వముచెప్పిన విధముగా సద్గురువును ధ్యానించుట వలన పరబ్రహ్మ జ్ఞానము స్వకీయముగానే పుట్టుచున్నది. అప్పుడు గురూపదేశముచేత నేను ముక్తుండనైతినని తలంచవలయును.

శ్లో॥ గురూపదేశితైర్మార్గై । ర్మనశ్శుద్ధింతుకారయేత్ ।
అనిత్యం ఖండయేత్సర్వం । యత్కించిచ్చాత్మగోచరం॥౧౧౨॥

టీక॥ గురూపదేశితైః, గురు = గురువుచేత, ఉపదేశితైః = ఉపదేశింపఁబడిన, మార్గైః = మార్గములచేతను, మనశ్శుద్ధిం, మనః = మనస్సునకు, శుద్ధిం = పరిశుద్ధిని, కారయేత్ = చేయించవలెను, అనిత్యం = అశాశ్వతమును, ఆత్మగోచరం = మనస్సునకుగనబడెడిదియునగు, యత్కించిత్సర్వం = ఈసమస్తమును, ఖండయేత్ =ఖండించవలయును.

తా॥ గురువుచేఁజెప్పంబడిన మార్గములచేత మనస్సు పరిశుద్ధిచేసికొనవలయును, మనోగోచరమగు అనిత్యమైన ఈసమస్తమును ఖండించవలయును.

శ్లో॥ జ్ఞేయంసర్వమతీతంచ । జ్ఞానంచమనఉచ్యతే ।
జ్ఞానంజ్ఞేయంసమంకృత్వా । యథానాన్యద్వితీయకం॥ ౧౧౩॥

టీక॥ అతీతం = అతిక్రమించియుండెడి, జ్ఞేయంచ= తెలిసికొనఁదగినది యును, జ్ఞానంచ = జ్ఞానమును, సర్వం = సమస్తమును, మనః=మన స్సుగా, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది, జ్ఞానం=జ్ఞానమును, జ్ఞేయం=జ్ఞే యమును, సమం = సమానముగా, కృత్వాయథా = చేసినేని, ద్వితీ యకం = రెండవదియగు, అన్యత్ = మరియొకటి, న = లేదు.

తా॥ జ్ఞానమును జ్ఞేయమును రెండును మనస్సుగానే చెప్పంబడు చున్నవి. జ్ఞానజ్ఞేయములుభిన్నములుగాక, యొకటియాయెనేని, రెండవ దియేదియును లేదు.

శ్లో॥ కిమత్రబహునోక్తేన । శాస్త్రకోటి శతైరపి ।
దుర్లభా చిత్తవిశ్రాంతి । ర్వినాగురుకృపాంపరాం ॥ ౧౧౪॥

టీక॥ శాస్త్రకోటి శతైరపి, శాస్త్రకోటి= శాస్త్ర కోటులయొక్క, శతైరపి = నూర్లచేతనున్ను, బహునోక్తేన = విశేషముగాఁ జెప్పుట చేతను. అత్ర = ఇక్కడ, కిం=ఏమిప్రయోజనము, పరాం=శ్రేష్ఠమైన, గురుకృపాంవినా = సద్గురువుయొక్క దయలేక, చిత్తవిశ్రాంతిః=మన స్సునకు విశ్రాంతిని, దుర్లభా = పొందుటకు శక్యముకానిది, (భవతి = అగుచున్నది.)

తా॥ ఇక్కడ అనేక శాస్త్రములయొక్క మాటలతో, నేమియును బ్రయోజనములేదు, శ్రేష్ఠమైన, గురుకృపలేకుండా, మనో విశ్రాంతి కలుగుట దుర్లభము.

శ్లో॥ కరుణాఖడ్గపాతేన । ఛిత్వాపాశాష్టకంశిశోః ।
సమ్యాగానందజనకః । సద్గురుస్సోభిధీయతే ॥ ౧౧౫॥

టీక॥ శిశోః=శిశువుయొక్క, పాశాష్టకం=పాశములయొక్క, యెనిమిదింటిని (దయయును, జుగుప్సయును, మోహమును, భయమును

సంశయమును, కులమును, బలమును, శీలమును, యీ యెనిమిదియే అష్టపాశములనంబడును,) కరుణాఖడ్గపాతేన=దయయనెడికత్తియొక్క దెబ్బచేతను, ఛిత్వా=ఖండించి, సమ్యక్ = బాగా, ఆనందజనకః=సంతోషమును బుట్టించెడివాడు, (యః=ఎవడో,) సః=వాడు, సద్గురుః = మంచిగురువుగా, అభిధీయతే = చెప్పఁబడుచున్నాడు.

తా॥ ఏగురువు శిష్యునియొక్క దయ, జుగుప్స, మోహము మొదలైన అష్టపాశములను దయయనెడి ఖడ్గముయొక్క దెబ్బచేతను ఖండించి ఆనందమునుగలుగఁజేయునో; వాడేసద్గురుడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో॥ ఏవంశ్రుత్వా మహాదేవీ । గురునిందాంకరోతియః ।
సయాతినరకాన్ఘోరాన్ । యావచ్చంద్రదివాకరౌ॥ ౧౧౬॥

టీక॥ హేమహాదేవీ=ఓపార్వతీ, యః = ఎవడు, ఏవం= ఈప్రకారము, శ్రుత్వా=విని, గురునిందాం = గురునిందను, కరోతి = చేయుచున్నాడో; సః=వాడు, యావచ్చంద్రదివాకరౌ = చంద్ర సూర్యులుండేవరకు, ఘోరాన్=భయంకరములైన, నరకాన్=నరకములను, యాతి = పొందుచున్నాడు.

తా॥ ఓ పార్వతీ, యెవడు యీప్రకారము వినియును గురునిందను జేయుచున్నాడో, వాడు చంద్ర సూర్యు లుండేవరకును, భయంకరములైన నరకములను బొందుచున్నాడు.

శ్లో॥ యావత్కల్పాంతకోదేహ । స్తావద్దేవీ గురుంస్మరేత్ ।
గురులోపోనకర్తవ్యః । స్వచ్ఛందోయదివాభవేత్ ॥ ౧౧౭॥

టీక॥ హేదేవి=ఓపార్వతీ, కల్పాంతకః = బ్రహ్మకల్పమే అంతముగాగల, దేహః=శరీరము, యావత్=ఎంతవరకు, (అస్తి=ఉండుచున్నదో) తావత్ = అంతవరకు, గురుం= గురువును, స్మరేత్=స్మరించవలయును, స్వచ్ఛందః=స్వేచ్ఛాప్రవృత్తిగలవాడు, యదివాభవేత్=అయెనేని, గురులోపః=గురువునకులోపము, నకర్తవ్యః = చేయఁగూడదు.

తా॥ ఓపార్వతీ బ్రహ్మసృష్ట్యంతమువరకుండెడి దేహమున్నంతవ ట్టుకు గురువును స్మరించవలయును, స్వేచ్ఛావృత్తిగలవాడైనను, గురు వునకు లోపముచేయగూడదు.

శ్లో॥ హుంకారేణనవక్తవ్యం । ప్రాజ్ఞశిష్యైఃకదాచన ।
గురోరగ్రేనవక్తవ్య । మసత్యంతుకదాచన॥ ౧౧౮॥

టీక ॥ ప్రాజ్ఞశిష్యైః=జ్ఞానముగల శిష్యులచేతను, గురోః = గురు వుయొక్క, అగ్రే = ముందర, హుంకారేణ = హుంకారధ్వనితో, క దాచన=ఎప్పుడును, నవక్తవ్యం = పలుకఁగూడదు, అసత్యంతు = అబ ద్ధమునున్ను కదాచన=ఎప్పుడును, నవక్తవ్యం=పలుకఁగూడదు.

తా ॥ గురువుయెదుట విజ్ఞానముగల శిష్యులు హుంకారముతో నెప్పుడును మాట్లాడఁగూడదు, ఎప్పుడును అబద్ధములాడఁగూడదు.

శ్లో ॥ గురుత్వం కృత్యహుంకృత్య । గురుసాన్నిధ్యభాషణః।
అరణ్యేనిర్జలేదేశే । సభవేద్బ్రహ్మరాక్షసః॥ ౧౧౯॥

టీక ॥ యః= ఎవడు, గురుం=గురువును, త్వంకృత్య = త్వంకరించి (నీవని), హుంకృత్య = హుంకరించి, గురుసాన్నిధ్యభాషణః = గురుస న్నిధియందు పలుకువాడు, (భవతి=అగుచున్నాడో), సః= వాడు, అ రణ్యే = అడవియందు, నిర్జలేదేశే = నీళ్లులేని ప్రదేశమునందు, బ్రహ్మ రాక్షసః=బ్రహ్మరక్షస్సుగా, భవేత్ =అగును,

తా॥ గురువును తిరస్కారభావముతో హుంకరించి, నీవనిపలికెడు వాడు,అరణ్యములోనిర్జలదేశమునందు బ్రహ్మరక్షస్సైపుట్టుచున్నాడు.

శ్లో ॥ గురుంకార్యంనలంఘ్యేత । నాపృష్ట్వాకార్యమాచరేత్ ।
నహ్యుత్తిష్ఠేద్దిశేనత్వా । గురుసద్భావశోభితః॥ ౧౨౦॥

టీక॥ గురు...భితః, గురు=గురువుయొక్క, సద్భావ = మంచియ భిప్రాయముతో, శోభితః = ప్రకాశించెడివాడు, దిశే = గురువుండెడి దిక్కుకొఱకు, నత్వా=నమస్కరించి, గురుకార్యం = గురువుయొక్క

పనిని, నలంఘ్యేత = అతిక్రమించకూడదు, అపృష్ట్వా = గురువును అడుగకుండా, కార్యం=పనిని, నాచరేత్ = చేయఁగూడదు, నహ్యుత్తిష్ఠేత్ = లేవకూడదు,

తా ॥ గురువుయొక్క మంచి యభిప్రాయముతో ప్రకాశించెడివాడు, గురువుండెడి దిక్కుకొఱకు నమస్కరించి, గురువాక్యము నతిక్రమించక యుండవలెను, కార్యమునుగూర్చి గురువును యడుగకుండా చేయకూడదు గుర్వాజ్ఞ లేకుండా తాను లేవనుగూడదు.

శ్లో ॥ నగురోరాశ్రమేకుర్యా । ద్దుష్పానం పరిసర్పణం।

దీక్షావ్యాఖ్యాప్రభుత్వా । గురోరాజ్ఞాంచకారయేత్ ॥ ౧౨౧॥

టీక॥ గురోః=గురువుయొక్క, ఆశ్రమే = ఆశ్రమమందు, దుష్పానం = దుష్టమైన పానమున్ను, (అనగా మద్యము మొదలైనవి త్రాగుట) పరిసర్పణం = స్వేచ్ఛగాదిరుగుటయు, దీక్షా = వ్రతాదినియమములనాచరించుటయు, వ్యాఖ్య = స్వతంత్రించి మాట్లాడుటయు, ప్రభుత్వాది = ప్రభుత్వము మొదలైనవి, నకారయేత్ = చేయగూడదు, గురోః=గురువుయొక్క, ఆజ్ఞాంచ= ఆజ్ఞనున్ను, కారయేత్ = చేయవలెను.

తా ॥ గురువుయొక్క ఆశ్రమమందు శిష్యుఁడు దుష్టపనులైన మద్యపానాదులు చేయుటయును స్వేచ్ఛగా తిరుగుటయును వ్రతాది నియమములు కలిగి యుండుటయును, స్వతంత్రముగా మాట్లాడుటయును, ప్రభుత్వము మొదలైనవాటిని చేయకూడదు గురువుయొక్క ఆజ్ఞప్రకారము నడుచుకోవలెను.

శ్లో॥ నోపాశ్రమంచ పర్యంకం । నచపాదప్రసారణం।

నాంగభోగాదికంకుర్యా । న్నలీలామపరామపి॥ ౧౨౨॥

టీక ॥ ఉపాశ్రమంచ=సద్గురుని యాశ్రమమునకు అశ్వ గజాదులను ఎక్కివచ్చుటయును, పర్యంకం = మంచముమీద పరుండుటయు

న్ను, న=కూడదు, పాదప్రసారణం = పాదములను చాచుకొని పరుండు టయును, నచ = కూడదు, అంగభోగాదికం = అవయవములయొక్క భోగాదికమును = న - కూడదు, అపరామపి = ఇతరమేవిధమైన, లీలాం=వేడుకపనులను, నకుర్యాత్ =చేయకూడదు.

తా॥ గురుసమీపమునకు శిష్యుఁడు అశ్వగజాదులను యెక్కి వచ్చుట యును, మంచము నెక్కుటయును పాదములను జాచి నిద్రించుటయును అవయవములను జూపుటయును జేయకూడదు, ఇంకను ఏవిధమైన వేడుకలను జేయగూడదు.

శ్లో॥ గురూణాంసదసద్వాపి । యదుక్తంతన్నలంఘయేత్ ।
కుర్వన్నాజ్ఞాందివారాత్రౌ । దాసవన్నివసేత్ గురౌ॥ ౧౭౩॥

టీక ॥ గురూణాం=గురువులయొక్క, సత్ = యోగ్యమైనదైనను, అసద్వాపి=అయోగ్యమైనదైనను, యత్ = ఏది, ఉక్తం = పలుకఁబడెనో, తత్=దాన్ని, నలంఘయేత్ = దాటగూడదు, దివారాత్రౌ = రాత్రింబగళ్లు, ఆజ్ఞాం=ఆజ్ఞను, కుర్వన్ = చేయుచు, గురౌ = గురువు విషయమై, దాసవత్ =నవుకరివలెనే, నివసేత్ =ఉండవలెను.

తా ॥ గురువులయొక్క వాక్యము యోగ్యమయినను అయోగ్యమయినదయిననుశిష్యుఁడు అతిక్రమించకూడదు, గురువునాజ్ఞప్రకారము రాత్రింబగళ్లు గురుసన్నిధానమందుభృత్యుడువలెనేయుండవలయును.

శ్లో॥ అదత్తంనగురోర్ద్రవ్య । ముపభుంజీతకర్హిచిత్ ।
దత్తంచరంకవద్గ్రాహ్యం । ప్రాణోప్యేతేనలభ్యతే॥ ౧౭౪॥

టీక॥ అదత్తం=ఇవ్వబడని, గురోః=గురువుయొక్క, ద్రవ్యం = ధనమును, కర్హిచిత్ = ఎప్పుడున్ను, నభుంజీవత = అనుభవించఁగూడదు, దత్తంచ = ఇవ్వబడినద్రవ్యమును, రంకవత్ = దరిద్రుడువలెనే, గ్రాహ్యం= పొందదగినది, ప్రాణోపి = ప్రాణమున్ను, ఏతేన = దీనిచేత, లభ్యతే=పొందఁబడుచున్నది.

తా॥ శిష్యుడు గురువుయొక్క ద్రవ్యమును, ఎప్పుడును అనుభవించకూడదు సద్గురునిచే నివ్వబడిన ద్రవ్యమును దరిద్రుడువలెనే అత్యాదరణగలవాఁడై గ్రహించవలయును దీనిచే ప్రాణమున్ను పొంద బడుచున్నది.

శ్లో॥ పాదుకాసనశయ్యాది । గురుణాయదభీప్సితం ।
నమస్కుర్వీతతత్సర్వం।పాదాభ్యాంనస్పృశేత్ క్వచిత్ ॥౧౨౫॥

టీక॥ గురుణా=గురువుచేతను, పాదుక=పావుకోళ్లును, ఆసన=సింహాసనమును, శయ్యా=పడకయును, ఆది = మొదలుగాఁగలిగిన, యత్ =ఏది, అభీప్సితం=అనుభవింపఁబడునో, తత్సర్వం= ఆసమస్తమునకును, నమస్కుర్వీత=నమస్కరింపవలయును, పాదాభ్యామ్ =పాదములతో, క్వచిత్ =ఎప్పుడున్ను, నస్పృశేత్ =తాకకూడదు.

తా॥ శిష్యుఁడుగురువుచేత అనుభవింపఁబడిన పాదుకాసన శయ్యలు మొదలయిన సమస్తమునకు నమస్కరించవలయును వాటికి పాదములు తగులునటులఁజేయకూడదు.

శ్లో॥ గచ్ఛతఃపృష్ఠతోగచ్ఛేత్ । గురుచ్ఛాయాంనలంఘయేత్ ।
నోల్బణంధారయేద్వేషం। నాలంకారాంస్తథోల్బణాన్॥౧౨౬॥

టీక॥ గచ్ఛతః=గురువునడిచిపోవుచుండగా, పృష్ఠతః = వెనుకనుండి, గచ్ఛేత్ =పోవలయును, గురుచ్ఛాయాం = గురువుయొక్కనీడను, నలంఘయెత్ =దాటకూడదు, ఉల్బణం = అధికమైన, వేషం = అలంకారమును, నధారయేత్ = ధరించఁగూడదు, తథా = ఆప్రకారముగానే, ఉల్బణాన్=అధికములైన, అలంకారాన్ = భూషణములను, నధారయేత్ = ధరించఁగూడదు.

తా॥ శిష్యుఁడు, గురువుపోవుచుండగా వెనుకనే పోవలయును గురువుయొక్క నీడను అతిక్రమించి పోకూడదు అధికమయిన వస్త్రాదులనున్ను నగలనున్ను ధరించఁగూడదు.

శ్లో॥ గురునిందాకరంధృష్ట్వా । ధావయేదథవాసయేత్ ।
స్థానంవాతత్పరిత్యాజ్యం । జిహ్వాచ్ఛేదఃక్షమోయది ॥౧౭౭॥

టీక॥ గురునిందాకరం=గురునిందను జేయువానిని, దృష్ట్వా = చూచి, ధావయేత్=పరుగెత్తిపోవలయును, అథవాసయేత్ = వెళ్లగొట్టవలయును, తత్=ఆ, స్థానంవా = చోటునయినను, పరిత్యాజ్యం= విడువవలయును, క్షమోయది = సమర్థుడాయెనేని, జిహ్వాచ్ఛేదః=నాలుకను ఖండించుటయును, (కర్తవ్యతః=చేయదగినది.)

తా॥ శిష్యుఁడు గురునింద చేయువానిని చూచి పరుగెత్తి పోవలయును లేకపోతే వానిని వెళ్లగొట్టవలయును, లేక అస్థానము నయిన తానువిడిచి పెట్టవలయును, సమర్థుడాయెనేనివాని యొక్క నాలుకను ఖండించవలయును.

శ్లో॥ నోచ్ఛిష్టంకస్యచిద్దేయం । గురోరాజ్ఞాంనచత్యజేత్ ।
కృత్స్నముచ్ఛిష్టమాదాయ । నిత్యమేవవ్రజేద్బహిః॥ ౧౭౮॥

టీక॥ గురోః-గురువు యొక్క,ఉచ్ఛిష్టం=ఎంగిలిని, కస్యచిత్ =ఎవనికిని, నదేయం-ఇవ్వగూడదు, ఆజ్ఞాంచ=ఆజ్ఞనున్ను, నత్యజేత్ = విడువగూడదు, కృత్స్నం = సమస్తమయిన, ఉచ్ఛిష్టం=ఎంగిలిని, నిత్యం= ఎల్లప్పుడును, ఆదాయ-తీసుకొని, బహిరేవ = వెలుపటికే, వ్రజేత్ = పోవలయును.

తా॥ శిష్యుఁడు గురువు యొక్క ఉచ్ఛిష్టమును ఎవరికి నివ్వగూడదు, గురువు యొక్క ఆజ్ఞనున్ను విడువగూడదు, సమస్తమయిన ఉచ్ఛిష్టమును యెల్లప్పుడును గ్రహించి బైటికే వెళ్లిపోవలయును.

శ్లో॥ నానృతం నాప్రియంచైవ । నగర్వాన్ నాపివాబహు ।
ననియోగపరంబ్రూయా । ద్గురోరాజ్ఞాం విభావయేత్ ॥౧౭౯॥

టీక॥ అనృతం=అబద్ధము, నబ్రూయాత్ =పలుకఁగూడదు, అప్రియంచైవ=అప్రియమునున్ను,నబ్రూయాత్ =చెప్పఁగూడదు, గర్వాన్ =

అహంకారములనున్ను, నబ్రూయాత్ =పలుకఁగూడదు, ఆపిహాబహు= ఇంకాఅధికముగానున్ను,నబ్రూయాత్ =పలుకఁగూడదు, నియోగపరం =ఆజ్ఞతోఁగూడినమాటను, నబ్రూయాత్ =పలుకఁగూడదు, గురోః=గురువుయొక్క, ఆజ్ఞాం=ఆజ్ఞను, విభావయేత్ =మిక్కిలితలంచవలయును.

తా॥ అబద్ధమును, అయిష్టమును, గర్వపుమాటలను, అధికముగ పలుకుటయును, ఆజ్ఞారూపమయినమాటను శిష్యుఁడుగురుసన్నిధానమందు చెప్పఁగూడదు, యెల్లప్పుడును గురువుయొక్క ఆజ్ఞనేమనస్సునందు భావించవలయును.

శ్లో॥ ప్రభో దేవ కులేశాన । స్వామిన్ రాజన్ కులేశ్వర ।
ఇతిసంబోధనైర్భీతో । గురుభావేనసర్వదా ॥ ౧౩౦॥

టీక॥ సర్వదా=ఎల్లప్పుడును, గురుభావేన=గురు ధ్యానముచేతను, భీతః=భయమును బొందినవాఁడై, ప్రభో=ఓ స్వామీ, దేవకులేశాన= దేవతా సమూహములకు ప్రభువా, స్వామిన్=ఓరాజా, రాజన్=ఓ ప్రభువా, కులేశ్వర=వంశప్రభువా, ఇతి=ఇట్లని, సంబోధనైః=సంబోధనములచేత, (వదేత్ =పలుకవలయును.)

తా ॥ శిష్యుఁడు గురువునుగూర్చియెల్లప్పుడును గురు ధ్యానముతో కూడుకొన్నవాఁడై ప్రభో దేవకులేశాన అనునట్టి యీమొదలైన సంబోధనములతో పలుకవలయును.

శ్లో॥ మునిభిఃపన్నగైర్వాపి । సురైర్వాశాపితోయది ।
కాలమృత్యుభయాద్వాపి । గురుస్సంత్రాతిపార్వతి ॥ ౧౩౧॥

టీక॥ ఓపార్వతి, గురుః=గురువు,మునిభిః=ఋషులచేతనైనను,పన్నగైర్వాపి=పన్నగులచేతనైనను, సురైర్వా=దేవతల చేతనైనను, శాపితోయది=శపించుటవల్లనైనను, కాలమృత్యు భయాద్వాపి, కాలమృత్యు=కాల మరణముయొక్క, భయాద్వాపి = భయమువలనైనను, సంత్రాతి=రక్షించుచున్నాఁడు.

తా॥ ఓ పార్వతీ గురుడు దేవతలుఋషులు మొదలైనవారియొక్క శాప భయమునుండిన్ని, సకాలమందైన మృత్యు భయమునుండిన్ని, శిష్యుని రక్షించుచున్నాడు.

శ్లో॥ అశక్తాహి సురాద్యాశ్చ । అశక్తామునయస్తథా ।
గురుశాపప్రపన్నస్య । రక్షణాయచకుత్రచిత్ ॥ ౧౩౨॥

టీక॥ కుత్రచిత్=ఎక్కడనున్ను, గురుశాపప్రపన్నస్య, గురుశాప = గురువుయొక్క శాపమును, ప్రపన్నస్య=పొందినవానియొక్క, రక్షణాయచ=రక్షించుటకొఱకు, సురాద్యాశ్చ = దేవతలుమొదలైన వారును, అశక్తాహి=అసమర్థులుగదా,తథా=ఆప్రకారముగానే, మునయః=ఋషులును, అశక్తాః=అసమర్థులు, (భవన్తి=అగుచున్నారు.)

తా॥ దేవతలు మొదలైనవారును ఋషులును ఎవరును ఎప్పుడును గురుశాపమును పొందినవానిని రక్షించుటకు సమర్థులుకారు.

శ్లో॥ మంత్రరాజమిదందేవీ । గురురిత్యక్షరద్వయం ।
స్మృతివేదార్థవాక్యానాం । గురుస్సాక్షాత్పరంపదం ॥ ౧౩౩॥

టీక॥ హే దేవీ=ఓ పార్వతీ, ఇదం=ఈ, గురురితి, గురు అనెడి, అక్షరద్వయం=రెండక్షరములును,మంత్రరాజం=మంత్రశ్రేష్ఠము, స్మృతివేదార్థవాక్యానాం,స్మృతి=ధర్మశాస్త్రముయొక్కయు,వేద=వేదములయొక్కయు, అర్థ=తాత్పర్యమును జెప్పెడి, వాక్యానాం =వాక్యములను, గురుః=ఉపదేశించెడివాడు, సాక్షాత్ = ప్రత్యక్షముగా, పరం పదం=పరమపదము.

తా ॥ ఓ పార్వతీ గురు అనెడి వర్ణములయొక్క జంటయేమంత్రరాజము. స్మృతివేదార్థముల వాక్యముల నుపదేశించెడి గురువే పరమపదమని చెప్పంబడు చున్నాడు.

శ్లో॥ సత్కారమాన పూజార్థం । దండకాషాయధారణః ।
ససన్యాసీనవక్తవ్యః । సన్యాసీజ్ఞానతత్పరః ॥ ౧౩౪॥

టీక॥ సత్కార...జార్థం, సత్కార=సన్మానముకొఱకును, మాన=మర్యాదకొఱకును,పూజార్థం=పూజకొఱకును, దండకాషాయధారణః, దండ=దండమును,కాషాయ=కావివస్త్రమును,ధారణః=ధరించువాఁడు, (యః=ఎవఁడో)సః=వాఁడు, సన్యాసీ=సన్యాసియని, నవక్తవ్యః = చెప్పఁగూడదు, సన్యాసీ=సన్యాసి, జ్ఞానతత్పరః=జ్ఞానమందాసక్తిగలవాఁడు (భవతి=అగుచున్నాడు.)

తా॥ సత్కారమానపూజలకొఱకు దండకాషాయములను ధరించువాఁడు సన్యాసియని చెప్పఁగూడదు జ్ఞానమునందా సక్తిగలవాఁడేసన్న్యాసియగును.

శ్లో॥ విజానంతి మహావాక్యం । గురోశ్చరణసేవయా ।
తేవైసన్యాసినఃప్రోక్తాః । ఇతరేవేషధారిణః ॥ ౧౩౫॥

టీక॥ (యే=ఎవరు,)గురోః=గురువుయొక్క, చరణసేవయా=పాదసేవచేతను, మహావాక్యం=మహావాక్యమును, విజానంతి = తెలుసుకొనుచున్నారో, (తేవై = వారే, సన్యాసినః = సన్యాసులని, ప్రోక్తాః = చెప్పఁబడిరి. ఇతరే = అన్యులు = వేషధారిణః = వేషమునుధరించియుండువారని చెప్పఁబడుచున్నారు.

తా॥ ఎవరు గురువుయొక్క పాదసేవచేతను మహావాక్యమును దెలుసుకొనుచున్నారో, వారేసన్న్యాసులని చెప్పఁబడుచున్నారు;ఇతరులు వేషధారులేకాని సన్యాసులుకారు.

శ్లో॥ నిత్యంబ్రహ్మ నిరాకారం । నిర్గుణంబోధయేత్పరం ।
భాసయన్ బ్రహ్మభావంచ । దీపోద్దీపాంతరంయథా॥ ౧౩౬॥

టీక॥ (గురుః=గురువు,)దీపః=దీపమంచు, దీపాంతరంయథా=వేరొకదీపమును వలెనే, బ్రహ్మభావం=బ్రహ్మస్వరూపమును, భాసయన్ = ప్రకాశింపఁజేయుచు, నిత్యం=శాశ్వతమును, నిరాకారం = ఆకారములేనిదియును, నిర్గుణం=సత్వాదిగుణములు లేనిదియును, పరం = శ్రేష్ఠమునగు, బ్రహ్మ=పరిపూర్ణబ్రహ్మమును, బోధయేత్ = బోధించవలెను.

తా॥ గురువు పరబ్రహ్మధ్యానమును, ఒకదీపమునందు వేరొకదీపమును ప్రకాశింపఁజేయుచు, శాశ్వతమును, నిరాకారమును, నిర్గుణమును నగు, అచలబ్రహ్మమును బోధచేయవలెను.

శ్లో॥ గురోప్రసాదతః స్వాత్మ౯ । స్వాత్మారామనిరీక్షణాత్ ।
సమత్వంముక్తిమార్గేణ । స్వాత్మజ్ఞానం ప్రవర్తతే॥ ౧౩౭॥

టీక ॥ గురోప్రసాదతః=గురువు యొక్క అనుగ్రహమువలన, స్వాత్మని=తనయందు, స్వాత్మారామ=పరమాత్మస్వరూపము యొక్క, నిరీక్షణాత్ =చూచుటవలన, సమత్వం=సమభాగమును, ముక్తిమార్గేణ= ముక్తిమార్గముచేత, స్వాత్మజ్ఞానం = పరమాత్మజ్ఞానమున్ను, ప్రవర్తతే= కలుగుచున్నది.

తా ॥ గురుని అనుగ్రహమువలన,తనయందు పరమాత్మనుజూచుటయును, సమభావమును, ముక్తిమార్గమును, ఆత్మజ్ఞానమును గలుగుచున్నది.

శ్లో॥ ఆబ్రహ్మస్తంభపర్యతం । పరమాత్మస్వరూపకం ।
స్థావరంజంగమంచైవ । ప్రణమామిజగన్మయం॥ ౧౩౮॥

టీక ॥ ఆబ్రహ్మస్తంభపర్యంతం=బ్రహ్మ మొదలుకొని గడ్డిపోరకపర్యంతముండెడి, జగన్మయం=జగత్స్వరూపమయిన, స్థావరజంగమంచైవ = చేతనాచేతనాత్మకమగు, పరమాత్మస్వరూపకం= పరమాత్మ యొక్క స్వరూపమునుగూర్చి, ప్రణమామి=నమస్కరించుచున్నాను.

తా॥ బ్రహ్మ మొదలుకొని తృణపర్యంతముండెడి స్థావరజంగమాత్మకమును, జగదాత్మకమునునగు పరమాత్మస్వరూపమునుగూర్చి నమస్కరించుచున్నాను,

శ్లో । వన్దేహం సచ్చిదానందం । భావాతీత జగద్గురుం ।
నిత్యపూర్ణ నిరాకారం । నిర్గుణంస్వాత్మసమస్థితం॥ ౧౩౯॥

టీక ॥ అహం=నేను, సచ్చిదానందం=సచ్చిదానందస్వరూపుఁడును, భావాతీతం=తలంపునకు అతిక్రమించినవాఁడును, నిత్యపూర్ణం = ఎల్ల

ప్పుడు పరిపూర్ణుఁడును, నిరాకారం=ఆకారములేనివాఁడును, నిర్గుణం=గుణరహితుఁడును (సత్వరజస్తమోగుణములు లేనివాఁడును) స్వాత్మసమస్థితం=తనయొక్క ఆత్మయందుండెడి, జగద్గురుం=జగన్మూర్తియైన పరమాత్మనుగూర్చి, వందే=నమస్కరించుచున్నాను.

తా॥నిత్యపూర్ణుఁడును, నిరాకారుఁడును, నిర్గుణుఁడును,సచ్చిదానందస్వరూపుఁడును, భావాతీతుఁడునగు, ఆత్మయందుండెడి జగద్గురుస్వరూపుఁడైన పరమాత్మనుగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ పరాత్పరతరంధ్యాయేత్ । నిత్యమానందకారకం।
హృదయాకాశమధ్యస్థం । శుద్ధస్ఫటికసన్నిభం॥ ౧౪౦॥

టీక॥ నిత్యం=శాశ్వతుఁడును, ఆనందకారకం=ఆనందమును గలుగజేయువాఁడును, హృదయాకాశమధ్యస్థం= హృదయమునందలిచిదాకాశముయొక్క మధ్యమునందుండువాఁడును, శుద్ధస్ఫటికసన్నిభం= నిర్మలమగు స్ఫటికముతో సమానుఁడునగు, పరాత్పరం= పరమాత్మస్వరూపమును, ధ్యాయేత్ =ధ్యానించవలయును.

తా॥ నిత్యుఁడును, ఆనందమునుగలుగజేయువాఁడును, హృదయమునందలి చిదాకాశమునందుండువాఁడును, నిర్మలమగు స్ఫటికముతో సమానుఁడును, పరాత్పరుఁడునునగు పరమాత్మనుధ్యానించవలయును.

శ్లో॥ స్ఫటికేస్ఫాటికంరూపం । దర్పణేదర్పణోయథా ।
తథాత్మని చిదాకారం । మానందస్సోహమిత్యుత॥ ౧౪౧॥

టీక॥ స్ఫటికే=స్ఫటికమణియందు, స్ఫాటికం=స్ఫటికమణిసంబంధమైన, రూపం=స్వరూపమును, దర్పణే=అద్దమునందు, దర్పణః=అద్దమును, యథా=ఏప్రకారమో, తథా=ఆప్రకారమే, ఆత్మని=ఆత్మస్వరూపమునందు, చిదాకారం=జ్ఞానాకృతియును, (ఆస్తే=ఉంచున్నది), ఉత=మరిన్ని, అహం=నేను, సః=ఆ, ఆనందః=ఆనందస్వరూపము, (భవామి=అగుచున్నాను.

తా॥ ఓపార్వతీ స్ఫటికమణియందు స్ఫటికమణియొక్క స్వరూపము, ఏప్రకారముండునో; అదేప్రకారము ఆత్మస్వరూపమునందు ప్రకాశముంచున్నది-అట్టిఆత్మప్రకాశములయానందమే, నేనగుచున్నాను.

శ్లో॥ రూపాతీతంహిపురుషం । ధ్యాయేచ్చచిన్మయంహృది ।
తత్రస్ఫురతియోభావః । శృణుతత్కథయామితే ॥ ౧౭౭॥

టీక॥ రూపాతీతం=స్వరూపమునతిక్రమించియున్న, చిన్మయం=బ్రహ్మస్వరూపమైన, పురుషంహి=పురుషస్వరూపునే, హృది=హృదయమునందు, ధ్యాయేచ్చ=ధ్యానించవలయును, యః=ఏ, భావః=వస్తువు, తత్ర=ఆ హృదయమునందు, స్ఫురతి = ప్రకాశించుచున్నదో; తత్ = దానిని, తే=నీకు, కథయామి=చెప్పుచున్నాను, శృణు=వినుము.

తా॥ ఓ పార్వతీ హృదయమునందు ఆకారములేని పరబ్రహ్మస్వరూపుండగు పురుషుని ధ్యానించవలయును, ఆ హృదయమునందలి ప్రకాశించెడిపరమాత్మవస్తువెద్దియో, దానిని నీకు చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ అజోహమమరోహంచ । అనాదినిధనోహ్యహం ।
అవికారశ్చిదానందో । హ్యణీయాన్మహతోమహాన్॥ ౧౭౮॥

టీక॥ అహం=నేను, అజః=పుట్టుకలేనివాడను; అహం=నేను, అమరశ్చ=మరణములేనివాడను; అహం=నేను, అనాదినిధనోహి=ఆద్యంతములు లేనివాడను, అవికారః=వికారము లేనివాడను, చిదానందోహి=చిదానందస్వరూపుడను, అణీయాన్=మిక్కిలి సూక్ష్మ స్వరూపుడను,మహతః=గొప్పవస్తువుకంటెను,మహాన్=గొప్పవాడను; (భావిమి అగుచున్నాడను.)

శ్లో॥ అపూర్వమపరంనిత్యం । స్వయంజ్యోతిర్నిరామయం ।
విరజంపరమాకాశం । ధ్రువమానందమవ్యయం ॥ ౧౭౯॥

టీక॥ అపూర్వం=ముందులేనిదియును, అపరం=వెనుక లేనిదియును, నిత్యం=శాశ్వతమును, స్వయంజ్యోతిః=స్వప్రకాశమును, నిరామయం

=వ్యాధిలేనిదియును, విరజం = పాపములేనిదియును, పరమాకాశం = శ్రేష్ఠమైనచిదాకాశమును,ధ్రువం=నిత్యస్వరూపమును, ఆనందం=ఆనంద రూపమును, అవ్యయం = నాశనములేనిదియును.

శ్లో॥ అగోచరంతథాగమ్యం.। నామరూపవివర్జితం ।

నిశ్శబ్దంతువిజానీయాత్ । స్స్వభావాద్బ్రహ్మపార్వతీ ॥ ౧౪౫॥

టీక॥ అగోచరం = కనుబడనిదియును, తథా = ఆప్రకారముగానే, అగమ్యం=పొందదగనిదియును, నామరూపవివర్జితం = నామరూపములు లేని, నిశ్శబ్దంతు=శబ్దరహితమునగు, బ్రహ్మ=పరిపూర్ణబ్రహ్మమును, హే పార్వతీ=ఓ పార్వతీ, స్వభావాత్ =స్వభావమువలన, విజానీయాత్ = తెలుసు కొనవలయును.

తా॥ నేను జననమరణములులేనివాఁడను, ఆద్యంతములు లేనివాఁడను,వికారములేనివాడఁను,చిదానందస్వరూపుఁడను,అణుస్వరూపుఁడను, మహత్స్వరూపుఁడనైయున్నాను. ఓ పార్వతీ! పరిపూర్ణబ్రహ్మముపూర్వాపరములులేనివాఁడు, శాశ్వతుఁడు,స్వయంప్రకాశమానుఁడు,నిరామయుఁడు, పాపపుణ్యములులేనివాఁడు; శ్రేష్ఠమగు చిదాకాశ స్వరూపుఁడు,నిత్యుఁడు,ఆనందాతీతుడు,నాశనములేనివాడు,దృశ్యాదృశ్యములు కానివాఁడు, నామరూపములులేనివాఁడు, సదా శబ్దరహితమైనవాడని తెలుసుకొనుము.

శ్లో॥ యథాగంధస్వభావత్వం । కర్పూరకుసుమాదిషు ।

శీతోష్ణత్వస్వభావత్వం । తథాబ్రహ్మణిశాశ్వతం ॥ ౧౪౬॥

టీక॥ కర్పూరకుసుమాదిషు=కర్పూరము, పుష్పములు మొదలైనవానియందు, గంధస్వభావత్వం=పరిమళస్వభావతయును, శీతోష్ణత్వస్వభావత్వం=శీతోష్ణములయొక్క స్వభావముగలుగుటయును, యథా=ఏప్రకారమో, తథా=ఆప్రకారము, బ్రహ్మణి=పరబ్రహ్మమునందు, శాశ్వతం=నిత్యత్వము, (భవతి=అగుచున్నది.)

తా ॥ కర్పూరము కుసుమములు మొదలైనవాటియందు పరిమళస్వభావమును, శీతోష్ణత్వస్వభావతయును, ఏప్రకారమో-ఆప్రకారముగానే పరబ్రహ్మమునందు నిత్యత్వము గలిగియున్నది.

శ్లో ॥ యథానిజస్వభావేన । కుండలేకటకాదయః ।
సువర్ణత్వేనతిష్ఠన్తి । తథాహంబ్రహ్మశాశ్వతం ॥　　౧౪౭॥

టీక ॥ కుండలే = కర్ణభూషణములును, కటకాదయః=కంకణములు మొదలైనవియును, నిజస్వభావేన=తమస్వభావముచేత, సువర్ణత్వేన=బంగారముగానే, యథా=ఏప్రకారము, తిష్ఠన్తి=ఉంచున్నవో, తథా=ఆప్రకారము, అహం=నేను, శాశ్వతం=నిత్యమగు, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపము, (అస్మి=అగుచున్నాను.)

తా ॥ కర్ణభూషణములును, కంకణములు మొదలైనవియును, నిజమైన స్వభావముచేత నెట్లు బంగారముగానే యుంటున్నవో, ఆప్రకారముగానే నేను శాశ్వతమైన పరబ్రహ్మస్వరూపమగుచున్నాను.

శ్లో ॥ స్వయంతథావిధోభూత్వా । స్థాతవ్యంయత్రకుత్రచిత్ ।
కీటోభృంగఇవధ్యానా । ద్యథాభవతితాదృశః ॥　　౧౪౮॥

టీక ॥ కీటః=పురుగు, ధ్యానాత్=ధ్యానమువలన, భృంగఇవ = తుమ్మెదవలెనే, యథా=ఏప్రకారము, భవతి=అగుచున్నదో, తాదృశః=అదేప్రకారము, స్వయం=తాను, తథావిధః=ఆవిధమైనవాడుగా, భూత్వా=అయి, యత్రకుత్రచిత్ = ఏఏప్రదేశములయందైనను, స్థాతవ్యం=ఉండదగియున్నాడు.

తా॥ఈపూర్వముచెప్పిన ప్రకారము బ్రహ్మస్వరూపమైనవాడు, కీటకము ధ్యానమువలన తుమ్మెదమైనవిధముగా తానును ఆవిధమై యెక్కడనైనను అనగా అన్నిచోట్లను ఉండదగినవాడు.

శ్లో॥ గురుధ్యానాత్తథాస్వాంతే । స్వయంబ్రహ్మమయోభవేత్ ।
పిండేపదేతథారూపే । ముక్తోసౌనాత్రసంశయః ॥　　౧౪౯॥

టీక॥ అసౌ=ఈజనుడు, స్వాంతే=హృదయమునందు, గురుధ్యానాత్ =గురువునుధ్యానించుటవలన, స్వయం=తాను, తథా = ఆప్రకారము,బ్రహ్మమయః=బ్రహ్మస్వరూపుడును,పిండే=పిండమునందును,పదే=పదమునందును, తథా = ఆప్రకారము, రూపే = రూపమునందును, ముక్తః=ముక్తుడు, భవేత్ =అగును, అత్ర=ఈవిషయమై, సంశయః = సందేహము, న=లేదు.

తా॥ ఈజనుడు హృదయమునందు గురుస్వరూపధ్యానమువలన తానును బ్రహ్మస్వరూపియై పిండమునందును పదమునందును రూపమునందును ముక్తుడగును దీనికి సంశయములేదు.

పార్వత్యువాచ ॥ పార్వతీ=పార్వతీదేవి, ఉవాచ = పలికెను.

శ్లో॥ పిండంకింతుమహాదేవ । పదంకింసముదాహృతం ।
రూపాతీతంచరూపంకిం । ఏతదాఖ్యాహిశంకర ॥ ౧౫౦॥

టీక॥ హేమహాదేవ=ఓ ఈశ్వరుడా, సముదాహృతం=చెప్పఁబడిన పిండంతు=పిండమన్ననది, కిం=ఏది, పదం=పదమనునది, కిం=ఏది, రూపాతీతంచ=ఆకారమునతిక్రమించియున్న, రూపం=ఆకారము, కిం=ఏది, హేశంకర=ఓఈశ్వరుడా,ఏతత్ =ఇవన్నియును,ఆఖ్యాహి=చెప్పుము.

తా॥ ఓ ఈశ్వరుడా! ఇదివరకు చెప్పియుండెడి పిండమును, పదమును, రూపాతీతమైనరూపమును ఏది ఇవియన్నియు నాకుంజెప్పుమా యని పార్వతి యడిగెను.

శ్రీమహాదేవఉవాచ ॥ శ్రీమహాదేవః = ప్రకాశమానుండగు ఈశ్వరుఁడు, ఉవాచ=పలికెను.

శ్లో॥ పిండంకుండలినీశక్తిః । పదంహంసముదాహృతం ।
రూపంబిందురితిజ్ఞేయం । రూపాతీతంనిరంజనం॥ ౧౫౧॥

టీక ॥ పిండం=పిండమనునది, కుండలినీశక్తిః=కుండలియనెడి శక్తిగాను, (కుండలినీశక్తియనగా ఉరగాంగనాకృతిగా అధోకుండలియైన

మూలాధారమందు శిరస్సును, ఊర్ధ్వకుండలినిన్నైన భ్రూమధ్యమందు పుచ్ఛమును, అజపకుండలియందు సంచారమును గలిగియుండును, ఇది విజ్ఞానదశయందు ఊర్ధ్వ కుండలియందు శిరస్సును, అధోకుండలియందు పుచ్ఛమును గలదిన్నైయుండును, ఇది సుషుమ్నానాళ మధ్యభాగమునందు తామరతూడులోని నూలువలె అతిసూక్ష్మమయి ఉన్నది) పదం=పదమును, హంసం=హంసగాను, అనగా(ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమయిన వాయువునే హంసయని) ఉదాహృతం = చెప్పబడినది, రూపం=రూపమును, బిందురితి=బిందువని (బిందువనగా స్థూలశరీరము యొక్కయు, ప్రాణవాయువు యొక్కయు, చంచలాత్మకమయిన మనస్సు యొక్క కొనయందుండెడి నిశ్చలాత్మకమయిన ప్రజ్ఞ, అనగా విజ్ఞానమయకోశము) జ్ఞేయం=తెలుసుకొనదగినది, రూపాతీతం =నాదబిందుకళల నతిక్రమించినది, నిరంజనం=నిర్దోషమగు పరిపూర్ణము.

తా ॥ ఓపార్వతీపిండమనగా కుండలినీశక్తిగాను, పదమనగా ఉచ్ఛ్వాస నిశ్వాసరూపమైన హంసస్వరూపముగాను, రూపమనగా అన్నిటిని తెలుసుకొనదగిన ద్రష్టయగు యెఱుకగాను, రూపాతీతమే యచల పరిపూర్ణబ్రహ్మముగాను, ఈశ్వరుఁడు పలికెను.

శ్లో ॥ పిండేముక్తాఃపదేముక్తా । రూపేముక్తావరాననే ।
రూపాతీతేచయేముక్తా । స్తేముక్తానాత్రసంశయః ॥ ౧౫౨॥

టీక॥ వరాననే=శ్రేష్ఠమయిన ముఖముగల ఓపార్వతీ, పిండే=కుండలినీశక్తియందు, ముక్తాః=ముక్తులయినవారును, పదే=హంసస్వరూపమునందు, ముక్తాః=ముక్తులయినవారును, రూపే=బిందుస్వరూపమందు (అనగా విజ్ఞానమయకోశమందు)ముక్తాః=ముక్తులును, రూపాతీతేచ=కళాతీతమైన పరిపూర్ణమందును, ముక్తాః=ముక్తులు, యే=ఎవరో, తే=వారు, ముక్తాః=ముక్తులు, (భవంతి=అగుచున్నారు,) అత్ర=ఈవిషయమునందు, నసంశయః=సందేహములేదు.

తా ॥ కుండలినీశక్తియందును, హంసస్వరూపమునందును, ఆపో జ్యోతి స్వరూపదర్శనము నందును, కళాతీతమైన పరిపూర్ణ మందును ముక్తులగువారెవరోవారేముక్తులు, ఈవిషయమందు సందేహము లేదు.

శ్లో ॥ గురోర్ధ్యానే నైతినిత్యం । దేహీబ్రహ్మమయోభవేత్ ।
స్థితశ్చయత్రకుత్రాపి । ముక్తోసౌ నాత్రసంశయః ॥ ౧౫౩॥

టీక॥ అసౌ=ఈ, దేహీ=ఆత్ముడు,నిత్యం=ఎల్లప్పుడును, యత్రకుత్ర= ఎక్కడెక్కడ, స్థితశ్చాపి=ఉన్నవాఁడైనను, గురోః= గురువుయొక్క, ధ్యానేనైతి=ధ్యానముచేతనే, బ్రహ్మమయః=బ్రహ్మస్వరూపుఁడై, ముక్తః=ముక్తుఁడు, భవేత్ =అగును. అత్ర=ఈవిషయమునందు, నసంశయః=సందేహము లేదు.

తా ॥ ఆత్ముఁడు ఎక్కడెక్కడ యుండినను, ఎల్లప్పుడు సద్గురుస్వరూపధ్యానముచేతనే,బ్రహ్మస్వరూపియైముక్తుడగును, సందేహము లేదు.

శ్లో ॥ జ్ఞానంవైరాగ్యమైశ్వర్యం । యశశ్శ్రీస్వముదాహృతం ।
షడ్గుణైశ్వర్యయుక్తశ్చ । భగవాన్ శ్రీగురుఃప్రియే ॥ ౧౫౪॥

టీక॥ జ్ఞానం=పరబ్రహ్మజ్ఞానమును, వైరాగ్యం = ఐహికాముష్మిక సుఖములయందు విరక్తికలిగియుండుటయును, (ఇహలోక పరలోకముల యందలి సుఖమునందాశ లేకయుండుట,) ఐశ్వర్యం=ఈశ్వరభావమును, యశః=కీర్తియును, శ్రీః=సంపదయును, ఉదాహృతం = చెప్పఁబడిన, స్వం=ఆత్మస్వరూపమును, (వీనితోఁగూడుకొనుటవలన,) హేప్రియే = ఓ పార్వతీ, శ్రీగురుః=ప్రకాశమానుఁడగు సద్గురుడు, షడ్గుణైశ్వర్యయుక్తః = షడ్గుణములతోఁగూడుకొనిన, భగవాంశ్చ = భగవంతుఁడుగా, (భవతి=అగుచున్నాడు.)

తా ॥ ఓపార్వతీ! సద్గురువు, జ్ఞానమును వైరాగ్యమును ఐశ్వర్యమును యశస్సును సంపదయును ఆత్మయునువీనితోఁగూడుకొనుట వలన షడ్గుణైశ్వర్యయుక్తుండగు భగవంతుఁడగు చున్నాడు.

శ్లో॥ గురుశ్శివో గురుర్దేవో । గురుర్బంధుశ్శరీరిణాం ।
గురురాత్మాగురుర్జీవో । గురోరన్యంనవిద్యతే॥ ౧౫౫॥

టీక॥ గురుః=గురువు, శివః=ఈశ్వరుడు, గురుః=గురువు, దేవః=దేవుడు, గురుః=గురువు, శరీరిణాం=దేహయాత్మలకు, బంధుః=బంధువు, గురుః=గురువు, ఆత్మా=ఆత్మస్వరూపుడు, గురుః=గురువు, జీవః=జీవుడు, గురోః=గురువుకంటెను, అన్యం=ఇతరమైనది, నవిద్యతే=లేదు.

తా॥ గురువే ఈశ్వరుడు గురువే దేవుడు గురువే దేహయాత్మలకు బంధువు, గురువే ఆత్మ, గురువే జీవుడు, గురువుకంటె నన్యమైన దేదియును లేదు.

శ్లో॥ ఏకాకీనిస్పృహశ్శాంత । శ్చింతాసూయావివర్జితః ।
బాల్యభావేనయోభాతి । బ్రహ్మజ్ఞానీస ఉచ్యతే ॥ ౧౫౬॥

టీక॥ యః=ఎవడు, ఏకాకీ=ఒకఁడుగానుండువాఁడును, నిస్పృహః=ఇచ్ఛలేనివాఁడును, శాంతః=శమముగలవాఁడును, చింతాసూయా వివర్జితః= చింతా = వ్యసనమును, అసూయా=ఈర్ష్యయును, (వీనిని) వివర్జితః=విడిచినవాఁడునై, బాల్యభావేన=బాలభావముతో, (మౌనముతో,) భాతి=ప్రకాశించుచున్నాఁడో; సః=వాఁడు, బ్రహ్మజ్ఞానీ=పరబ్రహ్మమును దెలిసినవాఁడని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

శ్లో॥ నసుఖంవేదశాస్త్రేషు । నసుఖంమంత్రయంత్రకే ।
గురోఃప్రసాదాదన్యత్ర । సుఖంనాస్తిమహీతలే ॥ ౧౫౭॥

టీక॥ వేదశాస్త్రేషు=వేదశాస్త్రములయందు, సుఖం=సౌఖ్యము, న=లేదు, మంత్రయంత్రకే = మంత్ర = మంత్రముల యందును, యంత్రకే=యంత్రములయందు, (జపముచేసెడి, పంచాక్షరి మొదలైన మంత్రములయందు, ఆ మంత్రమహిమను బ్రకాశించునట్టి మంత్రబీజసహితములుగా లిఖింపఁబడిన, యంత్రములయందును,) సుఖం = సౌఖ్యము, న=లేదు, గురోః = గురువుయొక్క, ప్రసాదాత్=అనుగ్రము

కంటె, అన్యత్ర=మరియొకటి, మహీతలే=భూప్రదేశమునందు,సుఖం=
సుఖము, నాస్తి=లేదు.

తా ॥ ఓ పార్వతీ! వేదశాస్త్రములయందును మంత్రయంత్రముల
యందును సౌఖ్యములేదు, భూలోకమునందు సద్గురుని అనుగ్రహము
కంటె నన్యమైన దేనియందును సుఖములేదు.

శ్లో ॥ చార్వాకవైష్ణవమతే । సుఖంప్రాభాకరేనహి ।
గురోఃపాదాంతికేయద్వత్ । సుఖంవేదాంతసమ్మతం॥ ౧౫౮॥

టీక॥ గురోః=గురువుయొక్క, పాదాంతికే=పాదసమీపమునందు,
వేదాంతసమ్మతం=వేదాంత=ఉపనిషత్తులయందు, సమ్మతం=అంగీకరిం
పఁబడిన, సుఖం=ఆనందము, యద్వత్=ఏవిధముగా, (భవతి = కలుగు
చున్నదో,) (తద్వత్=ఆవిధముగా,) చార్వాకవైష్ణవమతే=చార్వాక=
చార్వాకులయొక్కయు,వైష్ణవ=వైష్ణవులయొక్కయు, మతే=మతము
లయందును, ప్రాభాకరే = జైనుల మతమునందును, సుఖం = ఆనంద
ము, నహి=లేదు.

తా ॥ గురువుయొక్క పాదపద్మములసమీపమునందు ఉపనిషత్తులచే
నంగీకరింపఁబడిన, బ్రహ్మానందమెట్లుకలుగునో ఆ విధముగా, చార్వా
కవైష్ణవ జైనుల మతములయందానందములేదని భావము.

శ్లో ॥ నతత్సుఖంసురేంద్రస్య । నసుఖంచక్రవర్తినాం ।
యత్సుఖంవీతరాగస్య । మునేరేకాంతవాసినః ॥ ౧౫౯॥

టీక ॥ వీతరాగస్య=వీత=పోయిన, రాగస్య=అనురాగముగలవాడు
ను, ఏకాంతవాసినః=ఏకాంత=రహస్యప్రదేశమునందు, వాసినః= నివ
సించియున్నవాడునగు, మునేః=మననశీలుండగుఋషియొక్క, సుఖం=
సుఖము, యత్=ఏదియో; తత్=ఆ, సుఖం=సుఖము, సురేంద్రస్య =
ఇంద్రునకును, న=లేదు, చక్రవర్తినాం=చక్రవర్తులకును, సుఖం = సుఖ
ము, న=లేదు.

తా॥ పోయిన అనురాగము గలవాఁడును, రహస్య ప్రదేశమున నుండి మననశీలుండగు, మహాఋషి యొక్క ఆనందమేదియో, అది త్రిలోకాధిపతియగు ఇంద్రునకును సమస్త భూమండలాధిపతులగు చక్రవర్తులకును లేదు.

శ్లో॥ రసం బ్రహ్మపిబేద్యశ్చ । తృప్తోయఃపరమాత్మని ।
ఇంద్రం చ మన్యతే రంకం । నృపాణాంతత్రకాకథా ॥ ౧౬౦॥

టీక॥ యః=ఎవఁడు, రసం బ్రహ్మ=రసస్వరూపమగు పరబ్రహ్మమును, పిబేచ్ఛ=పానము చేయునో; యః=ఎవఁడు, పరమాత్మని = పరమాత్మయందు, తృప్తః=తృప్తిపొందియుండెనో; (సః=వాఁడు,) ఇంద్రంచ=ఇంద్రుని, రంకం=అల్పుఁడుగాను, మన్యతే=తలంచుచున్నాఁడు, తత్ర= వాని విషయమునందు, నృపాణాం = రాజుల యొక్క, కథా=వార్త, కా = ఎక్కడిది.

తా॥ ఎవఁడు పరబ్రహ్మరసమును పానము చేయుచు పరమాత్మయందు తృప్తిపొందియుండునో, వాఁడు త్రిలోకాధిపతియగు-ఇంద్రుని-అల్పునిగా తలంచుచున్నాఁడు. ఆ బ్రహ్మానందరసానుభవమును జేసెడు వాని విషయమునందు రాజులయొక్క యానందవిషయకమగు వార్తమిక్కిలి స్వల్పమైన దగుచున్నది.

శ్లో॥ ఏకఏవాద్వితీయోహం । గురువాక్యేననిశ్చితః ।
ఏవమభ్యస్యతానిత్యం । నసేవ్యంవైవనాంతరం ॥ ౧౬౧॥

టీక॥ గురువాక్యేన=గురు=గురువుయొక్క, వాక్యేన=వాక్యముచేత, నిశ్చితః=నిశ్చయజ్ఞానము గలవాఁడును, అద్వితీయః= రెండవది లేని, అహం=నేను, ఏకఏవ=ఒక్కఁడనే, (అని,) ఏవం=ఈప్రకారము, అభ్యస్యతా=అభ్యాసము చేసెడువాని చేత, నిత్యం=ఎల్లప్పుడును, వై = ప్రసిద్ధముగా, వనాంతరం=అడవిమధ్యను, నసేవ్యం=సేవింపఁదగినది కాదు, (పొందఁదగినది కాదు.)

తా॥ గురువాక్యము చేత నిశ్చయజ్ఞానము గలవాఁడను అద్వితీ

యుండుననగు నేనుఒక్కఁడనేయని భావించుచు జ్ఞానాభ్యాసముచేసెడు వానిచేత ఎప్పుడును ప్రసిద్ధముగా నడవిమధ్యనే పొందఁదగినదికాదు.

శ్లో ॥ అభ్యాసాన్నిమిషేణైవ । సమాధిమధిగచ్ఛతి ।
ఆజన్మజనితంపాపం । తత్క్షణాద్దేవినశ్యతి ॥ ౧౬౨॥

టీక॥ హేదేవి=ఓపార్వతీ, (జనః=జనుడు,) అభ్యాసాత్ = జ్ఞానాభ్యాసమువలన, నిమిషేణైవ = నిమిషమాత్రముచేతనే, (రెప్పపాటులోపల,) సమాధిం=సమాధిని, (పరబ్రహ్మమునందే మనసు స్లీనమగుటను,) అధిగచ్ఛతి=పొందుచున్నాడు, ఆజన్మజనితం=ఆజన్మ = పుట్టినది మొదలుకొని, జనితం=కలిగిన, పాపం=పాపము, తత్క్షణాత్ =అప్పుడే, నశ్యతి= నశించుచున్నది.

తా ॥ ఓ పార్వతీ! జనుడుజ్ఞానాభ్యాసమువలన రెప్పపాటుకాలములో, పరబ్రహ్మమునందే,మనోలీనతనుబొందుచున్నాడు, అనేకజన్మములయందు చేయఁబడిన పాపము అప్పుడేనశించుచున్నది.

శ్లో ॥ కిమావాహనమవ్యక్తే । వ్యాపకేకింవిసర్జనం ।
అమూర్తావ కథంపూజా । కథంధ్యానంనిరామయే ॥ ౧౬౩॥

టీక॥ అవ్యక్తే=నామరూపాదివికారములులేని పరిపూర్ణబ్రహ్మమునందు, ఆవాహనం=పిలుచుట,కిం=ఏది, వ్యాపకే=అంతటానిండియుండెడు కేవలాత్మయందు, విసర్జనం=విడుచుట, కిం=ఎక్కడిది, అమూర్తా=స్వరూపములేని అచలబ్రహ్మమునందు, పూజా = పూజచేయుట, కథం = ఎట్లు,నిరామయే = నిర్వికారమగుపరిపూర్ణమునందు, ధ్యానం=ప్రార్థనము, కథం=ఎట్లు.

తా॥ నామరూపాదివికారములులేని కేవలాత్మయందు-ఆవాహనమే కలుగదు, అంతటానిండియుండెడుసర్వపరిపూర్ణమునందువిసర్జనమేకలుగదు, ప్రకృతిద్వయములేని యశరీరియందు పూజించుటకలుగదు, ఏ వికారమును లేని-అచలబ్రహ్మమునందు, ధ్యానమే కలుగనేరదు.

శ్లో ॥ గురుర్విష్ణుస్సత్త్వమయో । రాజసశ్చతురాననః ।
తామసోరుద్రరూపేణ । సృజత్యవతిహంతిచ ॥ ౧౬౪॥

టీక॥ గురుః=సద్గురువు, రాజసః=రజోగుణముగల, చతురాననః=బ్రహ్మయై, సృజతి=సృజించుచున్నాడు, సత్త్వమయః= సత్త్వగుణస్వరూపుఁడగు, విష్ణుః=విష్ణువై, అవతి=రక్షించుచున్నాడు, తామసః= తమోగుణము గలవాడై, రుద్రరూపేణ = ఈశ్వరస్వరూపముతో, హంతిచ=నశింపఁజేయుచున్నాడు.

తా ॥ సద్గురువు రజోగుణముగల బ్రహ్మస్వరూపియై సృష్టియును, సత్త్వగుణముగల విష్ణువై రక్షించుటయును, తమోగుణముగల రుద్రస్వరూపుఁడై నశింపఁజేయుటయును జేయుచున్నాడు.

శ్లో ॥ స్వయంబ్రహ్మమయోభూత్వా । తత్పరంచావలోకయేత్ ।
పరాత్పరతరంనాన్యత్ । సర్వగంతన్నిరామయం ॥ ౧౬౫॥

టీక ॥ స్వయం=తాను, బ్రహ్మమయః=బ్రహ్మస్వరూపి, భూత్వా=అయి, తత్=ఆ, పరంచ=పరస్వరూపమును, అవలోకయేత్=చూచును, పరాత్=పరస్వరూపమునకంటె, పరతరం=మిక్కిలిశ్రేష్ఠమైన, అన్యత్=వేఱైనది, న=లేదు, తత్=ఆపరస్వరూపము, సర్వగం=సమస్తమును నిండియుండు నదియును, నిరామయం = అవయవములు లేనిది యును, (భవతి=అగుచున్నది.)

తా ॥ జనుడు తానుబ్రహ్మ స్వరూపియై ఆపర స్వరూపమగు కేవలాత్మను జూచును. అట్టిపరస్వరూపుఁడగు పరిపూర్ణమునకంటెమిక్కిలి శ్రేష్ఠమైన అన్యమేదియును లేదు. అట్టి పరస్వరూపమగు అచల స్వరూపమంతటను నిండియుండునదియును, నిరామయమైనదియునై యున్నది.

శ్లో ॥ తస్యావలోకనంప్రాప్య । సర్వసంగవివర్జితః ।
ఏకాకీనిస్పృహశ్శాంతః । స్థాతావ్యైతత్ప్రసాదతః ॥ ౧౬౬॥

టీక॥ తస్య=ఆపరస్వరూపమగు కేవలాత్మయొక్క, అవలోకనం=చూచుటను, ప్రాప్య=పొంది, సర్వసంగవివర్జితః=సర్వ=సమస్తమైనవా

టి యొక్క, సంగ=కూడికను, వివర్జితః=విడిచినవాడును, ఏకాకీ=ఒంటరివాడును, నిస్పృహః=కోరికలేనివాడును, శాంతః= శమముగలవాడునై, తత్ప్రసాదతః తత్ =ఆపరమాత్మయొక్క, ప్రసాదతః = అనుగ్రహమువలన, స్థాతావై=ప్రసిద్ధముగస్థిరుడై యుండగలడు.

తా ॥ జనుడు ఆపరమాత్మస్వరూపావలోకనమునుబొంది, దేహేంద్రియాది సమస్త ప్రపంచము యొక్క కూడికను విడిచి, ఏకాకియును, నిస్పృహుఁడును, శాంతుఁడునునై-ఆపరమాత్మానుగ్రహమువలన ప్రసిద్ధముగస్థిరుడై యుంచున్నాడు.

శ్లో ॥ లబ్ధంవాథనలబ్ధంవా । స్వల్పంవాబహుళంతథా ।
నిష్కామేనైవభోక్తవ్యం । సదాసంతుష్టమానసః ॥ ౧౬౭॥

టీక॥ లబ్ధంవా=పొందఁబడినదైనను, అథ = మరియు, నలబ్ధంవా = పొందఁబడనిదైనను, స్వల్పంవా=స్వల్పమైనదైనను, తథా = ఆప్రకారము, బహుళం = అధికమైనదైనను, సదా = ఎల్లప్పుడు, సంతుష్టమానసః=సంతుష్ట= సంతోషమునుబొందిన, మానసః = మనస్సుగలవాడై, నిష్కామేనైవ=కోరికలేకనే, భోక్తవ్యం=అనుభవించదగినది.

తా ॥ జనుడెల్లప్పుడున్ను సంతోషమునుబొందిన మనస్సు గలవాడై పొందఁబడిన వస్తువునైనను పొందఁబడని వస్తువునైనను అల్ప మైనవస్తువునైనను అధికమైనవస్తువునైనను కోరికలేకనే అనుభ వించ దగినది.

శ్లో ॥ సర్వజ్ఞంపదమిత్యాహు । ర్దేహీసర్వమయోభువి ।
సదానందస్సదాశాంతో । రమతేయత్రకుత్రచిత్ ॥ ౧౬౮॥

టీక ॥ దేహీ=జీవుడు. భువి=భూమియందు,సదానందః=ఎల్లప్పుడానందము గలవాడును, సదాశాంతః = ఎల్లప్పుడు శమముగలవాడును, సర్వమయః=సమస్తస్వరూపుడునై, యత్రకుత్రచిత్ = ఎక్కడెక్కడనైనను, రమతే=క్రీడించుచున్నాడో, తత్ =దానినే, సర్వజ్ఞం = సమస్తమునుగుర్తెరిగిన, పదమితి=స్థానమని, ఆహుః= చెప్పిరి.

తా॥ జీవుఁడు భూమియం దెక్కడెక్కడ నైనను సదానందుఁడును, సదాశాంతుఁడును, సమస్తస్వరూపుఁడునై క్రీడించుచున్నాఁడో, దానినే సర్వజ్ఞత్వపదమని బ్రహ్మవేత్తలు చెప్పిరి.

శ్లో॥ యత్రైవతిష్ఠతేసోపి । సదేశఃపుణ్యభాజనః ।
మక్తస్యలక్షణంచైవ । తవాగ్రేకథితంమయా ॥ ౧౬౯॥

టీక॥ సోపి=అట్టిసర్వజ్ఞుఁడగువాఁడును,యత్రైవ=ఏప్రదేశమునందు, తిష్ఠతే=ఉంచున్నాఁడో, సః=ఆ,దేశః=దేశము, పుణ్యభాజనః=పుణ్యము సుబొందినది, మయా=నాచేతను, తవ=నీయొక్క, అగ్రే=ముందరను, ముక్తస్య=ముక్తుఁడగువాని యొక్క, లక్షణంచైవ=చిహ్నమున్ను, కథితం=చెప్పఁబడినది.

తా॥ ఓపార్వతీ! అట్టిసర్వజ్ఞుఁడగువాఁడు ఏప్రదేశమందుండునో ఆదేశము పుణ్యమును బొందియున్నది యగుఁను, నాచేత నీముందరను ముక్తుని యొక్క లక్షణమును జెప్పఁబడినది.

శ్లో॥ ఉపదిశ్యస్వయందేవి । గురుమార్గేణముక్తిదం ।
గురుముక్తిస్తథాత్యన్తా । కర్తవ్యావైమనీషిభిః ॥ ౧౭౦॥

టీక॥ హేదేవి=ఓపార్వతీ, మనీషిభిః=పండితులచేత, స్వయం= స్వకీయముగా, గురుమార్గేణ=గురువుయొక్కమార్గముతో, ముక్తిదం= మోక్షమును ఇచ్చునట్టిజ్ఞానమును, ఉపదిశ్య=ఉపదేశింపఁబడి, తథా= ఆప్రకారము, అత్యన్తా=అధికమగు, గురుభక్తిః = గురువునందుపూజ్యాను రాగము, కర్తవ్యావై=ప్రసిద్ధముగాఁ జేయఁదగినది.

తా॥ ఓ పార్వతీ! జ్ఞానులచేత గురుమార్గముతో స్వకీయముగా మోక్షమునొసంగెడి జ్ఞానము నుపదేశింపఁబడి-అధికమగు గురుభక్తి ప్రసిద్ధముగాఁజేయదగినది.

శ్లో॥ నిత్యయుక్తాశ్రయస్సర్వ । వేదకృత్సర్వవేదకృత్ ।
స్వపరజ్ఞానదాతాచ । తంవన్దేగురుమీశ్వరం ॥ ౧౭౧॥

టీక॥ నిత్యయుక్తాశ్రయః=నిత్య=శాశ్వతమైన, యుక్త = యోగ మును, ఆశ్రయః=ఆశ్రయించియుండెడువాడును, సర్వవేదకృత్ = సమ స్తవేదములను జేయువాడును, సర్వవేదకృత్ = సమస్తజ్ఞానములను జేయువాడును,స్వపరజ్ఞానదాతాచ=స్వపర=జీవేశ్వరులయొక్క, జ్ఞాన =జ్ఞానమును, దాతాచ=ఇచ్చెడువాడును, (యః=ఎవడో,) తం= అటు వంటి, ఈశ్వరం = ఈశ్వరస్వరూపుఁడగు, గురుం = గురువునుగూర్చి, వన్దే = నమస్కరించు చున్నాను.

తా ॥ శాశ్వతమైన యోగమునాశ్రయించియుండెడువాడును, సమ స్తవేదములను నిర్మించువాడును, సమస్తజ్ఞానమును గలుగజేయు వాడు ను,జీవేశ్వరజ్ఞానమునొసంగెడివాడునెవడో-అట్టిఈశ్వరస్వరూపుఁడగు సద్గురువునుగూర్చి నమస్కరించు చున్నాను.

శ్లో ॥ యద్యప్యధీతానిగమాః । షడంగాన్యాగమాఃప్రియే ।
అధ్యాత్మాదీనిశాస్త్రాణి । జ్ఞానంనాస్తిగురుంవినా ॥ ౧౭౨॥

టీక॥ హేప్రియే=ప్రియురాలవగు ఓ పార్వతీ, నిగమాః = వేదము లును, షడంగాని=శిక్షవ్యాకరణాది అంగములారును, ఆగమాః = శైవ వైష్ణవాద్యాగమములును, అధ్యాత్మాదీని = అధ్యాత్మము మొదలైన, శాస్త్రాణి=శాస్త్రములును, యద్యప్యధీతాని=అధ్యయనము చేయఁబడి నవైనను. (చదవఁబడినవైనను,) గురుంవినా=గురువు లేకుండా, జ్ఞానం= ఆత్మజ్ఞానము, నాస్తి=లేదు.

తా ॥ ఓ పార్వతీ! వేదవేదాంగములును శైవాద్యాగమ ములును అధ్యాత్మము మొదలైన జ్ఞానశాస్త్రములును చదవఁబడినవైనను గురు వు లేకుండా ఆత్మజ్ఞానము కలుగదు.

శ్లో ॥ నిరస్తసర్వసందేహో । ఏకీకృత్య సుదర్శనం ।
రహస్యంయోదర్శయతి । భజామిగురుమీశ్వరం ॥ ౧౭౩॥

టీక॥ యః=ఎవడు, నిరస్తసర్వసందేహః=నిరస్త=పోయిన, సర్వసం

దేహాః=సమస్తసందేహములుగలవాడై,ఏకీకృత్య=ఏకీభవింపఁజేసి, రహస్యం=రహస్యమైన, సుదర్శనం=అచలపరిపూర్ణబ్రహ్మమును, దర్శయతి=చూపించుచున్నాడో; (తం=అటువంటి), ఈశ్వరం=ఈశ్వరస్వరూపుఁడగు, గురుం=సద్గురుస్వామిని, భజామి=సేవించుచున్నాను.

తా ॥ ఎవఁడుసర్వసంశయములు పోయినవాడై, ఏకత్వమునుబొందించి పరమరహస్యమైన-అచలపరిపూర్ణ బ్రహ్మమును జూపించుచున్నాడో,అట్టి ఈశ్వరస్వరూపుడైన సద్గురుస్వామిని సేవించుచున్నాను.

శ్లో ॥ జ్ఞానహీనోగురుత్యాజ్యః । మిధ్యావాదీవిడంబకః ।
స్వవిశ్రాంతింనజానాతి ।‌ పరశాంతింకరోతికిం॥ ౧౭౪॥

టీక॥ జ్ఞానహీనః =జ్ఞానములేనివాడును, గురుత్యాజ్యః = గురువుచేత విడువఁదగినవాడును, మిధ్యావాదీ=అబద్ధము పలికెడువాడునగు, విడంబకః= ఆలస్యము చేయువాడు, (మందుడు), స్వవిశ్రాంతిం = తనయొక్క నెమ్మదిని, నజానాతి= తెలిసికొనడు, పరశాంతిం=పర=ఇతరునకు, శాంతిం=నెమ్మదిని, కిం=ఏమి, కరోతి=చేయుచున్నాడు.

తా ॥ జ్ఞానహీనుఁడును గురుత్యాగియును మిధ్యావాదియునగు మందుడు తనయొక్క నెమ్మదినే తెలిసికొనడు, ఇతరులకు నెట్లువిశ్రాంతిమార్గమును గలుగజేయుచున్నాడు, అనగా (నెమ్మదిని కలుగఁజేయడని భావము.)

శ్లో ॥ శిలాయాఃకింపరంజ్ఞానం । శిలాసంఘప్రతారణే ।
స్వయంతర్తుంనజానాతి । పరంనిస్తారయేత్కథం॥ ౧౭౫॥

టీక॥ శిలాయాః=పాషాణమునకు, (రాతికి), పరం=శ్రేష్ఠమైన, జ్ఞానం=జ్ఞానము, కిం=ఎక్కడిది, శిలా=రాళ్లయొక్క, సంఘప్రతారణే=సంఘ=సమూహములను, ప్రతారణే=తిరస్కరించి, స్వయం = తాను, తర్తుం=తరించుటను, నజానాతి= తెలుసుకొననివాడు,పరం= ఇతరుని, కథం=ఎట్లు, నిస్తారయేత్ =దాటించును.

తా॥ రాతికి శ్రేష్ఠమైన జ్ఞానమెక్కడిది-జనుడు, అట్టిరాళ్లయొక్క సమూహమును (ప్రతిమలను) అజ్ఞానమువలన దైవమనెడి భావమును విడిచి, తానుకడతేరుటకు జ్ఞానమును బొందనివాడు, పరునినెట్లు తరింపఁజేయును, అట్టి అజ్ఞాని, ఇతరుని తరింపఁజేయలేడనిభావము.

శ్లో॥ నవందనీయాస్తేకష్టం। దర్శనాద్భ్రాంతికారకాః।
వర్జయేత్తాన్గురూన్దూరే। ధీరస్యతుసమాశ్రయేత్ ॥ ౧౭౬॥

టీక॥ దర్శనాత్ =చూచుటవలన, భ్రాంతికారకాః= భ్రమజ్ఞానమును గలుగఁజేసెడు, తే=ఆగురువులు, కష్టం=కాఠిన్యముగానైనను,నవందనీయాః=నమస్కరించఁదగినవారుగారు,తాన్=అటువంటి,గురూన్=గురువులను,దూరే=దూరమునందు,వర్జయేత్ =విడిచిపెట్టవలయును, ధీరస్యతు=ధైర్యశాలియగుజ్ఞానినే,సమాశ్రయేత్ =ఆశ్రయించవలయును.

తా॥ దర్శనమాత్రమువల్లనే భ్రమజ్ఞానమునుగలుగఁజేసెడి గురువులు-అతిప్రయాసచేతనున్న నమస్కారార్హులుకారు, అట్టిగురువులను దూరముగావిడిచిపెట్టి ధైర్యశాలియగుజ్ఞానినే-ఆశ్రయించవలయును.

శ్లో॥ పాషండినఃపాపరతాః। నాస్తికాభేదబుద్ధయః।
స్త్రీలంపటాదురాచారాః। కృతఘ్నాబకవృత్తయః॥ ౧౭౭॥

శ్లో॥ కర్మభ్రష్టాఃక్షమానష్టా। నింద్యతర్కైశ్చవాదినః।
కామినఃక్రోధినశ్చైవ। హింసాచండాశ్శఠా స్తథా॥ ౧౭౮॥

శ్లో॥ జ్ఞానలుప్తాశ్చకర్తవ్య। మహాపాపా స్తథాప్రియే।
ఏభ్యోభిన్నోగురుస్సేవ్య। ఏకభక్త్యావిచార్యచ॥ ౧౭౯॥

టీక॥ హేప్రియే = ఓప్రియురాలవగుపార్వతీ, పాషండినః=పాషండులును, (వేదోక్తాచారములులేనివారు,)పాపరతాః= పాపమునందాసక్తిగలవారును, నాస్తికాః=దేవుడులేదనెడివారును, భేదబుద్ధయః= భేదజ్ఞానముగలవారును, స్త్రీలంపటాః= స్త్రీలయందాశగలవారును, దురాచారాః=చెడు-ఆచారములుగలవారును, కృతఘ్నాః=చేసినమేలునుమఱ

చెడువారును, బకవృత్తయః=బక=కొంగయొక్క,వృత్తయః= వృత్తివంటి వృత్తిగలవారును, (మోసము చేయువారును,) ॥ కర్మభ్రష్టాః = వేదోక్తకర్మలేని, అక్షమాః = ఓర్పులేని, నష్టాః= నాశనమును బొందిన, నింద్యతర్కైశ్చ = నిందించఁదగిన న్యాయములచేతను, వాదినః = వాదించెడువారును, కామినః = కామముగలవారును, క్రోధినశ్చైవ=కోపముగలవారును, హింసాచండాః=హింసించుటయందు కఠినముగానుండెడువారును, తథా=ఆప్రకారము, శఠాః=దుర్మార్గులును,జ్ఞానలుప్తాశ్చ=జ్ఞానలోపముగలవారును, తథా=ఆప్రకారముగానే, కర్తవ్యమహాపాపాః=చేయఁబడిన గొప్పపాపములుగలవారును,ఏభ్యః=ఈ చెప్పఁబడినవారికంటెను,భిన్నః=అన్యుడైన,గురుః=సద్గురువు, ఏకభక్త్యా=ముఖ్యమైనభక్తితో,విచార్యచ=విచారించి, సేవ్యః=సేవించఁదగినవాడు.

తా ॥ ఓ పార్వతీ! వేదోక్తాచారములు లేని వారును, పాపమందే ఆసక్తులగువారును, నాస్తికులును, జీవేశ్వరభేద జ్ఞానము గలవారును, స్త్రీలోలులును, దురాచారులును, కృతఘ్నులును,కొంగవలెనే మోసమును జేసెడువారును, వేదోక్తకర్మలేనివారై నష్టమునుబొంది నింద్యములైన న్యాయములతో వాదించెడువారును, కాముకులును, క్రోధము గలవారును, పరహింసయందు కఠినముగా నుండెడువారును, దుర్మార్గులును, జ్ఞానహీనులును, గొప్పపాపములను జేసినవారును, ఇటువంటి వీరలందరికిని వేరైన సద్గురువును ముఖ్యమైన పూజ్యానురాగముతో విచారించి, సేవించఁదగినది.

శ్లో ॥ శిష్యాదన్యత్ర దేవేశి । నవదేద్యస్యకస్యచిత్ ।
నరాణాంచఫలప్రాప్తౌ । భక్తిరేవహికారణం॥ ౧౪౦॥

టీక ॥ హేదేవేశి=ఓపార్వతీ, శిష్యాత్ = శిష్యునికంటె, అన్యత్ర= ఇతరమైన, యస్యకస్యచిత్ = ఎవనికైనను, నవదేత్ = చెప్పకూడదు, నరాణాంచ=మనుష్యులలోపల,ఫలప్రాప్తౌ=ఫలమునుబొందుటయందు,

భక్తిరేవ=పూజ్యానురాగమే, కారణంహి=హేతువుగదా.

తా॥ ఓపార్వతీ! శిష్యునికంటె నితరమగు ఎవనికిని తత్వమును జెప్పఁగూడదు. మనుష్యులలోపల ప్రాప్తియందు భక్తియే ముఖ్యకారణమైనది గనుక అట్టి భక్తిగలవానికే చెప్పవలయును.

శ్లో॥ గూఢోదృఢశ్చప్రీతశ్చ । మౌనేనసుసమాహితః।
సకృత్కామగతోవాపి । పంచధాగురురీరితః ॥ ౧౮౧॥

టీక ॥ గూఢః = రహస్యవృత్తిగలవాఁడును, దృఢశ్చ = ధైర్యముగలవాఁడును, ప్రీతశ్చ=సంతోషమును బొందినవాఁడును, మౌనేన = మౌనముచేతను, సకృత్కామ గతోవాపి=ఒకసారి కామమును బొందినవాడైనను, పంచధా=అయిదు విధములచేతను, గురు=గురువని, ఈరితః =చెప్పఁబడుచున్నాఁడు.

తా ॥ రహస్యవృత్తిగలవాఁడును,ధైర్యముగలవాఁడును,సంతోషచిత్తుఁడును, మౌనముతో నుండువాఁడును, ఏకపత్నీవ్రతమును బొందిన వాఁడునగు జనుఁడు ఈ అయిదువిధములచేతను గురువని చెప్పఁ బడుచున్నాఁడు.

శ్లో॥ సర్వంగురుముఖాల్లబ్ధం । సఫలంపాపనాశనం ।
యద్యదాత్మహితంవస్తు । తత్తద్ద్రవ్యంనవంచయేత్ ॥ ౧౮౨॥

టీక॥ గురుముఖాత్=గురుముఖమువలన,లబ్ధం=పొందఁబడినదియును, సఫలం=నెఱవేరినదియును, పాపనాశనం =పాపమును నశింపఁజేయునదియును, ఆత్మహితం=ఆత్మకు ఇష్టమైనదియును, సర్వం = సమస్తమునగు, వస్తు=వస్తువు, యద్యత్ = ఏదియేదియో; తత్తత్ = ఆయా, ద్రవ్యం=వస్తువును, నవంచయేత్=వంచనచేయఁగూడదు, (అలక్ష్యము చేయఁగూడదు.)

తా ॥ గురుముఖమువలన పొందఁబడి సఫలమై పాపనాశనమగు, ఆత్మహితమైన సమస్త పదార్థములేవేవియో; ఆయా పదార్థములను అలక్ష్యము చేయఁగూడదు.

శ్లో॥ గురుదేవార్పణంయత్తు । తేనతుష్టోస్మిసువ్రతే । శ్రీగురోఃపాదు
కాంముద్రాం । మూలమంత్రంచ గోపయేత్ ॥ ౧౫౩॥

టీక॥ సువ్రతే=మంచి నియమముగల ఓ పార్వతీ, గురుదేవార్పణం =గురు = గురుస్వాములవారికి, అర్పణం = అర్పింపఁబడినది, యత్తు= యేదియో; తేన=దానిచేతను, తుష్టః=సంతోషమును బొందినవాడను, అస్మి=అగుచున్నాను, శ్రీగురోః=ప్రకాశమానుఁడగు గురువు యొక్క, పాదుకాం =పాదుకయనెడి, ముద్రాం = ముద్రను, మూలమంత్రంచ= మూలమంత్రమునున్ను, గోపయేత్ =రహస్యముగానుంచుకొనవలయును.

తా ॥ మంచినియమముగల. ఓ పార్వతీ! గురుదేవునకు అర్పింపఁబడినదేదియో, దానిచేత నేనుసంతోషము పొందినవాడనగుచున్నాను, శ్రీగురు పాదుకాముద్రను, మూలమంత్రమునున్ను, వెల్లడిచేయఁగూడదని ఈశ్వరుఁడు పార్వతికిం జెప్పెను.

శ్లో ॥ నతాస్మితేనాథపదారవిందం । బుద్ధీంద్రియప్రాణమనోవచోభిః।
యచ్చింత్యతే భావితఆత్మయుక్తౌ । ముముక్షుభిః కర్మమయోప
శాంతయే ॥ ౧౫౪॥

టీక ॥ ముముక్షుభిః=మోక్షమం దిచ్ఛగలవారిచేతను, భావితఆత్మ యుక్తౌ=భావిత=ధ్యానించఁబడిన, ఆత్మ=ఆత్మస్వరూపము యొక్క, యుక్తౌ=కూడికయందు, కర్మమయోపశాంతయే=కర్మమయ = కర్మస్వరూపముయొక్క, ఉపశాంతయే=శమించుటకొఱకు, యత్ =ఏది, చిన్త్యతే =తలంచఁబడుచున్నదో; హే నాథ=ఓస్వామీ, తే=నీయొక్క, తత్ = అటువంటి, పదారవిందం=పాదపద్మములను, బుద్ధీంద్రియప్రాణ మనోవ చోభిః=బుద్ధి, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, వాక్కులు, (వీని చేతను) నతా=నమస్కరించుదానను, అస్మి=అగుచున్నాను.

తా ॥ మోక్షేచ్ఛ గలవారిచే ధ్యానింపఁబడిన ఆత్మ స్వరూపము యొక్క కూడికయందు కర్మశాంతికొఱకు, ఏభగవత్పాదారవిందములను

ధ్యానింపఁబడుచున్నవో, ఓ స్వామీ! అటువంటి నీపాద పద్మములను గూర్చి బుద్ధీంద్రియప్రాణ మనోవాక్కులచేత నమస్కరించుచున్నానని పార్వతి పలికెను.

శ్లో ॥ అనేనయద్భవేత్కార్యం । తద్వదామితవప్రియే ।
లోకోపకారకందేవీ । లౌకికంతు వివర్జయేత్ ॥ ౧౫౫॥

టీక ॥ హే ప్రియే=ప్రియురాలవగు ఓపార్వతీ, అనేన=దీని చేతను, యత్=ఏ, కార్యం=పని, భవేత్ = అగునో; తత్=అది, తవ = నీకు, వదామి=చెప్పుచున్నాను, లోకోపకారకం=లోక =ప్రపంచమునకు, ఉపకారకం=ఉపకారమగు, లౌకికంతు=లోకసంబంధమగు వ్యాపారము, హే దేవీ=ఓ పార్వతీ, వివర్జయేత్=విడుచును.

తా ॥ ఓ ప్రియురాలవగు ఓ పార్వతీ ఈపూర్వము చేసిన నమస్కారము చేతంగలిగెడు కార్యమేదియో దానిని చెప్పుచున్నాను, వినుము, ఓ పార్వతీ లోకోపకారకమగు లౌకిక సంబంధమైన వ్యాపార మంతయును విడిచిపోవునని ఈశ్వరుఁడు పలికెను.

శ్లో ॥ లౌకికాద్ధర్మతోయాంతి । జ్ఞానహీనోభవార్ణవే ।
జ్ఞానభావేచయత్సర్వం । కర్మనిష్కర్మశామ్యతి ॥ ౧౫౬॥

టీక ॥ లౌకికాత్=లోక సంబంధమైన, ధర్మతః=న్యాయమునుండి, జ్ఞానహీనః=జ్ఞానము లేనివాఁడు, భవార్ణవే=సంసారసముద్రమునందు, యాంతి=పోవుచున్నాఁడు,జ్ఞానభావేచ=జ్ఞాన భావమునందు,సర్వం=సమస్తమైన, కర్మ=కర్మము,యత్=ఏదెయో; (తత్=అది,) నిష్కర్మ=కర్మరహితమైన బ్రహ్మస్వరూపమై, శామ్యతి=శమించుచున్నది.

తా ॥ జ్ఞానహీనుఁడగువాఁడు లౌకికాచారమునుండి సంసార సముద్రమునందు మునిఁగి పోవుచున్నాఁడు, జ్ఞాన భావముచేత లోకసంబంధమగు సమస్తకర్మరహితమైన బ్రహ్మస్వరూపమును బొందు చున్నాఁడు.

శ్లో ॥ ఇమాంతుభక్తిభావేన । పఠనాచ్ఛ్రవణాదపి ।
లిఖిత్వాచప్రదానేన । తత్సర్వంఫలమశ్నుతే ॥ ౧౮౭॥

టీక ॥ ఇమాంతు=ఈ గురుగీతను, భక్తిభావేన=భక్తి భావముతో, పఠనాత్=చదువుటవల్లను, శ్రవణాదపి=వినుటవల్లనున్ను, లిఖిత్వా = వ్రాసి, ప్రదానేనచ=ఇచ్చుటచేతనున్ను,తత్=ఆ, సర్వం=సమస్తమైన, ఫలం=ఫలమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

తా ॥ జనుడు ఈ గురుగీతను భక్తిభావముతో పఠించుట వల్లను, వినుటవల్లను, దీనిని వ్రాసి ఇతరులకు దానము చేయుట చేతను, సమస్త ఫలములను బొందుచున్నాఁడు.

శ్లో ॥ గురుగీతామిమాందేవీ । హృదినిత్యంవిభావయ ।
మహావ్యాధిగతైర్దుఃఖైః । సర్వదాప్రజపేన్ముదా ॥ ౧౮౮॥

టీక ॥ హే దేవీ=ఓపార్వతీ,ఇమాం=ఈ, గురుగీతాం=గురుగీతను హృది=హృదయమునందు, నిత్యం=ఎల్లప్పుడున్ను, విభావయ = భావించుము. (తలంచుము), మహావ్యాధిగతైః=మహావ్యాధి=గొప్పరోగముల చేతను, గతైః=పొందఁబడిన, దుఃఖైః=దుఃఖములతో, (ఉపలక్షితాపి= కూడుకొనినదానవైనను,) ముదా=సంతోషముతో, సర్వదా = ఎల్లప్పుడున్ను, ప్రజపేత్=జపించవలయును.

తా ॥ ఓ పార్వతీ! ఈ గురుగీతను నీహృదయమునం దెల్లప్పుడును భావనచేయుము, గొప్పవ్యాధులవలనఁబొందఁబడిన దుఃఖములతోఁ గూడికొనినదానవైనను (సంతోషముతో నెల్లప్పుడును జపించవలయును.)

శ్లో ॥ గురుగీతాక్షరైకైకం । మంత్రరాజమిదంప్రియే ।
అన్యేచవివిధామంత్రాః । కలాంనార్హంతిషోడశీం ॥ ౧౮౯॥

టీక ॥ హే ప్రియే=ప్రియురాలవగు ఓ పార్వతీ, ఇదం=ఈ,గురుగీతాక్షరైకైకం=గురుగీతా=గురుగీతయందలి, అక్షర = వర్ణములలో, ఏకైకం=ఒకొ్కకటియే, మంత్రరాజం=మంత్రశ్రేష్ఠము, అన్యే = ఇతరములగు, వివిధాః=నానావిధములైన, మంత్రాశ్చ = మంత్రములున్ను,

షోడశీం=పదియారవదియగు, కలాం=భాగమునుగూర్చిన్ని, నార్హన్తి=తగియుండవు.

తా ॥ ఓ పార్వతీ! ఈ గురుగీతయందలి యొక్కొక వర్ణమే మంత్రరాజముగానున్నది, ఇతరములగు సమస్తమంత్రములున్ను ఈ మంత్ర రాజము యొక్క పదియారవ భాగమునకు సమానములుగావు.

శ్లో ॥ అగాంధఫలమాప్నోతి । గురుగీతాజపేనతు ।
సర్వపాపహరాదేవీ । సర్వదారిద్ర్యనాశినీ ॥ ౧౯౦॥

టీక ॥ (జనః=జనుడు), గురుగీతాజపేనతు=గురుగీతయొక్క జపము చేతను, అగాధం=అధికమైన, ఫలం = ఫలమును, ఆప్నోతి = పొందు చున్నాడు. హేదేవీ=ఓ పార్వతీ, (గురుగీత) సర్వపాపహరా=సమస్త పాపములనుహరించునదియును, సర్వదారిద్ర్యనాశినీ = సమస్తదారిద్ర్య ములను నశింపజేయునదియును, (భవతి=అగుచున్నది.)

తా ॥ జనుడు గురుగీతనుజపించుటచేత నధికమైన ఫలమునుబొందు చున్నాడు. ఓ పార్వతీ! ఈ గురుగీతసమస్తపాపములను హరించు నది యును, గొప్పదరిద్రమును నశింపజేయునదియు నగుచున్నది.

శ్లో ॥ కాలమృత్యుహరాచైవ । సర్వసంకటనాశినీ ।
యక్షరాక్షసభూతాది । చోరవ్యాఘ్రవిఘాతినీ ॥ ౧౯౧॥

టీక ॥ కాలమృత్యుహరాచైవ=కాల=సమయమునందైన, మృత్యు =మరణమును, హరాచైవ=హరించునదియును, సర్వసంకటనాశినీ =స ర్వ=సమస్తములైన, సంకట=కష్టములను, నాశినీ = నశింపజేయునది యును, యక్షరాక్షసభూతాచోరవ్యాఘ్రవిఘాతినీ = యక్ష=యక్షులు న్ను, రాక్షస=రాక్షసులున్ను, భూతా=పిశాచములున్ను, ఆది=మొద లైనవాటినిన్ని,చోర=దొంగలనున్ను, వ్యాఘ్ర=పెద్దపులులనున్ను,విఘా తినీ=కొట్టుచున్నది.

శ్లో ॥ సర్వోపద్రవకుష్టాది । దుష్టదోషనివారిణీ ।
యత్ఫలంగురుసాన్నిధ్యా । త్తత్ఫలంపఠనాద్భవేత్ ॥ ౧౯౨॥

టీక॥ సర్వోపద్రవకుష్టాదిదుష్టదోషనివారిణీ=సర్వ=సమస్తములైన, ఉపద్రవ=ఆపదలనున్ను, కుష్ట=కుష్టురోగమును, ఆది=మొదలైన, దుష్ట=చెడువైన, దోష=పాపములను, నివారిణీ=పోగొట్టునదియును (భవతి=అగుచున్నది,) గురుసాన్నిధ్యాత్ = గురువుయొక్క సమీపమువలన, ఫలం=ఫలము, యత్ = ఏదియో, తత్=ఆ, ఫలం=ఫలము, పఠనాత్=గురుగీతను పఠించుటవలన, భవేత్=కలుగును.

తా॥ ఈ గురుగీత, కాలమంౘైన మరణమును హరించునదియును సమస్తకష్టములను నశింపఁజేయునదియును, యక్షరాక్షస భూతాదుల నున్ను చోరవ్యాఘ్రములనున్ను కొట్టివేయునదియును, సమస్త ఉపద్రవములనున్ను, కుష్టువ్యాధి మొదలైన చెడుదోషములనున్ను నివారించుచున్నదియు నగుచున్నది. ఓ పార్వతీ! గురుసాన్నిధ్యమున జనుడు ఏఫలమును బొందునో ఆఫలమును ఈ గురుగీతను పఠించుట వలనం గలుగును.

శ్లో॥ మహావ్యాధిహరాసర్వా । విభూతేస్సిద్ధిదాభవేత్ ।
　　అథవా మోహనేవశ్యే । స్వయమేవజపేత్సదా॥　　౧౯౩॥

శ్లో॥ కుశదూర్వాసనేదేవీ । హ్యాసనేశుభ్రకంబలే ।
　　ఉపవిశ్యతతోదేవీ । జపేదేకాగ్రమానసః॥　　౧౯౪॥

టీక॥ సర్వా=ఈ గురుగీతయంతయు, మహావ్యాధిహరా=గొప్పరోగమును హరించునదియును, విభూతేః=భగవద్విభూతియొక్క, (భగవత్సంబంధమైనఐశ్వర్యముయొక్క), సిద్ధిదా=ప్రాప్తిని ఇచ్చునదియును, భవేత్=అగును, అథవా=అట్లుకాదేని, హేదేవీ=ఓ పార్వతీ, మోహనే=మోహమునందును, (జగత్తును మోహపరచుటయందును), వశ్యే=స్వాధీనపరుచుకొనుటయందును, స్వయమేవ=స్వకీయముగానే,సదా=ఎల్లప్పుడున్ను, కుశదూర్వాసనే=కుశ=దర్భచేతను, దూర్వా=గరికచేత

వైన, ఆసనే=ఆసనమునందు, జపేత్ =జపముచేయవలయును, తతః= అనంతరము, హే దేవీ= ఓ పార్వతీ, శుభ్రకంబళే= తెల్లని కంబళము గల, ఆసనేహి=ఆసనమునందును, ఉపవిశ్య = కూర్చుండి, ఏకాగ్రమానసః = ఏకాగ్రచిత్తముగలవాడై, చంచలములేని మనస్సుగలవాడై), జపేత్ =జపముచేయవలయును.

తా॥ ఈగురుగీతయంతయు గొప్పరోగములను నశింపఁజేయునదియును, భగవదైశ్వర్యము నొసంగునదియునగును, ఓ పార్వతీ! జగన్మోహనవశ్యములయందు ఈగురుగీతను దర్భయు-గరికయు-ఆసములయందుండి, స్వీకీయముగా జపముచేయవలయును, ఓ పార్వతీ నిశ్చలమనస్కుఁడై తెల్లని కంబళముగల ఆసనమునందుండి యైనను జపముచేయవలయును.

శ్లో॥ శుక్లంసర్వత్రవైప్రోక్తం । వశ్యేరక్తాసనంప్రియే ।
పద్మాసనేజపేనిత్యం । శాంతివశ్యకరంపరం॥ ౧౯౫॥

శ్లో॥ వస్త్రాసనేచదారిద్ర్యం । పాషాణేరోగసంభవః।
మేదిన్యాంసుఃఖమాప్నోతి । కాష్ఠేభవతినిష్ఫలం॥ ౧౯౬॥

శ్లో॥ కృష్ణాజినేజ్ఞానసిద్ధి । ర్మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి ।
కుశాసనేజ్ఞానసిద్ధిః । సర్వసిద్ధిస్తుకంబళే ॥ ౧౯౭॥

టీక॥ శుక్లం=తెల్లని ఆసనము, సర్వత్ర=అంతటను, వై = ప్రసిద్ధమైనదిగా, ప్రోక్తం=చెప్పఁబడినది, హేప్రియే=ఓపార్వతీ, వశ్యే=జనవశ్యమునందు, రక్తాసనం=ఎఱ్ఱని ఆసనమున్ను, (ప్రోక్తం = చెప్పఁబడినది), పరం=శ్రేష్ఠమైన, శాంతివశ్యకరం=శాంతముతో స్వాధీనమగుటనుగురించి, పద్మాసనే=పద్మాసనమునందు, నిత్యం=ఎల్లప్పుడున్ను, జపేత్ =జపముచేయవలయును, వస్త్రాసనేచ=వస్త్రాసనమునందు, దారిద్ర్యం=దరిద్రమున్ను, పాషాణే = రాతియందు, రోగసంభవః = రోగ=రోగముయొక్క, సంభవః=పుట్టుకయును, (భవతి=అగుచున్నది,) మేది

న్యాం=భూమియందు, దుఃఖం=దుఃఖమును, ఆప్నోతి = పొందుచున్నా డు, కాష్టే=కొయ్యయందు, నిష్ఫలం=వ్యర్థము, భవతి= అగుచున్నది, కృష్ణాజినే=కృష్ణాజినమందు, జ్ఞానసిద్ధిః=జ్ఞానప్రాప్తియును, వ్యాఘ్ర చర్మణి=పెద్ద పులిచర్మమునందు, మోక్షశ్రీః=మోక్షసంపదయును, కు శాసనే=దర్భాసనమునందు, జ్ఞానసిదిః=జ్ఞానప్రాప్తియును, కంబళేతు =కంబళమునందు, సర్వసిద్ధిః=అన్నిటియొక్క సిద్ధియును, (భవతి= కలు గుచున్నది.

తా॥ ఓపార్వతీ! ఈగురుగీతనుజపించుటకు తెల్లని-ఆసనము-అంత టనుప్రసిద్ధమైనదిగాఁజెప్పబడుచున్నది. ఎఱ్ఱని-ఆసనము జనస్వాధీనము కొఱకును, పద్మాసనము శాంతముగా మిక్కిలి జనమునుస్వాధీనముచేసి కొనుటకున్ను జెప్పఁబడినది. ఈ గురుగీతను వస్త్రాసనమునందుజపించిన యెడల దారిద్ర్యమున్ను, రాతియందు జపించెనేని రోగోత్పత్తియున్ను భూమియందాసనములేకుండా జపించిన యెడల దుఃఖమును గలుగుచు న్నది. కొయ్యయందు జపించిన యెడల నిష్ఫలమగుచున్నది, కృష్ణాజి నమునందు జపించెనేని జ్ఞానసిద్ధియును, వ్యాఘ్రచర్మమునందు జపము చేసినయెడల మోక్షసంపదయును, దర్భాసనమునందు జపించిన యెడల జ్ఞానప్రాప్తియును, కంబళియందు జపించినయెడల సర్వసిద్ధియును గలు గుచున్నది.

శ్లో॥ ఆగ్నేయ్యాంకర్షణంచైవ । వాయవ్యాంశత్రునాశనం ।
నైరుత్యాందర్శనంచైవ । ఈశాన్యాంజ్ఞానమేవచ ॥ ౧౯౮॥

శ్లో॥ ఉదఙ్ముఖశ్శాంతిజాప్యే । వశ్యేపూర్వముఖస్థథా ।
యామ్యేతుమారణంప్రోక్తం । పశ్చిమేచధనాగమః॥ ౧౯౯॥

శ్లో॥ మోహనంసర్వభూతానాం । బంధమోక్షకరంపరం ।
దేవరాజప్రియకరం । రాజానంవశమానయేత్ ॥ ౨౦౦॥

టీక॥ ఆగ్నేయ్యాం=ఆగ్నేయపుదిక్కుముఖముగా గూర్చుండిజపించుట

చేత, కర్షణంచైవ=శత్రుజయమును, వాయవ్యాం=వాయవ్యపు దిక్కు ముఖముగాఁగూర్చుండిజపించుటచేత, శత్రునాశనం=శత్రు సంహారము ను, నైరుత్యాం=నైరుతీమూల ముఖముగాగూర్చుండి జపించుటయందు, దర్శనంచైవ=మంత్రాధిష్ఠానదేవతా దర్శనమున్ను, ఈశాన్యాం = ఈశా న్యమూల ముఖముగా గూర్చుండి జపించుటయందు, జ్ఞానమేవచ= పర బ్రహ్మజ్ఞానమున్ను,) భవతి=కలుగుచున్నది. శాంతిజాప్యే = శాంతము గాజపించుటయందు,ఉదఙ్ముఖః=ఉత్తరముఖముగలవాడుగాను,వశ్యే= జనవశ్యమునందు, తథా=ఆప్రకారము,పూర్వముఖః = తూర్పుముఖము గలవాడుగాను, (తిష్ఠేత్ =ఉండవలయును), యామ్యేతు=దక్షిణముఖ ముగా జపించుటయందైతే, మారణం=శత్రుమారణము, ప్రోక్తం=చె ప్పఁబడినది, పశ్చిమేచ=పడమరముఖముగా జపించుటయందు, ధనాగ మః =ధనముయొక్క పొందుటయును, (భవతి = అగుచున్నది.) సర్వ భూతానాం=సమస్తజీవులకును, మోహనం=భ్రమింపజేయునదియును, పరం=మిక్కిలి, బంధమోక్షకరం=బంధమోక్షములను జేయునదియును, దేవరాజప్రియకరం=దేవరాజ=ఇంద్రునకు, ప్రియకరం = ఇష్టమునుగ లుగఁజేయునదియునై, రాజానం=ప్రభువును, వశం=స్వాధీనమును, ఆన యేత్ = పొందించును.

తా ॥ ఓ పార్వతీ! ఈగురుగీత. ఆగ్నేయముఖముగా జపించినయెడల శత్రువునకు బాధయున్ను, వాయువ్యముఖముగా జపించినయెడల శత్రు నాశనమున్ను, నైరుతిముఖముగా జపించెనేని మంత్రదేవతా దర్శనము న్ను, ఈశాన్యముఖముగా జపించినయెడల పరబ్రహ్మజ్ఞానమున్ను గలు గుచున్నది. శాంతరూపమైన జపమునకు ఉత్తరముఖముగాను, జనవశ్య మునకు తూర్పు ముఖముగానుండి జపించ వలయును, శత్రు మారణ మునకు దక్షిణ ముఖముగాను, ధనాగమమునకు పశ్చిమ ముఖముగాను, జపించవలయును. ఇట్లుగురుగీతసమస్తజీవులకుమిక్కిలి బంధమోక్షముల

ను మోహనమును గలుగఁ జేయుచు దేవేంద్రునకు ప్రీతికరమై రాజవ
శ్యమునుగలుగఁజేయును.

శ్లో॥ ముఖస్తంభకరంచైవ। గుణానాంచవివర్ధనం।
దుష్కర్మనాశనంచైవ। తథాసత్కర్మసిద్ధిదం॥ ౨౦౧॥

టీక॥ ముఖస్తంభకరంచైవ = ముఖస్తంభమును జేయునదియును, (గురుగీతాజపము చేసెడివానిముఖమును జూచుటతోనే, ఎదిరిముఖమును చలించకుండాస్తంభింపఁజేయును,) గుణానాంచ =మంచిగుణములను, వివర్ధనం=వృద్ధిపొందించున్నదియును, దుష్కర్మనాశనంచైవ=దుష్కర్మ =చెడుకర్మను, నాశనంచైవ=నశింపఁజేయునదియును, తథా=ఆప్రకారము, సత్కర్మసిద్ధిదం=సత్కర్మ=మంచికర్మయొక్క, సిద్ధిదం=ప్రాప్తించునటులఁజేయుచున్నది.

తా॥ ఈగురుగీత, జపము చేసెడివానిముఖము చూచుటతోనే, యెదిరిముఖమును స్తంభింపఁజేయునదియును, సద్గుణములయొక్క వృద్ధిచేయునదియును, చెడుపనులను నశింపఁజేయునదియును, ఆప్రకారమే మంచి కార్యములను సిద్ధింపఁజేయునదియునగుచున్నది

శ్లో॥ అసిద్ధంసాధయేత్కార్యం। నవగ్రహభయాపహం।
దుస్స్వప్ననాశనంచైవ। సుస్వప్నఫలదాయకం॥ ౨౦౨

టీక॥ అసిద్ధం=నెఱవేరని,కార్యం=పనిని,సాధయేత్=నెఱవేర్చును. నవగ్రహభయాపహం = నవగ్రహ = సూర్యాది నవగ్రహములవల్లనైన, భయ=భీతిని, అపహం=పోఁగొట్టునదియును, దుస్స్వప్ననాశనంచైవ= చెడుస్వప్నములను నశింపఁజేయునదియును, సుస్వప్నఫలదాయకం = సుస్వప్న=మంచి స్వప్నములయొక్క, ఫల=ఫలమును, దాయకం = ఇచ్చునదియును, (భవతి=అగుచున్నది),

తా॥ ఈగురుగీతను జపించిన యెడల, సిద్ధించని కార్యములను సిద్ధింపఁజేయును, సూర్యాది నవగ్రహములవల్లనైన భయమును బోఁగొట్టును, చెడుస్వప్నములను నశింపఁజేయును, మంచి స్వప్నములయొక్క ఫలముల నిచ్చును.

శ్లో ॥ సర్వశాంతికరంనిత్యం । తథావంధ్యాసుపుత్రదం ।
అవైధవ్యకరంస్త్రీణాం । సౌభాగ్యస్యవివర్ధనం॥ ౨౦౩॥

టీక ॥ నిత్యం=ఎల్లప్పుడు, సర్వశాంతికరం=సర్వ=సమస్తమైనవాటి ని, శాంతికరం=శమింపఁజేయునదియును, తథా = ఆప్రకారముగానే, వంధ్యాసుపుత్రదం=వంధ్యా=గొడ్డాలికి, సుపుత్రదం = మంచి పుత్రుల నిచ్చునదియును, స్త్రీణాం=స్త్రీలకు, అవైధవ్యకరం = విధవరికము లేక యుండుటయును, సౌభాగ్యస్య=సుభగత్వమును, వివర్ధనం=వృద్ధిపొందిం చునదియును, (భవతి=అగుచున్నది).

తా ॥ ఈగురుగీతను యెల్లప్పుడును జపించినవారికి సమస్తదెుగు లను శాంతిపఱచును, గొడ్డాలికిసహితము మంచి పుత్రులనిచ్చును, పు ణ్యస్త్రీలకువిధవరికమును బోఁగొట్టును, సకలసౌభాగ్యములనొసంగును.

శ్లో ॥ ఆయురారోగ్యమైశ్వర్యం । పుత్రపౌత్రవివర్ధనం ।
నిష్కామజాపీవిధవా । పఠన్మోక్షమవాప్నుయాత్ ॥ ౨౦౪॥

టీక ॥ ఆయుః=ఆయుస్సును, ఆరోగ్యం=ఆరోగ్యమును, (రోగము లే కసుఖముగానుండుటను),ఐశ్వర్యం=సంపదను, పుత్రపౌత్రప్రవర్ధనం= పు త్ర = కుమారులను, పౌత్ర=మనుమలను, వివర్ధనం = వృద్ధిపొందించునది యును, (భవతి=అగుచున్నది), నిష్కామజాపీ=నిష్కామ=కోరిక లేకుం డా, జాపీ=జపముచేయుచున్న, విధవా=గతభర్తృక, పఠేత్ =పఠించె నేని, మోక్షం=మోక్షమును, అవాప్నుయాత్ =పొందును.

తా ॥ ఈగురుగీతను జపించుటచేత ఆయుస్సును, ఆరోగ్యమును ఐశ్వర్యమును పుత్రులును పౌత్రులును వృద్ధిపొందుదురు. విధవస్త్రీలైన ను సదా జపించుటచేత మోక్షమునుబొందుదురు.

శ్లో ॥ అవైధవ్యంసకామాతు । లభతేచాన్యజన్మని ।
సర్వదుఃఖభయంవిఘ్నం । నాశయేత్తాపహారకం॥ ౨౦౫॥

టీక॥ సకామాతు = కోరికతోఁ గూడుకొనినదాయెనేని, అన్యజన్మ ని = ఇంకొకజన్మమునందు, అవైధవ్యంచ=విధవత్వము లేక పోవుటను, లభతే=పొందుచున్నది, సర్వదుఃఖభయం=సర్వ= సమస్తములైన, దుః

ఖ=దుఃఖముల యొక్క, భయం=భీతిని, విఘ్నం = విఘ్నములను, నాశయేత్ =నశింపఁజేయునదియును, తాపహారకం=తాప= సంతాపమును, హారకం=హరింపఁజేయునదియును, (భవేత్ =అగును),

తా ॥ విధవ స్త్రీ కోరికగలదియై యీగురుగీతనుజపించెనేని, ఇంకొకజన్మమున సుమంగళిగానుండును, ఈ గురుగీత సమస్త దుఃఖములను భయమును సంతాపమును బోఁగొట్టును.

శ్లో॥ సర్వపాపప్రశమనం । ధర్మకామార్థమోక్షదం ।
యంయంచిన్తయతేకామం । తంతంప్రాప్నోతినిశ్చితం॥ ౨౦౬॥

టీక ॥ సర్వపాపప్రశమనం=సర్వ=సమస్తములైన, పాప=దోషములను, ప్రశమనం = నశింపఁజేయునదియును, ధర్మకామార్థ మోక్షదం= ధర్మ=ధర్మమును, కామ=కామమును, అర్థ = ధనమును, మోక్ష = ముక్తిని, దం=ఇచ్చునదియును, (భవతి=అగుచున్నది), యంయం= ఏయే, కామం=కోరికను, చిన్తయతే=తలంచుచున్నాఁడో; తంతం= ఆయాకోరికలను, నిశ్చితం=నిశ్చితమగునట్లు, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తా ॥ ఈ గురుగీత సమస్తపాపములను నశింపఁజేయునదియును, ధర్మార్థ కామమోక్షముల నిచ్చునదియునగును, ఏయేకోరికల నుద్దేశించి చేయుచుఁన్నాఁడో, ఆయాకోరికలను బొందుచున్నాఁడు.

శ్లో ॥ కామ్యానాంకామధేనుర్వై । కల్పతేకల్పపాదపః ।
చిన్తామణిశ్చింతితస్య । సర్వమంగళకారకం॥ ౨౦౭॥

టీక ॥ కామ్యానాం=కోరఁదగినవాటిని, వై=ప్రసిద్ధముగా, కామధేనుః=కామధేనువును, కల్పపాదపః=కల్పవృక్షమునై, కల్పతే= సృష్టించుచున్నది; చిన్తితస్య=తలంపఁబడినదానికి, చిన్తామణిః = చింతామణియై, సర్వమంగళకారకం=సర్వ=సమస్తములైన, మంగళ=శుభములను, కారకం=చేయునది, (భవతి=అగుచున్నది).

తా ॥ ఈ గురుగీత జపించెడివారల యొక్క కామ్యములన్నిఁటినిప్రసిద్ధమగు కామధేనువును కల్పవృక్షమునై సృజించుచున్నది. తలంచఁబడినదానికి చింతామణియై సమస్త శుభములను జేయుచున్నది.

శ్లో॥ లిఖిత్వాపూజయేద్యస్తు । మోక్షశ్రియమవాప్నుయాత్ ।
గురుభక్తిర్విశేషేణ । జాయతేహృదిసర్వదా॥ ౨౦౮॥

టీ॥ యస్తు=ఎవడైతే,లిఖిత్వా=(గురుగీతను)వ్రాసి,పూజయేత్=పూజించునో;(సః=వాడు), మోక్షశ్రియం=మోక్షసంపదను,అవాప్నుయాత్=పొందును,సర్వదా=ఎల్లప్పుడును,హృది=హృదయమునందు,విశేషేణ=అధికముగా,గురుభక్తిః=గురువునందలిభక్తి, జాయతే=పుట్టుచున్నది.

తా॥ ఎవడు ఈ గురుగీతను లిఖించి పూజించునో: వాడు మోక్షసంపదను బొందుచున్నాడు. వాని యొక్క హృదయమునందు, ఎల్లప్పుడు విశేషముగా గురుభక్తిపుట్టుచున్నది.

శ్లో॥ జపన్తిశాక్తాస్సౌరాశ్చ । గాణాపత్యాశ్చవైష్ణవాః ।
శైవాఃపాశుపతాస్సర్వే । సత్యంసత్యంనసంశయః॥ ౨౦౯॥

టీక॥ శాక్తాః=శక్తిపూజచేయువారును,సౌరాశ్చ=సూర్యునిపూజించువారును,గాణాపత్యాః=గణపతినిపూజించెడువారును, వైష్ణవాః=విష్ణుపూజచేయువారును, పాశుపతాః=పశుపతినిపూజించెడువారును,శైవాః=శివార్చనచేసెడువారును, సర్వే=సమస్తమైనవారును, జపన్తి=జపించవలెను,సత్యంసత్యం=నిజమునిజము,నసంశయః=సందేహములేదు.

తా॥ శాక్తేయులును, సౌరులును, గాణాపత్యులును, వైష్ణవులును, శైవులును, పాశుపతులుసహా, అందఱును, ఈ గురుగీతను జపించవలయును. ఇది మిక్కిలి సత్యమైనది, ఇందుకు సందేహములేదు.

ఇతి శ్రీస్కాంధపురాణే ఉత్తరఖండే ఉమామహేశ్వర సంవాదే గురుగీతాయం ధ్యానాదివిధి ప్రశంస సంనామ తృతీయోధ్యాయః.

గద్య॥ ఇదిస్కాంధపురాణాంతర్గత ఉత్తరఖండమునందున్న
ఉమామహేశ్వర సంవాదమునందలి గురుగీతయందు
గురుమంత్రధ్యానాది విధి ప్రశంసనమును, శ్రీమద్భాగ
వత కృష్ణదేశిక ప్రభుస్వాములవారి ప్రియశిష్యుడైన
ఫీష్ఖానా శంకరరావుగారిచే టీకాతాత్పర్యములను
రచియింపంబడిన తృతీయాధ్యాయము.

స మా ప్త ము.



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

## సుజ్ఞానదీపము * గురుగీతలు.

### చతుర్థాధ్యయప్రారంభము.

శ్లో॥ అథకామ్యజపస్థానం । కథయామివరాననే ।
సాగరాంతేసరిత్తీరే । తీర్థేహరిహరాలయే ।

టీక ॥ అథ=అనంతరము, హేవరాననే=శ్రేష్ఠమైన ముఖముగల ఓ పార్వతీ, కామ్యజపస్థానం=కామ్య=కామ్యముకొఱకైన, జప= జపమునకు, స్థానం=ప్రదేశమును, కథయామి=చెప్పుచున్నాను, (శృణు=వినుము), సాగరాంతే=సముద్ర సమీపమునందును, సరిత్తీరే=సరిత్ = నదియొక్క,తీరే=గట్టునందును, తీర్థే=పెద్దలువసియించిన పుణ్య భూములయందును, హరిహరాలయే= త్రిమూర్త్యాత్మక స్వరూపుడైన సద్గురుని యొక్క ఆలయమందును, జపము చేయవలయును.

శ్లో॥ శక్తిదేవాలయేగోష్ఠే । సర్వదేవాలయేశుభే ।
వటస్యధాత్ర్యామూలేవా । మఠేబృందావనేతథా॥ ౨౧౧॥

శ్లో॥ పవిత్రేనిర్మలేదేశే । జపానుష్ఠానతోపివా ।
నిర్వేదనేనమౌనేన । జపంస్తోత్రంసమారభేత్ ॥ ౨౧౨॥

టీక ॥ శక్తిదేవాలయే=సర్వశక్తులు వశీకరమైయుండెడు సద్గురుని ఆలయమందును, గోష్ఠే=పసులదొడ్డియందును, శుభే=శుభమైన, సర్వదేవాలయే=పెద్దలుండెడు అన్ని స్థలములయందును, వటస్య = మఱ్ఱిచెట్టుయొక్కయు,ధాత్ర్యాః=ఉసిరిగచెట్టుయొక్కయు, మూలేవా=మొదటియందును, మఠే=సన్యాసులుండెడు మఠమునందును, తథా = ఆప్రకారము, బృందావనే = తులసీవనమునందును, పవిత్రే=పవిత్రమైన, నిర్మలే=స్వచ్ఛమగు, దేశే=దేశమునందును, జపానుష్ఠానతోవాపి=జప=

జపముయొక్క, అనుష్ఠానతోపివా = చేయుటవల్లనైనా, నిర్వేదనేన = దుఃఖరహితమైన, మౌనేన = మౌనముతో, (అనగా జిహ్వేంద్రియము తో), జపం=జపమును, స్తోత్రం=స్తుతినిన్ని, సమారభేత్ = ప్రారంభించ వలెను.

తా ॥ ఓ పార్వతీ! తరువాత కోరదగినపనులు నెఱవేరుటకుదగి నజపస్థానములను జెప్పుచున్నాను వినుము, సముద్ర సమీపమందును, నదీతీరమందును,పుణ్యభూములయందును, కేవలాత్మస్వరూపులైన సద్గు రుని-ఆలయమందును, చైతన్యస్వరూపులైన పెద్దలయొక్క గృహము లయందును, పసులదొడ్డియందును, ఆరూఢజ్ఞానులు వసియించెడు శు భములగు సమస్తయిండ్లయందును, మఱ్ఱిచెట్టుయొక్కయు, ఉసిరికచె ట్టుయొక్కయు మొదటను,యతీశ్వరులమఠములందును, బృందావనము నందును, నిర్మలమైనపవిత్రప్రదేశములయందును, జపము చేయుటనుండి యు, దుఃఖరహితమైన మౌనస్థితితో, జపమును, స్తోత్రమును జేయుటకు నుపక్రమించవలయును.

శ్లో ॥ జాప్యేనజయమాప్నోతి । జపసిద్ధిఫలంతథా ।
హీనంకర్మత్యజేత్సర్వం । గర్హితస్థానమేవచ ॥ ౨౧౩॥

టీక ॥ జాప్యేన=జపముచేయుటచేతను, జయం=జయమునున్ను, త థా=ఆప్రకారముగానే,జపసిద్ధిఫలం=జప=జపముయొక్క, సిద్ధినెరవేరు టవల్లనైన, ఫలం=లాభమును, ఆప్నోతి=పొందుచున్నాడు, సర్వం=స మస్తమైన, హీనం=తక్కువైన,కర్మ=కర్మలను, గర్హిత స్థానమేవచ=గ ర్హిత=నిందితమైన, స్థానమేవచ=ప్రదేశమును, త్యజేత్ =విడిచిపెట్టవ లయును.

తా ॥ జనుడు ఈ పూర్వముచెప్పిన స్థానములయందు జపముచే యుటచేత జయమును జపసిద్ధివల్లనైన ఫలమును బొందుచున్నాడు, నీ చకర్మములను, నింద్యస్థానములనువిడిచిపెట్టవలయును.

శ్లో ॥ శ్మశానభయభూమౌవా । వటమూలేచ కానసే ।
సిధ్యన్తికానకేమూలే । చూతవృక్షస్యసన్నిధౌ ॥ ౨౧౪॥

టీక ॥ శ్మశానభయభూమౌవా=శ్మశాన=కాటియందలి, భయభూమౌవా=భయంకరమగు ప్రదేశమందైనను, వటమూలేచ=మఱ్ఱిచెట్టు క్రిందనున్ను, కానసే=అడవియందును, కానకే=జయపాలవృక్ష సంబంధమైన, మూలే=మొదటియందును, చూతవృక్షస్య=మామిడిచెట్టుయొక్క, సన్నిధౌ=సమీపమునందును, (జపముచేయుటవలన, సమస్తకార్యములు), సిధ్యన్తి=నెఱవేరుచున్నవి.

తా॥ ఈ గురుగీతను శ్మశానమునందలి భయంకరమైన ప్రదేశమునందును, వటవృక్షములయొక్క మొదటియందును, అడవియందును జయపాలవృక్షముయొక్క మొదటియందును, మామిడిచెట్టు సమీపమునందును, జపించుటవలన సమస్తకార్యములును సిద్ధించుచున్నవి.

శ్లో ॥ పీతాసనంమోహనేతు । హ్యాసితంచాభిచారికే ।
జ్ఞేయంశుక్లంచశాంత్యర్థం । వశ్యేరక్తంప్రకీర్తితం ॥ ౨౧౫॥

టీక ॥ మోహనేతు= (జగత్తును) మోహపఱచుటయందు, పీతాసనం=పసుపు రంగుగల ఆసనమున్ను, అభిచారికే=ఇతరులకు హానిచేయునట్టిపనియందు), అసితంసా=నల్లనిఆసనమున్ను, శాంత్యర్థం=శాంతికొఱకు, శుక్లంచ=తెల్లని ఆసనమున్ను, జ్ఞేయం=తెలిసికొనఁదగినది, వశ్యే=జనవశ్యమునందు, రక్తం=ఎఱ్ఱని ఆసనమున్ను! ప్రకీర్తితం=చెప్పఁబడినది.

తా ॥ ఈగురుగీతను జపించుటయందు జగత్తును మోహపఱచుటకు, పచ్చని ఆసనమున్ను, పరులకు హింసచేయుటకు నల్లని ఆసనమున్ను, శాంతికొఱకు తెల్లని ఆసనమున్ను, జనవశ్యమునకు ఎఱ్ఱని ఆసనమున్ను జెప్పఁబడినవి.

శ్లో॥ జపంహీనాసనేకుర్వ౯ । హీనకర్మఫలప్రదం ।

గురుగీతాంప్రయాణేవా । సంగ్రామేరిపుసంకటే ॥ ౨౧౬॥

శ్లో॥ జపన్జయమవాప్నోతి । మరణేముక్తిదాయికాం ।

సర్వకర్మాణిసిధ్యన్తి । గురుపుత్రేనసంశయః ॥ ౨౧౭॥

టీక ॥ హీనాసనే=తక్కువ ఆసనమునందు, ఫలప్రదం=ఫలమును నిచ్చెడి, జపం=జపమును, కుర్వ౯=చేయుచు, హీనకర్మా=తక్కువకర్మగలవాడు, (భవతి=అగుచున్నాడు), మరణే=చావునందు, ముక్తిదాయికాం=మోక్షమును ఇచ్చెడు, గురుగీతాం=గురుగీతను, ప్రయాణేవా =ప్రయాణమందైనను, రిపుసంకటే=రిపు=శత్రువులచేతను, సంకటే= బాధగల, సంగ్రామే=యుద్ధమందైనను, జప౯=జపించుచు, జయం= జయమును, ఆప్నోతి=పొందుచున్నాడు, గురుపుత్రే=గురుపుత్రుని విషయమై, సర్వకర్మాణి=అన్నిపనులును, సిద్ధ్యన్తి=నెఱవేరుచున్నవి, న సంశయః=సందేహము లేదు.

తా ॥ జనుడు తక్కువ ఆసనమునందు ఫలమును ఇచ్చెడు జపమును జేయుచు హీనకర్మగలవాడగుచున్నాడు. మరణమునందు మోక్షము నొసంగును గురుగీతను ప్రయాణమునందును, శత్రువులచే సంకటముగు యుద్ధమునందును జపించినయెడల జయమునుబొందుచున్నాడు, ఇట్లు గురూపదేశమును బొంది గురుగీతను జపించెడు గురుపుత్రునివిషయమై కార్యములన్నియు నెఱవేరుచున్నవి. ఇందు కెంతమాత్రమును సందేహము లేదు.

శ్లో ॥ గురుమంత్రంముఖేయస్య । తస్యసిధ్యన్తినాన్యథా ।

దీక్షాయాసర్వకర్మాణి । సిధ్యన్తిగురుపుత్రకే ॥ ౨౧౮॥

టీక ॥ యస్య=ఎవనియొక్క, ముఖే=ముఖమునందు, గురుమంత్రం= గురుమంత్రము, (అస్తి=కలదో); తస్య=వానియొక్క, (కార్యాణి=పనులు,)సిధ్యన్తి=నెఱవేరుచున్నవి, అన్యథా=ఇంకొకవిధముగా, న=సి

ర్ధించవు,గురుపుత్రకే=గురుపుత్రునివిషయమై,దీక్షయా = గురుమంత్ర దీక్షచేతను,సర్వకర్మాణి=సమస్తకర్మములును,సిధ్యన్తి=నెరవేరుచున్నవి

తా ॥ ఓ పార్వతీ! ఎవని ముఖమునందు గురుమంత్రమున్నదో; వానికి సమస్తపనులు నెఱవేరుచున్నవి, ఇంకొకవిధముగా నెఱవేరవు, గురుపుత్రునివిషయమై ఆ మంత్రదీక్షచేతనే, అన్నిపనులు నెఱవేరు చున్నవి,

శ్లో ॥ భవమూలవినాశాయ । చాష్టపాశనివృత్తయే ।
గురుగీతాంభసిస్నానం । తత్వజ్ఞఃకురుతేసదా ॥

టీ ॥ తత్వజ్ఞ=బ్రహ్మజ్ఞానము తెలిసినవాడు, భవమూలవినాశాయ =భవమూల=సంసారకారణముయొక్క, వినాశాయచ=నశించుటకును, అష్టపాశనివృత్తయే=అష్టపాశ=ఎనిమిది పాశములయొక్క, (దయ,జు గుప్స, మోహము, భయము, సంశయము, కులము, బలము, శీలము, ఇవియే అష్టపాశములు), నివృత్తయే=పోవుటకొఱకును, గురుగీతాంభ సి=గురుగీతయనెడు యుదకమునందు, స్నానం=స్నానమును, సదా = ఎల్లప్పుడు, కురుతే=చేయుచున్నాడు.

తా॥ తత్వజ్ఞుడు సంసారకారణమగు అజ్ఞానము నశించుటకును, అష్టపాశములు పోవుటకును, ఎల్లప్పుడుగురుగీతయనెడుయుదకమునందు స్నానమును చేయుచున్నాడు.

శ్లో ॥ స ఏవసద్గురుస్సాక్షాత్ । సదసద్బ్రహ్మవిత్తమః ।
తస్యస్థానానిసర్వాణి । పవిత్రాణినసంశయః॥          ౨౨౦॥

టీక॥ సదసద్బ్రహ్మవిత్తమః=సదసత్=సదసత్స్వరూపమైన, బ్రహ్మ =పరబ్రహ్మస్వరూపమును, విత్తమః=మిక్కిలి తెలిసినవాడగు, స ఏవ= వాడే=సాక్షాత్=ప్రత్యక్షముగా, సద్గురుః=సద్గురువు, (భవతి=అగుచు న్నాడు), తస్య=వానియొక్క, సర్వాణి=సమస్తములైన, స్థానాని=ప్ర దేశములు, పవిత్రాణి=పవిత్రములైనవి, (భవన్తి=అగుచున్నవి), నసం శయః=సందేహము లేదు.

తా ॥ సదసత్స్వరూపమైన పరబ్రహ్మమును తెలిసినవాడే ప్రత్యక్షముగా సద్గురువు, వాని యొక్క నివాసస్థానములన్నియును పవిత్రము లగుచున్నవి. అందు కేమియును సందేహము లేదు.

శ్లో ॥ సర్వశుద్ధః పవిత్రోసౌ । స్వభావాద్యత్రతిష్ఠతి ।
తత్రదేవగణాస్సర్వే । క్షేత్రపీఠే చరన్తిచ॥ ౨౨౧॥

టీక ॥ సర్వశుద్ధః=అన్నిటిలో పరిశుద్ధుడును, పవిత్రః=పవిత్రమైన వాడునగు, అసౌ=ఆజనుడు, యత్ర=ఎక్కడ, స్వభావాత్ = ప్రకృతివలన, తిష్ఠతి=ఉంచున్నాడో; తత్ర=ఆ, క్షేత్రపీఠే = నివాసమైన పీఠము నందు, సర్వే=సమస్తములైన, దేవగణాః = దేవసమూహములు, చరన్తిచ=ఉంచున్నారు.

తా॥ అన్నిటిలో పరిశుద్ధుడునుపవిత్రుడునగు సద్గురుడుసహజముగా నెక్కడనుండునో, ఆగృహమునందలి, పీఠమునందు, సమస్త దేవగణములును ఉంచున్నవి.

శ్లో ॥ ఆసనస్థాశ్శయానావా । గచ్ఛన్తస్తిష్ఠతోపివా ।
అశ్వారూఢాగజారూఢాః । సుషుప్తాజాగ్రతోపివా॥ ౨౨౨॥

శ్లో ॥ శుచిర్భూతాజ్ఞానవన్తో । గురుగీతాంజపన్తియే ।
తేషాందర్శనసంస్పర్శాత్ । పునర్జన్మనవిద్యతే॥ ౨౨౩॥

టీక॥ ఆసనస్థాః = ఆసనమందున్నవారైనను, (కూర్చున్నవారును), శయానావా=శయనించినవారైనను, గచ్ఛన్తః=నడుచుచున్న వారైనను, తిష్ఠతోపివా=నిలుచున్నవారైనను, అశ్వారూఢాః = గుఱ్ఱములను యెక్కినవారైనను, గజారూఢాః=ఏనుగులనుయెక్కినవారైనను, సుషుప్తాః=నిద్రించియున్నవారైనను, జాగ్రతోపివా = మేలుకొనియున్న వారైనను, యే = ఎవరు, శుచిర్భూతాః = పరిశుద్ధమైన వారును, జ్ఞానవన్తః=జ్ఞానముగలవారునై, గురుగీతాం=గురుగీతను, జపన్తి = జపము చేయుచున్నారో; తేషాం=వారలయొక్క, దర్శనసంస్పర్శనాత్ =

దర్శన=చూచుటవల్లనున్ను, సంస్పర్శనాత్ = తాకుటవల్లనున్ను, పునర్జన్మ=తిరుగాపుట్టడము, నవిద్యతే= లేదు.

తా ॥ ఎవరు కూర్చుండినను శయనించినను నడుచుచున్నను నిలుచున్నను గుఱ్ఱములను నెక్కినను ఏనుఁగు నెక్కినను నిద్రించినను మేలుకొనియున్నను పరిశుద్ధులును జ్ఞానులును, గురుగీతను జపించుచున్నారో; అట్టిజనుల యొక్క దర్శనస్పర్శనములవలన, మఱలజన్మము లేక, ముక్తులగుచున్నారు.

శ్లో ॥ సముద్రేవైయథాతోయం । క్షీరేక్షీరంజలేజలం ।
భిన్నేకుంభేయథాకాశం । తథాత్మాపరమాత్మని ॥ ౨౨౪॥

టీక॥ తోయం=ఉదకము, సముద్రే = సాగరమునందును, క్షీరం = పాలు, క్షీరే=పాలయందును, జలం=ఉదకము, జలే=ఉదకమునందును, యథావై=ఏప్రకారముగానో; భిన్నే = పగిలిపోయిన, కుంభే= కుండయందు, ఆకాశం=ఆకాశము, యథా = ఏప్రకారమో: తథా= ఆప్రకారము, ఆత్మా=జీవాత్మ, పరమాత్మని=పరమాత్మస్వరూపమే, (భవతి =అగుచున్నది.

తా ॥ సముద్రము నందుదకమును, పాలయందు పాలును నీళ్లయందునీళ్లును, పగిలిపోయిన కుండయందలి ఆకాశము, మహాకాశ మునందును, నెటులనైక్యమునుబొందునో-అప్రకారముగానే,జీవాత్మపరమాత్మయందుఁగలసి యేకత్వమును బొందుచున్నాడు.

శ్లో ॥ తథైవజ్ఞానవాఞ్జీవః । పరమాత్మనిసర్వదా ।
ఐక్యేనరమతేజ్ఞానీ । యత్రకుత్రదివానిశం ॥ ౨౨౫॥

టీక॥ జ్ఞానవాన్=పరమాత్మజ్ఞానముగల, జీవః = జీవుడు, పరమాత్మని=పరమాత్మయందు, సర్వదా=ఎల్లప్పుడును, తథైవ=ముందు చెప్పినప్రకారముగానే, (భవతి=అగుచున్నాడు,) జ్ఞానీ = పరమాత్మజ్ఞానముగలవాడు, యత్రకుత్ర = ఎక్కడెక్కడనైనను, దివానిశం = రాత్రింబ

గళ్లయందు, ఐక్యేన=పరమాత్మైక్యముతో, (పరమాత్మతోఁజేరి యొకటియై,) రమతే=క్రీడించుచున్నాఁడు.

తా॥ పరమాత్మజ్ఞానముగల జీవుడు ఎల్లప్పుడును పూర్వ శ్లోకమునందు జెప్పిన, తోయక్షీరములు మొదలైనవియెట్లు, ఏకత్వమునుబొందునవియో-ఆప్రకారముగా నేపరమాత్మయందైక్యమునుబొందు చున్నాడు, బ్రహ్మజ్ఞానముగల జనుడు, ఏయే ప్రదేశములయందైనను, రాత్రింబగళ్లయందును, పరమాత్మతోఁజేరి, ఆనందించుచున్నాడు.

శ్లో॥ ఏవంవిధోమహాయుక్తః । సదాసర్వత్రవర్తతే ।
తస్మాత్సర్వప్రకారేణ । గురుభక్తింసమాచరేత్ ॥ ౨౨౬॥

టీక ॥ ఏవంవిధః=ఈప్రకారమైనవాడు, మహాయుక్తః=మహాత్స్వరూపమగు పరమాత్మతోఁగూడుకొనినవాడై, సదా=ఎల్లప్పుడు, సర్వత్ర=అంతటను, వర్తతే=ప్రవర్తించుచుండును, తస్మాత్ = అందువలన, సర్వప్రకారేణ = అన్నివిధములచేతను, గురుభక్తిం = గురువు నందలి భక్తిని, సమాచరేత్ = చేయవలయును.

తా ॥ ఈ పూర్వము చెప్పిన ప్రకారము పరమాత్మ జ్ఞాము గల జనుడు మహాత్స్వరూపమైన పరమాత్మతోఁ గూడుకొనినవాడై అన్ని స్థలములయందును నుండునుగనుక, సర్వప్రకారముల చేతను సద్గురుని యందు భక్తిని బాగుగా ఆచరించ వలయును.

శ్లో ॥ గురుసంతోషణాదేవ । ముక్తోభవతిపార్వతి ।
అణిమాదిషుభోక్తృత్వం । కృపయాదేవిజాయతే ॥ ౨౨౭॥

టీక॥ హే పార్వతి=ఓపార్వతీ, (జనః=జనుడు, గురుసంతోషణాదేవ=గురు=గురువుయొక్క, సంతోషణాదేవ=సంతోషమునుండియే, ముక్తః=ముక్తుడు, భవతి = అగుచున్నాడు, హేదేవి=ఓ పార్వతీ, కృపయా=దయచేతను, అణిమాదిషు = అణిమయనునది మొదలైన అష్టసిద్ధులయందును, భోక్తృత్వం=భోక్తృత్వము, (వాటినన్నిఁటిని యనుభవించుట,) జాయతే=కలుగుచున్నది.

తా ॥ ఓ పార్వతీ జనుడు గురువును సంతోషపెట్టుటచేతనే ముక్తుడగుచున్నాడు. ఓ పార్వతీ అట్టి సద్గురునికృపచేతనే మనుజుడు అణిమాది యష్టసిద్ధు లనుభవించును.

శ్లో ॥ సామ్యేనరమతేజ్ఞానీ । దివావాయదివానిశి ।
ఏవంవిధోమహామౌనీ । త్రైలోక్యసమతాంవ్రజేత్ ॥ ౨౨౮॥

టీక॥ జ్ఞానీ=బ్రహ్మజ్ఞాని, దివావా=పగటియందైనను, నిశివాయది=రాత్రియందైనను, సామ్యేన = సమభావముతో, రమతే = క్రీడించుచున్నాడు, ఏవంవిధః=ఈప్రకారమైన, మహామౌనీ=గొప్ప మౌనము గల జ్ఞాని, త్రైలోక్యసమతాం=మూడులోకములకు సమభావమును, వ్రజేత్ =పొందును.

తా ॥ బ్రహ్మజ్ఞాని పగటియందైనను రాత్రియందైనను సమభావముతో క్రీడించును, అట్టిమహామౌనియగు వాడు మూడులోకములయందు సమభావమును బొందుచున్నాఁడు.

శ్లో ॥ అథసంసారిణస్సర్వే । గురుగీతాజపేనతు ।
సర్వాన్ కామాంస్తు భుంజన్తి । త్రిసత్యంమమభాషితం॥ ౨౨౯॥

టీక ॥ అథ=మరియు, సర్వే=సమస్తములైన, సంసారిణః=సంసారులును, గురుగీతాజపేనతు=గురుగీతా=గురుగీతయొక్క, జపేనతు=జపముచేతనే, సర్వాన్=సమస్తములైన, కామాంస్తు = కోరికలన్నియును భుంజన్తి=అనుభవించుచున్నారు. మమ=నాచేతను, భాషితం= చెప్పఁబడినది, త్రిసత్యం=త్రి=మూటిచేత, సత్యం=యథార్థమైనది.

తా ॥ ఇంకా సంసారులందఱును గురుగీతనుజపించుటచేతనే, సమస్తకోరికలను అనుభవించుచున్నారు. ఓ పార్వతీ ఇట్లు నాచేతఁ జెప్పఁబడిన, ఇది, కాయిక, వాచిక, మానసికముల యొక్క, మూటి తోను యదార్థమైనదిగాను నున్నది.

శ్లో ॥ సత్యంసత్యంపునస్సత్యం । ధర్మసాంఖ్యంమయోదితం ।
గురుగీతాసమంస్తోత్రం । నాస్తితత్వంగురోఃపరం ॥ ౨౩౦॥

టీక॥ మయా=నాచేతను, ఉదితం=చెప్పఁబడిన, ధర్మసాంఖ్యం = ధర్మ=న్యాయముతోనైన, సాంఖ్యం=జ్ఞానము, సత్యం=యథార్థమైనది, సత్యం=యథార్థమైనది, పునః=తిరుగ, సత్యం=యథార్థమైనది, గురుగీతాసమం=గురుగీతా=గురుగీతతో,సమం=సమానమైన, స్తోత్రం=స్తోత్రమును, గురోః=గురువుకంటె, పరం=శ్రేష్ఠమైన, తత్వం = పరమాత్మ స్వరూపమును, నాస్తి=లేదు.

తా ॥ ఓపార్వతీనాచేతఁజెప్పఁబడిన న్యాయముచేతనైన జ్ఞానము సత్యము, సత్యము, సత్యము, ఈగురుగీతతో సమానమైన స్తోత్రమును గురువుకంటెను శ్రేష్ఠమైనపరమాత్మ స్వరూపమును లేదు.

శ్లో ॥ గురుర్దేవోగురుర్ధర్మో । గురుర్నిష్ఠాపరంతపః ।
గురోఃపరతరంనాస్తి । త్రివారంకథయామి తే ॥ ౨౩౧॥

టీక॥ గురుః=గురువే, దేవః=దేవుడు, గురుః = గురువే, ధర్మః = ధర్మము, గురుః=గురువే, నిష్ఠాపరం=ధ్యానాధీనమగు, తపః = తపస్సు, గురోః=గురువుకంటెను, పరతరం=మిక్కిలిశ్రేష్ఠమైనది, నాస్తి= లేదు, (అని,) త్రివారం=ముమ్మాటికిని, తే=నీకు, కథయామి=చెప్పుచున్నాను.

తా ॥ గురువేదైవము, గురువే ధర్మము, గురువే ధ్యానాధీన మగు తపస్సు, గురువుకంటెను శ్రేష్టమైనదేదియును లేదని ముమ్మాటికి నీకు చెప్పుచున్నాను ఓ పార్వతీయని ఈశ్వరుఁడు పలికెను.

శ్లో ॥ ధన్యామాతాపితాధన్యో । గోత్రంధన్యంకులంభవం ।
ధన్యాచవసుధాదేవి । యత్రస్యాద్గురుభక్తతా ॥ ౨౩౨॥

టీక॥ యత్ర=ఎవనియందు, గురుభక్తతా=గురువుయందు భక్తికలుగుట, స్యాత్=అగునో, (తస్య=వానియొక్క,) మాతా=తల్లి, ధన్యా =పుణ్యాత్మురాలు, పితా=తండ్రి, ధన్యః=పుణ్యాత్ముడు, గోత్రం= పేరును, కులం=వంశమును భవం=జన్మమును, ధన్యం = పుణ్యమైనది, హేదేవీ=ఓ పార్వతీ, వసుధా చ=భూమియును, ధన్యా=పుణ్యమైనది.

తా ॥ ఓపార్వతీ! ఎవనికి గురువునందు పూజ్యానురాగత కలుగునో; వానితల్లి పుణ్యాత్మురాలు, వానితండ్రిపుణ్యాత్ముడు, వాని యొక్క పేరును, కులమును, జన్మమును, వాడుండెడు భూమియును పుణ్యమైనదిగా అగుచున్నది.

శ్లో ॥ ఆకల్పజన్మకోటీనాం । యజ్ఞవ్రతతపఃక్రియాః ।
తాస్సర్వాస్సఫలా దేవీ । గురుసంతోషమాత్రతః ॥ ౨౩౩॥

టీక॥ హే దేవీ=ఓపార్వతీ,ఆకల్పజన్మకోటీనాం, ఆకల్ప=బ్రహ్మకల్ప పర్యంతముకలిగెడి,జన్మ=పుట్టుకల యొక్క,కోటీనాం=కోట్లలోపలి, యజ్ఞవ్రతతపఃక్రియాః=యజ్ఞ=యాగము యొక్కయు, వ్రత= నియమముల యొక్కయు, తపః=తపస్సు యొక్కయు,క్రియాః=కర్మములు, (యాః= ఏవియో),తాః=ఆ,సర్వాః = సమస్తములైనక్రియలును, గురుసంతోష మాత్రతః=గురు=గురువు యొక్క,సంతోషమాత్రతః = సంతోషమువల్లనే, సఫలాః=సంపూర్ణములైనవి,(నెఱవేరినవి), భవన్తి= అగుచున్నవి),

తా ॥ ఓపార్వతీ బ్రహ్మకల్పమువరకుండెడియనేక జన్మములలో పలియాగవ్రతతపోక్రియలేవియో, యవియన్నియును గురుసంతోషమాత్రమువల్లనే సఫలములగుచున్నవి.

శ్లో ॥ శరీరమింద్రియంప్రాణ । మర్థస్వజనబంధుతాం ।
మాతుఃకులంపితృకులం । గురుమేవపరంస్మరేత్ ॥ ౨౩౪॥

టీక ॥ శరీరం=దేహమును, ఇంద్రియం = ఇంద్రియములును, (కన్ను చెవి మొదలైనవి) ప్రాణం=ప్రాణమును, అర్థస్వజనబంధుతాం = అర్థ= ధనమును, స్వజన=స్వజనమును, (సహోదరులు భార్యాపుత్రాదులు) బంధుతాం= బంధుత్వమును, (చుట్టఱికమును), మాతుః= తల్లి యొక్క, కులం = వంశమును, పితృకులం = తండ్రివంశమును, (వీటినన్నిఁటికిని), పరం=శ్రేష్ఠమైన, గురుమేవ=గురువునే, స్మరేత్ = స్మరించవలయును.

తా॥ జనుడు శ్రేష్ఠుఁడగు గురువునే భజించి దేహమును చక్షురాదింద్రియములను, ప్రాణమును, ధనమును, సహోదరులు భార్యమొద

లైనవారిని, చుట్టములను, తల్లియొక్క వంశమును, తండ్రియొక్క వంశమును యివియన్నియును వర్థిల్లజేసుకొనుచున్నాడు.

శ్లో ॥ మందభాగ్యాహ్యశక్తాశ్చ । యేజనానానుమన్వతే ।
గురుసేవాంసవిముఖాః । పచ్యన్తేనరకేశుచౌ ॥ ౨౩౫ ॥

టీక ॥ మందభాగ్యాః=మంద=అల్పమైన, భాగ్యాః=అదృష్టముగలవారును, అశక్తాశ్చ=అసమర్థులును, సవిముఖాః = మిక్కిలివిరక్తులునగు, యేజనాః=ఏజనులు,గురుసేవాం=గురు=గురువుయొక్క, సేవాం=సేవను, నానుమన్వతేహి=తలంచరో; తే=వారు, అశుచౌ=అపరిశుద్ధమగు, నరకే=నరకమునందు, పచ్యన్తే=వండఁబడుచున్నారు.

తా ॥ ఓపార్వతీ! అల్పాదృష్టముగలవారును అసమర్థులును మిక్కిలి విరక్తులునగు ఏజనులు గురుసేవను దలంచరో, వారు అపరిశుద్ధమగు నరకమునందు వండఁబడుచున్నారు.

శ్లో ॥ విద్యాధనంబలంచైవ । తేషాంభాగ్యంనిరర్థకం ।
యేషాంగురుకృపానాస్తి । అధోగచ్ఛన్తిపార్వతి ॥ ౨౩౬॥

టీక ॥ యేషాం=ఎవరికి, గురుకృపా=గురువుయొక్కదయ, నాస్తి=లేదో, తేషాం=వారియొక్క, విద్యా=చదువును, ధనం=ధనమును, బలంచైవ=బలమును, భాగ్యం=అదృష్టమును, నిరర్థకం=వ్యర్థమైనది, హేపార్వతి=ఓపార్వతీ, (తే=వారు), అధోగచ్ఛన్తి=(అధో లోకమును బొందుచున్నారు).

తా ॥ ఓపార్వతీ; ఎవరికిగురుకృపలేదో,వారియొక్కచదువును,ధనమును, బలమును, అదృష్టమును వ్యర్థములైనవారలై అధోలోకమును బొందుచున్నారు.

శ్లో ॥ బ్రహ్మవిష్ణుశ్చరుద్రాశ్చ । దేవాశ్చపితృకిన్నరాః ।
సిద్ధచారణయక్షాశ్చ । అన్యేచమునయోజనాః ॥ ౨౩౭॥

టీక ॥ (గురురేవ=గురువే),బ్రహ్మ=బ్రహ్మయును,విష్ణుశ్చ=విష్ణువును రుద్రాశ్చ=ఏకాదశరుద్రులును, దేవాశ్చ=దేవతలును, పితృకిన్నరాః=

పితృ=పితృదేవతలును, కిన్నరాః=కిన్నరులును, సిద్ధచారణయక్షాశ్చ= సిద్ధ=సిద్ధులును, చారణ=చారణులును, యక్షాశ్చ=యక్షులును, అన్యే= ఇతరులగు, మునయః=మునులును, జనాశ్చ=జనులును, (భవతి= అగుచున్నాడు).

తా ॥ గురువే బ్రహ్మయును, విష్ణువును, రుద్రులును, దేవతలును పితృలును, కిన్నరులును, సిద్ధులును, చారణులును, యక్షులును, ఇతరులగుమునులును, జనులును వీరందరును-అగుచున్నాడు.

శ్లో ॥ గురుభావఃపరంతీర్థ । మన్యతీర్థంనిరర్థకం ॥
సర్వతీర్థమయందేవి । శ్రీగురోశ్చరణాంబుజం ॥ ౨౩౮॥

టీక॥ గురుభావః=గురు=గురువుయొక్క, భావః=దయారసము, పరం= శ్రేష్ఠమైన, తీర్థం=పుణ్యక్షేత్రము, అన్యతీర్థం=ఇతరమైన పుణ్యక్షేత్రము, నిరర్థకం=వ్యర్థమైనది, హేదేవి= ఓ పార్వతీ, శ్రీగురోః=ప్రకాశమానుఁడగుగురువుయొక్క, చరణాంబుజం=పాదపద్మములు, సర్వతీర్థమయం=సర్వ= సమస్తములైన. తీర్థ=పుణ్యక్షేత్రములయొక్క, మయం= స్వరూపమైనది.

తా ॥ గురువుయొక్కదయారసమేశ్రేష్ఠమైనపుణ్యక్షేత్రము, ఇతరమైనపుణ్యక్షేత్రమువ్యర్థమైనదిఓపార్వతీ! సద్గురువుయొక్కపాదపద్మములే, సమస్తమైనపుణ్యక్షేత్రస్వరూపముగానున్నది.

శ్లో ॥ కన్యాభోగరతామందాః । స్వకాంతాయాఃపరాఙ్ముఖాః ।
అతఃపరంమయాదేవి । కథితంనమమప్రియే ॥ ౨౩౯॥

శ్లో ॥ ఇదంరహస్యమస్పష్టం । వక్తవ్యంచవరాననే ।
సుగోప్యంచతవాగ్రేతు । మమాత్మప్రీతియేసతి ॥ ౨౪౦॥

శ్లో॥ స్వామిముఖ్యగణేశాద్యా । న్వైష్ణవాదీంశ్చపార్వతి ।
నవక్తవ్యంమహామాయే । పాదస్పర్శంకురుష్వమే ॥ ౨౪౧॥

టీక ॥ మందాః=అల్పులు, కన్యాభోగరతాః=కన్యా= కన్యకలయొక్క, భోగ=సంభోగమునందు, రతాః=ఆసక్తులై, స్వకాంతాయాః = స్వ=తమయొక్క, కాంతాయాః=ప్రియురాండ్రవలన,పరాఙ్ముఖాః=విరక్తులు, (భవన్తి=అగుచున్నారు). అతః=అందువలన, మమ=నాకు, ప్రియే=ఇష్టురాలవగు, హేదేవి=ఓపార్వతీ, మయా=నాచేతను,కథితం=చెప్పఁబడినది, పరం=శ్రేష్ఠమైనది, న=కాదు. హేవరాననే=శ్రేష్ఠమగు ముఖముగల,హేసతి=ఓపార్వతీ, తవ=నీయొక్క, అగ్రేతు = ముందరనైతే, మమ=నాయొక్క, ఆత్మప్రీతియే = మనస్సంతోషముకొఱకు, అస్పష్టం=స్ఫుటముకానిదియును, సుగోప్యంచ =మిక్కిలిమరుగుపరచఁదగినదియు, ఇదంరహస్యం = ఈరహస్యము, వక్తవ్యం=చెప్పదగినది. హేపార్వతి=ఓపార్వతీ, స్వామిముఖ్యగణేశాద్యాః=స్వామి=ఈశ్వరుడు, ముఖ్య=ప్రాధాన్యముగాగల, గణేశ=విఘ్నేశ్వరుడు, ఆద్యాః = మొదలైనవారినిన్ని, వైష్ణవాదీంశ్చ = విష్ణుసంబంధులు మొదలైన వార్లనున్ను, నవక్తవ్యం=చెప్పగూడదు. (వచించఁగూడదు) హేమహామాయే=గొప్పమాయాస్వరూపురాలవగు ఓ-పార్వతీ, మే=నాయొక్క,పాదస్పర్శం=పాద=చరణములయొక్క,స్పర్శం=తాకుటను,కురుష్వ=చేయుము.

తా ॥ ఓపార్వతీలోకమునందుమూఢులగువారు మదవతులగు కన్నియలయొక్క సంభోగమునందాసక్తులై తమప్రియురాండ్రయందువిరక్తులగుచున్నారు. గనుక అట్టి మూఢులకు నాచేతఁజెప్పఁబడినది శ్రేష్ఠమైనదికాదు. నాకు ప్రియురాలవగు నీముందరనైతే నామనసంతోషముకొఱకు మిక్కిలి మరుగుపరచఁదగినదియును అస్పష్టమునగు ఈరహస్యమునాచేతఁ జెప్పఁబడుచున్నది. ఏదియనిన, ఈశ్వరుఁడే ప్రాధాన్యముగాగల గణేశాదులనున్ను, విష్ణువే ప్రాధాన్యముగాగల వైష్ణవులు మొదలైనవారినిన్ని వచించఁగూడదు. నీవు నాపాదస్పర్శనుమాత్రమే చేయుమాయని ఈశ్వరుఁడుపలికెను.

శ్లో ॥ అభక్తేవంచకేధూర్తే । పాషండేనాస్తికాదిషు ।
మనసాపినవక్తవ్యా । గురుగీతాకదాచన ॥ ౨౮౨॥

టీక ॥ అభక్తే=భక్తుఁడుకానివానివిషయమునందును, వంచకే=మోసగానివిషయమునందును, ధూర్తే= దుర్మార్గునివిషయమునందును, పాషండే= పాషండునివిషయమునందును, (జటాకమండలుకాషాయాదులను, ధరించివేదనిషిద్ధుఁడగుక్షపణకమతస్థుఁడు), నాస్తికాదిషు=నాస్తిక=నాస్తికుఁడు, (దేవుఁడు లేదనిచెప్పెడివాఁడు). ఆదిషు= మొదలైననారివిషయమునందును, మనసాపి= మనస్సుతోనైనను, గురుగీతా = గురుగీత, కదాచన=ఎప్పుడును, నవక్తవ్యా=చెప్పఁగూడదు.

తా॥ఓపార్వతీ! ఈగురుగీత అభక్తునికొఱకును, వంచకునికొఱకును, ధూర్తునికొఱకును, పాషండునికొఱకును,నాస్తికులు మొదలైనవారికొఱకును, మనస్సుతోనైనా, ఎప్పుడును జెప్పఁగూడదు. (అనఁగా మనస్సులోనైన జెప్పవలదనిన్ని తలంచనేకూడదనిన్ని భావము).

శ్లో ॥ గురవోబహవస్సంతి । శిష్యవిత్తాపహారకాః ।
తమేకందుర్లభంమన్యే । శిష్యహృత్తాపహారకం ॥ ౨౭౩॥

టీక॥ శిష్యవిత్తాపహారకాః=శిష్య=శిష్యునియొక్క, విత్త = ధనమును, అపహారకాః=అపహరించెడి, బహవః=అనేకులగు, గురవః= గురువులు, సంతి = కలరు, శిష్యహృత్తాపహారకం=శిష్య = శిష్యునియొక్క హృత్ =హృదయమునందలి,తాప=సంతాపమును, హారకం=హరించెడి, ఏకం=ఒక్కఁడగు, తం=ఆగురువును, దుర్లభం=పొందుటకశక్యమైనవానినిఁగా, మన్యే=తలంచుచున్నాను.

తా॥ ఓపార్వతీ! శిష్యులధనమునుహరించెడి గురువులనేకులుగలరు. శిష్యులహృదయతాపమును హరించెడి ఒక్కఁడగు ఆగురువును బొందుటకశక్యమని తలంచుచున్నాను.

శ్లో చాతుర్యవాన్వివేకీచ । అధ్యాత్మజ్ఞానవాన్శుచిః ।
మానసంనిర్మలంయస్య । గురుత్వంతస్యశోభతే॥ ౨౭౪॥

టీక ॥ చాతుర్యవాన్=నైపుణ్యముగలవాడును, వివేకీచ= జ్ఞానము గలవాడును, అధ్యాత్మజ్ఞానవాన్ = పరమాత్మజ్ఞానముగలవాడునగు జనుడు, శుచిః=పరిశుద్ధుడు, (భవతి=అగుచున్నాడు), యస్య=ఎవనియొక్క, మానసం=మనస్సు, నిర్మలం= స్వచ్ఛమైనదో; తస్య = వానియొక్క, గురుత్వం=గురుత్వము, శోభతే=ప్రకాశించుచున్నది.

తా ॥ ఓపార్వతీ! నేర్పుగలజ్ఞానవంతుడగు పరబ్రహ్మజ్ఞాని, యే లోకమునందును పరిశుద్ధుడగుచున్నాడు. ఇదిగాక ఎవనిమనస్సు నిర్మలమైనదో, వానియొక్క గురుత్వమే ప్రకాశించుచున్నది.

శ్లో ॥ గురవోనిర్మలాశ్శాంతాః । సాధవోమితభాషిణః ।
కామక్రోధవినిర్ముక్తాః । సదాచారజితేంద్రియాః॥ ౨౮౫॥

శ్లో॥ కృతాయాంగురుభక్తేస్తు । వేదశాస్త్రానుసారతః ।
ముచ్యతేపాతకాద్ఘోరాత్ । గురుభక్తోవిశేషతః॥ ౨౮౬॥

టీక ॥ గురవః=గురువులు,నిర్మలాః=స్వచ్ఛమైనవారును, శాంతాః= శాంతులును, సాధవః=నెమ్మదిగలవారును, మితభాషిణః=స్వల్పముగా మాట్లాడెడివారును,కామక్రోధవినిర్ముక్తాః=కామక్రోధః=కామక్రోధములను, వినిర్ముక్తాః=విడిచినవారును, సదాచారాః=మంచియాచారముగలవారును, జితేంద్రియాః = జిత = జయింపబడిన, ఇంద్రియాః = ఇంద్రియములుగలవారును, (భవన్తి=అగుచున్నారు,) విశేషతః=అధికముగా, గురుభక్తః=గురువునందుభక్తిగలవాడు, వేదశాస్త్రానుసారతః= వేదశాస్త్రములయొక్క అనుసరణమువలన, కృతాయాః=చేయబడిన, గురుభక్తేస్తు=గురువునందలిభక్తివల్లనే, ఘోరాత్ = భయంకరమైన,పాతకాత్ =పాపములనుండి,(బ్రహ్మహత్యాదిపాపములనుండి),ముచ్యతే=విడువఁబడుచున్నాడు.

తా॥ గురువులు, నిర్మలులును,శాంతులును,సాధువులును, మితభాషులును, కామక్రోధరహితులును, సదాచారులును, జితేంద్రియులునగు ఘ

న్నారు. విశేషముగా గురువునందు భక్తిగలవాడు వేదశాస్త్రానుసారముగా చేయఁబడిన గురువులయందలి భక్తివల్లనే భయంకరములైన బ్రహ్మహత్యాది పాపములనుండి విడువఁబడుచున్నాడు.

శ్లో॥ దుస్సంగంచ పరిత్యజ్య । పాపకర్మ పరిత్యజేత్ ।
చిత్రచిహ్నమిదం యస్య । తస్య దీక్షా విధీయతే॥ ౨౮౭॥

టీక॥ దుస్సంగంచ=దుష్టసాంగత్యమును, పరిత్యజ్య=విడిచి, పాపకర్మ=పాపకర్మను, పరిత్యజేత్ = విడిచిపెట్టవలయును, యస్య = ఎవనికి, ఇదం=ఈ, చిత్రచిహ్నం=ఆశ్చర్యమైనగుఱుతు, (భవేత్ =అగునో)తస్య=వానికి, దీక్షా=గురుమంత్రదీక్షను, విధీయతే=విధింపఁబడినది.

తా॥ దుష్టసాంగత్యమునువిడిచి పాపకర్మమును వదలి ఇట్టి ఆశ్చర్యమైన గుఱుతు ఎవనికిఁ గలుగునో, వానికే గురుమంత్రదీక్ష నివ్వఁబడుచున్నది.

శ్లో॥ చిత్తత్యాగనియుక్తశ్చ । క్రోధగర్వవివర్జితః।
ద్వైతభావపరిత్యాగీ । తస్య దీక్షా విధీయతే॥ ౨౮౮॥

టీక॥ చిత్తత్యాగనియుక్తశ్చ=చిత్త=మనస్సుయొక్క, త్యాగ=విడుచుటయందు, నియుక్తః = మిక్కిలి కూడుకొనియున్నవాడును, క్రోధగర్వవివర్జితః=క్రోధ=కోపమును, గర్వ=అహంకారమును, వివర్జితః = విడిచినవాడును, ద్వైతభావపరిత్యాగీ=ద్వైతభావ= ద్వైతభావమును, జీవాత్మపరమాత్మలకు భేదభావమును), పరిత్యాగీ = విడిచినవాడును, (యః=ఎవడో), తస్య=వానికి, దీక్షా=గురుమంత్రదీక్షను, విధీయతే = విధింపఁబడుచున్నది.

తా॥ మనోత్యాగముతోఁ గూడుకొనియున్నవాడును, కోపాహంకారములను విడిచిన వాడును, జీవేశ్వరులయందు భేదబుద్ధిలేనివాడును, ఎవడో; వానికే గురుమంత్రదీక్షను విధింపంబడియున్నది.

శ్లో॥ ఏతల్లక్షణయుక్తత్వం। సర్వభూతహితేరతం।
నిర్మలంజీవితంయస్య। తస్యదీక్షావిధీయతే॥ ౨౪౯॥

టీక॥ ఏతల్లక్షణయుక్తత్వం=ఏతల్లక్షణ=ఈపూర్వోక్తమైన చిహ్నాములతో, యుక్తత్వం=కూడుకొని యుండుటయును, సర్వభూతహితేరతం=సర్వభూత=సమస్తజీవులకును, హితే = ఇష్టమైనదానియందు, రతం=ఆసక్తమైనదియును, నిర్మలం = స్వచ్ఛమైనదియునగు, జీవితం=ప్రాణధారణమును, యస్య=ఎవనికి, (అస్తి=కలదో); తస్య=వానికి, దీక్షా=గురుమంత్రదీక్షను, విధీయతే=విధింపఁబడియున్నది.

తా॥ ఎవనికిఈపూర్వముచెప్పిన చిహ్నాములతోఁ గూడుకొనుటయును, సమస్తజీవులకు నిష్టమునొనర్చుటయందాసక్తిగలదియును నిర్మలమునగు ప్రాణధారణమునుగలదో, వానికేగురుమంత్రదీక్షను విధింపఁబడియున్నది.

శ్లో॥ క్రియయాచాన్వితంపూర్వం। దీక్షాజాలంనిరూపితం।
మంత్రదీక్షాభిధంసాంగో। పాంగంసర్వంశివోదితం॥ ౨౫౦॥

టీక॥ పూర్వం=ముందు, క్రియయాచ=కర్మతో, (గురుమంత్రదీక్షాకర్మతో), అన్వితం=కూడుకొనిన వానినిగూర్చి, దీక్షాజాలం=మంత్రదీక్షాసముదాయము, నిరూపితం=నిరూపింపఁబడినది, మంత్రదీక్షాభిధం=మంత్రదీక్షయను పేరుగల, సాంగోపాంగం=అంగోపాంగములతోఁ గూడుకొనిన, (సాధనములతోను = ఉపసాధనములతోఁగూడుకొనిన), సర్వం=సమస్తమున్ను, శివోదితం=శివ=ఈశ్వరుని చేత, ఉదితం=చెప్పఁబడినది.

తా॥ ఓపార్వతి! ముందు గురుమంత్రదీక్షాకర్మతోఁ గూడుకొనిన వానినిగూర్చి మంత్రదీక్షాసముదాయము నిరూపింపఁబడినది, మంత్రదీక్షయను పేరుగలిగి సాధనోపసాధనములతోఁగూడుకొనిన దంతయును ఈశ్వరుని చేతఁ జెప్పఁబడినది.

శ్లో ॥ క్రియయాస్యాద్విరహితాం । గురుసాయుజ్యదాయినీం ।
గురుదీక్షాంవినాకోవా । గురుత్వాచారపాలకః ॥ ౨౫౧॥

టీక ॥ క్రియయా=దీక్షకర్మముతో, విరహితాం=శూన్యమైనదియును, గురుసాయుజ్యదాయినీం=గురు=గురువుతోటి, సాయుజ్య=ఏకత్వమును, దాయినీం=ఇచ్చునట్టిదియునగు, గురుదీక్షాకవినా= గురుమంత్రదీక్ష లేకుండా, కోవా=ఎవడు, గురుత్వాచారపాలకః=గురుత్వ=గురువగుట యొక్క,ఆచార=నడవడికను,పాలకః = పాలించెడివాడు,స్యాత్ =అగును.

తా ॥ దీక్షా కర్మతో శూన్యమైనదియును గురుసాయుజ్యమును ఇచ్చునదియునగు గురుమంత్రదీక్ష లేకుండా ఎవడు గురుత్వముయొక్కయాచారమును, పరిపాలించెడివాడగును? (అనగా ఎవడును, గురుత్వాచారమును పరిపాలించెడివాడు కాడని భావము.)

శ్లో ॥ శక్తోనచాపిశక్తోవా । దైశికాంఘ్రింసమాశ్రయేత్ ।
తస్యజన్మాస్తిసఫలం । భోగమోక్షఫలంప్రదం ॥ ౨౫౨॥

టీక॥ శక్తః=సమర్థుడైనను, నశాపిశక్తోవా=సమర్థుడుకాక పోయినను, దైశికాంఘ్రిం=దైశిక=గురువుసంబంధమైన, అంఘ్రిర్ = పాదమును, సమాశ్రయేత్ =ఆశ్రయించెనేని, తస్య=వానియొక్క, భోగమోక్షఫలప్రదం=భోగ=సుఖముయొక్క, జన్మ=పుట్టుకయు, మోక్ష=ముక్తియొక్కయు, ఫలం=ఫలమును, ప్రదం=ఇచ్చునదై, సఫలం=సార్థకమైనదై, అస్తి=ఉంచున్నది.

తా ॥ ఓపార్వతీ! సమర్థుడైనను అసమర్థుడైనను గురుపాదమునాశ్రయించెనేని భోగమోక్షములయొక్క ఫలమును జన్మసార్థకమును గలుగుచున్నది.

శ్లో ॥ అత్యన్తచిత్తపక్వస్య । శ్రద్ధాభక్తియుతస్యచ ।
ప్రవక్తవ్యమిదందేవి । మమాత్మప్రీతయేసదా ॥ ౨౫౩॥

టీక॥ హేదేవి=ఓపార్వతీ, ఇదం=ఇది, అత్యన్త చిత్తపక్వస్య = అ త్యన్త=మిక్కిలి, చిత్తపక్వస్య= మనోపరిపక్వముగల, శ్రద్ధాభక్తియుత స్యచ=శ్రద్ధా = ఆసక్తితోను, భక్తి = పూజ్యానురాగముతోను, యుత స్యచ=కూడుకొనినవానికి, సదా=ఎల్లప్పుడు, మమ=నాయొక్క, ఆత్మ ప్రీతయే=మనస్సంతోషముకొఱకు, వక్తవ్యం=చెప్పఁదగినది.

తా॥ ఓ పార్వతీ! ఇది మిక్కిలి మనోపరిపక్వముకలిగిన శ్రద్ధా భక్తులతోఁ గూడుకొనినవానికి నామనస్సంతోషముకొఱకు నెల్లప్పుడు చెప్పఁదగినది.

శ్లో॥ సచ్చిదానందరూపాయ । వ్యాపినేపరమాత్మనే ।
నమశ్శ్రీగురునాథాయ । ప్రకాశానందమూర్తయే ॥ ౨౫౪॥

టీక॥ సచ్చిదానందరూపాయ=సత్=బ్రహ్మమును, చిత్=జ్ఞానము ను, ఆనంద=ఆనందమును, రూపాయ=స్వరూపముగా గలవాడును, వ్యాపినే=అంతటా వ్యాపించియుండెడివాడును, ప్రకాశానందమూర్త యే=ప్రకాశ=వెలుగుచున్న, ఆనంద=సంతోషమే, మూర్తయే = ఆకా రముగాగలవాడును, పరమాత్మనే=పరమాత్మస్వరూపుడునగు, శ్రీగురు నాథాయ=ప్రకాశమానుడగుగురునాథునికొఱకు,నమః=నమస్కారము.

తా॥ ఓ పార్వతీ సచ్చిదానందస్వరూపుఁడును, అంతటా వ్యాపించి యుండెడువాఁడును, ప్రకాశమానమగుసంతోషమే రూపముగాగలవాఁ డును, పరమాత్మస్వరూపుఁడునగు శ్రీగురునాథునికొఱకు నమస్కారము.

శ్లో॥ సత్యానందస్వరూపాయ । బోధైకసుఖకారిణే ।
నమోవేదాన్తవేద్యాయ । గురవేబుద్ధిసాక్షిణే ॥ ౨౫౫॥

టీక ॥ సత్యానంద స్వరూపాయ=సత్య=సత్యమును, (భూతభవిష్య ద్వర్తమానకాలములయందు నాశనము లేకుండుటయును), ఆనంద= సంతోషమును, స్వరూపాయ=స్వరూపముగాగలవాడును, బోధైకసుఖ రూపిణే=బోధ=జ్ఞానమే, ఏక=ముఖ్యమగు, సుఖరూపిణే=సుఖస్వరూప

ముగాగలవాడును, వేదాన్తవేద్యాయ=వేదాన్త=ఉపనిషత్తులచేత, వేద్యాయ=తెలిసికొనఁ దగినవాడును, బుద్ధిసాక్షిణే=బుద్ధి= జ్ఞానమునకు, సాక్షిణే=ద్రష్టయునగు, గురవే=గురుస్వరూపునికొఱకు, నమః = నమస్కారము.

తా॥ సత్యానందస్వరూపుండును,జ్ఞానమేముఖ్యమైనసుఖస్వరూపముగాగలవాడుఁను, ఉపనిషత్తులచేఁదెలిసికొనఁదగినవాడుఁను, బుద్ధికి సాక్షియునగు, గురుస్వరూపునికొఱకు నమస్కారము.

శ్లో॥ నమస్తేనాథభగవాన్ । శివాయగురురూపిణే ।
విద్యావతారసంసిద్ధ్యై । స్వీకృతానేకవిగ్రహ॥ ౨౫౬॥

టీక॥ హేనాథ=ఓస్వామీ,హేభగవాన్=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవగు ఓస్వామి, విద్యావతారసంసిద్ధ్యై=విద్యావతార = జ్ఞానావతారము యొక్క, సంసిద్ధ్యై=సిద్ధికొఱకు,స్వీకృతానేకవిగ్రహ=స్వీకృత=పొందఁబడిన, అనేకవిగ్రహ = అనేకరూపములుగల ఓస్వామీ, శివాయ = మంగళస్వరూపుడవును, గురురూపిణే=గురుస్వరూపుడవునగు, తే=నీకొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఓస్వామీ! జ్ఞానావతారముయొక్క సంసిద్ధికొఱకు స్వీకరింపఁబడిన, అనేకరూపములుగల స్వామీ!మంగళ స్వరూపుండవును,గురుస్వరూపుండవునగు నీకొఱకు నమస్కారము.

శ్లో॥ నవాయనవరూపాయ । పరమార్థైకరూపిణే ।
సర్వజ్ఞానతమోభేద । భానవేచిద్ఘనాయతే ॥ ౨౫౭॥

శ్లో॥ స్వతంత్రాయదయాక్లప్త । విగ్రహాయశివాత్మనే ।
పరతంత్రాయభక్తానాం । భవ్యానాంభవ్యరూపిణే ॥ ౨౫౮॥

శ్లో॥ వివేకినాంవివేకాయ । విమర్శాయవిమర్శినాం ।
ప్రకాశినాంప్రకాశాయ । జ్ఞానినాంజ్ఞానరూపిణే ॥ ౨౫౯॥

శ్లో॥ పురస్తాత్పార్శ్వయోఃపృష్ఠే । నమస్కుర్యాముపర్యథః ।
సదామచ్చిత్తరూపేణ । విధేహిభవదాసనం॥ ౨౬౦॥

టీక॥ నవాయ=నూతన స్వరూపుఁడవును, నవరూపాయ= నూతన మైన ఆకారముగల వాఁడవును, పరమార్థిక రూపిణే= పరమార్థ = ఉత్కృష్టమైన కేవల పరమాత్మవస్తువే, ఏక=ముఖ్యమగు, రూపిణే= స్వ రూపముగా గలవాడవును, సర్వాజ్ఞాన తమోభేదభానవే= సర్వ=సమ స్తమైన, అజ్ఞాన=అజ్ఞానమనెడి, తమః=చీకటిని, భేద = భేదించుటకు, భానవే=సూర్యుడవును, చిద్ఘనాయ = ప్రకాశాధిక్యము గలవాడవును, స్వతంత్రాయ=స్వతంత్రుడవును, (పరాధీనుడవు కానివాడవును), దయా క్లృప్తవిగ్రహాయ=దయ=కరుణచేత, క్లృప్త=చేయఁబడిన, విగ్రహాయ = ఆకారముగలవాడవును,శివాత్మనే=ఈశ్వరస్వరూపుఁడవును,భవ్యానాం =మంగళస్వరూపులైన, భక్తానాం=భక్తులకు, పరతంత్రాయ=స్వాధీను డవును, భవ్యరూపిణే=మంగళస్వరూపుడవును,వివేకినాం=జ్ఞానవంతుల యొక్క,వివేకాయ=జ్ఞానస్వరూపుడవును, విమర్శినాం=విచారించెడివా రలయొక్క, విమర్శాయ=విచారణస్వరూపుడవును, ప్రకాశినాం = ప్ర కాశముగల వాటియొక్క, ప్రకాశాయ=ప్రకాశస్వరూపుడవును, జ్ఞాని నాం=జ్ఞానులయొక్క,జ్ఞానరూపిణే= జ్ఞానస్వరూపముగలవాడవునగు, తే=నీకొఱకు,పురస్తాత్ =ముందరను,పార్శ్వయోః=ప్రక్కలయందును, పృష్ఠే=వెనుకభాగమునందును, ఉపరి=మీదిభాగమునందును, అధః = క్రిందిభాగమునందును, నమస్కుర్యాత్ =నమస్కరించవలయును, సదా =ఎల్లప్పుడు,మచ్చిత్తరూపేణ=మత్ =నాయొక్క,చిత్తరూపేణ=మనో రూపముతో, భవదాసనం=నీయందుండునటుల,విధేహి=చేయుము.

తా॥ ఓస్వామీ! నవీనుండవును,నూతనస్వరూపుండవును,ముఖ్యమైన పరమాత్మస్వరూపుండవును; సమస్తమైన అజ్ఞానమనెడి అంధకారమును భేదించుటకు సూర్యస్వరూపుండవును, ప్రకాశాధిక్యము గలవాడవును, స్వతంత్రుండవును, కరుణచేతఁబొందఁబడిన ఆకారముగలవాడవును, ఈ శ్వరస్వరూపుండవును, పరమభక్తులకుస్వాధీనుండవును,వివేకులకు వివేక స్వరూపుండవును, విచారణచేయువారలకువిచారణస్వరూపుండవును,ప్ర కాశించువారలకు ప్రకాశస్వరూపుండవును, జ్ఞానులకుజ్ఞానస్వరూపుండ

ఫునగు, సద్గురుస్వరూపుండవైననీకొఱకు నమస్కారమని, పురోభాగము నందును, పార్శ్వములయందును, వెనుకభాగమునందును, మీదను, క్రింద ను, అంతటను నమస్కరించవలయును, ఇట్లు నమస్కరించి, ఓస్వామీ! నీదివ్యస్వరూపమునందే, నాచిత్తము నిలిచియుండునటులం జేయుమని సద్గురువునుప్రార్థించవలయును.

శ్లో ॥ శ్రీగురుంపరమానందం । వన్దే ఆనందవిగ్రహం।
యస్యసన్నిధిమాత్రేణ । చిదానందాయ తేనమః॥ ౭౬౧॥

టీక॥ ఆనందవిగ్రహం=ఆనంద=బ్రహ్మానందమే, విగ్రహం = ఆకార ముగాగలవాఁడును, పరమానందం=శ్రేష్టమైన యానందముఁడునగు, శ్రీగు రుం=ప్రకాశమానుఁడగుసద్గురువునుగూర్చి, (అహం=నేను), వన్దే=న మస్కరించుచున్నాను, యస్య=ఎవనియొక్క, సన్నిధిమాత్రేణ=సమీ పముచేతనే; చిదానందాయ తే=జ్ఞానమును, ఆనందమును గలుగఁజే యఁబడునో; (తస్య=వానికి), నమః=నమస్కారము.

తా॥ ఆనందవిగ్రహుండును, శ్రేష్ఠమైనయానందుండునగుసద్గురువు నుగూర్చి నేను నమస్కరించుచున్నాను. ఏ సద్గురువుయొక్క సామీప్య ముచేతనే జ్ఞానానందములు కలుగుచున్నవో అట్టి యానందస్వరూపు డైన సద్గురువునకు నమస్కారము.

శ్లో ॥ నమోస్తుగురవేతుభ్యం । సహజానందరూపిణే ।
యస్యవాగమృతంహన్తి । విషంసంసారసంజ్ఞికం ॥ ౭౬౨॥

టీక ॥ యస్య=ఎవనియొక్క,వాగమృతం=వాక్కనెడియమృతము, సంసారసంజ్ఞికం=సంసారమను పేరుగల, విషం=గరళమును,హన్తి=నశిం పఁజేయుచున్నదో; (తస్మై=అటువంటి), సహజానందరూపిణే=సహజమై న ఆనందమేస్వరూపముగాగల, గురవే=గురుస్వరూపుండవైన, తుభ్యం =నీకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగును.

తా ॥ ఏగురువుయొక్క వాక్కయనెడు అమృతము, సంసారమ నుపేరుగల గరళమును నశింపఁజేయుచున్నదో, అట్టిసహజానంద స్వ

రూపుండవును, సద్గురు స్వరూపుండవునగు, నీకొఱకు, నమస్కారము-అగును గాక.

శ్లో॥ నానాయుక్తోపదేశేన । తారితాశిష్యసంతతిః ।
తత్కృపాసార వేదేన । గురుచిత్పదమచ్యుతం॥ ౨౬౩॥

టీక॥ శిష్యసంతతిః=శిష్యుల యొక్క పారంపర్యము,నానాయుక్తోపదేశేన=నానా=అనేకవిధములైన, యుక్త= యోగముల యొక్క, ఉపదేశేన= చెప్పుట చేతను,తారితా=తరింపం జేయఁబడినది. తత్కృపాసారవేదేన=తత్ =ఆగురువు యొక్క,కృపాసార=దయాసారమును, వేదేన= తెలిసికొనుట చేతను, గురు చిత్పదం,గురు=గురువు యొక్క, చిత్పదం=జ్ఞానస్థానము, అచ్యుతం=నాశనరహితమైనది, (భవతి=అగుచున్నది.)

తా॥ అనేకవిధములైనయోగముల యొక్కయుపదేశముల చేత, శిష్యుల యొక్క పారంపర్యముతరింపఁ జేయఁబడినది,గురుకృపాసారమును దెలిసికొనుట చేత,గురుసంబంధమగుజ్ఞానపదము,నశించనిది-అగుచున్నది.

శ్లో॥ అచ్యుతాయనమస్తస్మై । గురవే పరమాత్మనే ।
స్వారామోక్తపదేచ్ఛూనాం । దత్తం యేనాచ్యుతంపదం॥ ౨౬౪॥

టీక॥ ఏన=ఎవని చేతను, స్వారామోక్తపదేచ్ఛూనాం=స్వారామ=ఆత్మారామ(బ్రహ్మ)మునుగురించి,ఉక్త=చెప్పఁబడిన, పద=స్థానమునందు, ఇచ్ఛూనాం=కోరికగలవారలకు, అచ్యుతం = నాశనరహితమైన, పదం=స్థానము, దత్తం=ఇవ్వబడినదో; తస్మై=అటువంటి, అచ్యుతాయ= నాశనరహితుఁడగు, పరమాత్మనే=పరమాత్మస్వరూపుడైన, గురవే=గురువు కొఱకు, నమః=నమస్కారము.

తా॥ ఏగురువువలన ఆత్మస్వరూపమునందు క్రీడించెడు వారలనుఁ జెప్పఁబడినదో, అట్టి మోక్షపదమునందు కోరికగలవారలకు, నాశనరహితమైనముక్తిపదము-ఇవ్వఁబడినదో; అటువంటినాశనరహితమైన పరమాత్మస్వరూపుఁడగు గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ నమోచ్యుతాయగురవే । అజ్ఞానధ్వాంతభానవే ।
శిష్యసన్మార్గపటవే । కృపాపీయూషసింధవే ॥ ౨౬౫॥

టీక॥ అజ్ఞానధ్వాంతభానవే=అజ్ఞాన=అజ్ఞానమనెడి, ధ్వాంత=అధికమైనచీకటికి, భానవే=సూర్యుడైనవాడును, శిష్యసన్మార్గపటవే=శిష్య శిష్యులయొక్క; సన్మార్గ=మంచిమార్గమునందు, పటవే=సమర్థుడును, కృపాపీయూషసింధవే=కృపా=దయయనెడి, పీయూష=అమృతము నకు, సింధవే= సముద్రుడును, అచ్యుతాయ = నాశములేనివాడునగు, గురవే=సద్గురువుకొఱకు, నమః=నమస్కారము.

తా॥ అజ్ఞానమను చీకటికి సూర్యుండును, శిష్యసన్మార్గమునందు సమర్థుండును, దయయనెడియమృతమునకు సముద్రుండును, నాశనరహితుండునునగు సద్గురువుకొఱకు నమస్కారము.

శ్లో॥ ఓంమచ్యుతాయగురవే । శిష్యసంసారసేతవే ।
భక్తకార్యైకసింహాయ । నమస్తేచిత్సుఖాత్మనే ॥ ౭౬॥

టీ॥ శిష్యసంసారసేతవే=శిష్య=శిష్యులయొక్క, సంసార=సంసారమునకు, సేతవే=కట్టయైనవాడవును, (బంధించువాడవును), భక్తకార్యైకసింహాయ=భక్త = భక్తులయొక్క, కార్య=పనులకు, ఏకసింహాయ=ముఖ్యమైనసమర్థుడవును, చిత్సుఖాత్మనే=జ్ఞానానందస్వరూపుడవును, ఓం=ఓంకారమగుప్రణవస్వరూపుడవును, అచ్యుతాయ=నాశనరహితుడవునగు, గురవే=గురుడవైన, తే=నీకొఱకు, నమః=నమస్కారము.

తా॥ శిష్యుల సంసారములను బంధించి యడ్డగించెడు వాడవును, భక్తుల కార్యములను నెఱవేర్చుటకు ముఖ్యమైన సమర్థుండవును. జ్ఞానానందస్వరూపుండవును ప్రణవస్వరూపుండవును, నాశనరహితుండవును నగు, గురుడవైన నీకొఱకు నమస్కారము.

శ్లో॥ గురునామసమందైవం । నపితానచబాంధవః ।
గురునామఃసమస్వామీ । నేదృశంపరమంపదం ॥ ౭౭॥

టీ॥ గురునామసమం=గురు=గురువుయొక్క, నామ=పేరుతో, సమం=సమానమైన, దైవం=దైవము, పితా=తండ్రి, న=కాడు; బాంధవః=బంధువులు, న=కారు, గురునామసమః=గురువుయొక్క నామముతో సమానము, స్వామీ=ఈశ్వరుడును, ఈదృశం=ఇటువంటి, పరమంపదం=మోక్షపదమును, న=కాదు.

తా ॥ గురువు యొక్క పేరుతో సమానమైనదైవము, తండ్రియును, బంధువులును గారు, ఈశ్వరుండును, పరమపదమును, గురునామముతో సమానములుగావని భావము.

శ్లో ॥ ఏకాక్షరప్రదాతారం । యోగురుంనైవమన్యతే ।
శ్వానయోనిశతంగత్వా । ఛండాలేష్వభిజాయతే ॥ ౧౬౮॥

టీక ॥ యః=ఎవడు, ఏకాక్షరప్రదాతారం=ఏకాక్షర=ఓంకారమైన ప్రణవమును, ప్రదాతారం=ఇచ్చెడి, గురుం = గురువును, నైవమన్యతే =తలంచడో; (సః=వాడు), శ్వానయోనిశతం= శ్వాన=కుక్కల యొక్క యోని=జన్మస్థానములయొక్క, శతం=నూటిని, గత్వా=పొంది, ఛండాలేషు=ఛండాలులయందు, అభిజాయతే=పుట్టుచున్నాడు.

తా॥ ఎవడు ఒకటియగు నాశనరహితమైన ప్రణవోపదేశమును చేసిన, సద్గురువునుదలంచడో, వాడు నూరుసార్లు కుక్కయోనులయందు జన్మించి, కడపట ఛండాలురయందు పుట్టుచున్నాడు.

శ్లో ॥ గురుత్యాగాద్భవేన్మృత్యుః । మంత్రత్యాగాద్దరిద్రతా ।
గురుమంత్రపరిత్యాగీ । రౌరవంనరకంవ్రజేత్ ॥ ౧౬౯॥

టీక॥గురుత్యాగాత్ =గురు=గురువును, త్యాగాత్ =విడుచుటవలన, మృత్యుః=మరణమును, మంత్రత్యాగాత్ = మంత్ర = మంత్రమును, త్యాగాత్ =విడుచుటవలన, దరిద్రతా =దారిద్రమును, భవేత్ = కలుగును, గురుమంత్రపరిత్యాగీ= గురు=గురువును, మంత్ర=మంత్రమును, పరిత్యాగీ=విడిచినవాడు, రౌరవం=రౌరవమను పేరుగల, నరకం=నరకమును, వ్రజేత్ =పొందును.

తా ॥ ఓ పార్వతీ! గురువునువిడుచుటవలన మరణమును, మంత్రమునువిడుచుటవలన దారిద్ర్యమును కలుగును, గురువును-మంత్రమును రెంటిని విడుచుటవలన, రౌరవమను పేరుగల గొప్పనరకమును బొందునని భావము.

శ్లో ॥ శివక్రోధాద్గురుస్త్రాతా । గురుక్రోధాచ్ఛివోనహి ।
తస్మాత్సర్వప్రయత్నేన । గురోరాజ్ఞాంనలంఘయేత్ ॥ ౧౭౦॥

టీ॥ శివక్రోధాత్ = ఈశ్వరుని యొక్క కోపమువలన, గురుః=గురువు, త్రాతా=రక్షించగలడు, గురుక్రోధాత్ = గురువు యొక్క కోపమువలన శివః= ఈశ్వరుడు,నహి=రక్షించలేడు,తస్మాత్ = ఆకారణమువలన,సర్వ ప్రయత్నేన=అన్నిప్రయత్నముల చేతను, గురోః=గురువు యొక్క, ఆజ్ఞాం=ఆజ్ఞను, నలంఘయేత్ =అతిక్రమించఁగూడదు.

తా॥ ఈశ్వరుని యొక్క కోపమునుండిగురువు రక్షించగలఁడు, గురువు యొక్క ఆగ్రహమునుండి శివుడు రక్షించలేడు, ఆకారణమువలనసర్వ విధముల చేతను,గురువు యొక్క ఆజ్ఞను-అతిక్రమించఁగూడదని భావము.

శ్లో॥ సంసారసాగరసముద్ధరణైకమంత్రం । బ్రహ్మాదిదేవమునిపూజితసిద్ధమంత్రం । దారిద్ర్యదుఃఖభవరోగవినాశమంత్రం । వందేమహాభయహరంగురురాజమంత్రం ॥ ౨౭౧॥

టీ॥ సంసా...మంత్రం=సంసార=సంసారమనెడి,(జననమరణప్రవాహరూపమైన దేహమేసంసారము), సాగర=సముద్రమునుండి, సముద్ధరణ=(యెత్తిరక్షించుటయందు), ఏకమంత్రం= ముఖ్యమైనమంత్రమును, బ్రహ్మ...మంత్రం=బ్రహ్మాది= బ్రహ్మమొదలైన, దేవ = దేవతల చేతను, ముని=ఋషుల చేతను, పూజితం = పూజింపఁబడిన, సిద్ధమంత్రం=సిద్ధిని పొందించెడిమంత్రమును,దారి...మంత్రం=దారిద్ర్య=దరిద్రము యొక్క, దుఃఖ=దుఃఖమును, భవ=సంసారమనెడి, రోగ=వ్యాధిని. వినాశమంత్రం=నశింపజేసెడిమంత్రమును, మహాభయహరం = గొప్పభయమును హరించెడిదియునగు, గురురాజమంత్రం = గురురాజమంత్రమునుగూర్చి వన్దే=నమస్కరించుచున్నాను.

తా ॥ సంసారసముద్రమునుండి యెత్తి రక్షించుటకు ముఖ్యమైనమంత్రమును, బ్రహ్మమొదలైనదేవతల చేతను ఋషుల చేతను బూజింపఁబడి సిద్ధిపొందించెడు మంత్రమును, దరిద్రదుఃఖములను, సంసారరోగమునునశింపఁజేసెడు మంత్రమును, గొప్పభయమును హరించునదియునగు గురురాజమంత్రమునుగూర్చి నేను నమస్కరించుచున్నానని, భావము,

శ్లో ॥ సప్తకోటిమహామంత్రా । చిత్తవిభ్రమకారకాః । ఏకఏవపరోమంత్రో । గురురిత్యక్షరద్వయం ॥ ౨౭౨॥

టీక ॥ సప్త...మంత్రాః=సప్తకోటి=ఏడుకోట్ల, మహామంత్రా = మహామంత్రములు, చిత్తవిభ్రమకారకాః = చిత్తవిభ్రమ = మనోభ్రాంతికి, కారకాః=కారణమైనవిగా (భవన్తి=అగుచున్నవి.) గురురితి=గురువుఅనెడి, అక్షరద్వయం=రెండక్షరములుగల ప్రణవమంత్రము, ఏకం=ఒక్కటే, మంత్రఏవ=మంత్రమే, పరః=శ్రేష్ఠమైనది.

తా ॥ ఏడుకోట్లమహామంత్రములును మనోభ్రమను గలుగఁజేయును, గురువుయనెడి రెండక్షరములు గలప్రణవమంత్రమేమిగులశ్రేష్ఠమైనదని, భావము.

శ్లో ॥ యస్యప్రసాదాదహమేవసర్వం । మయ్యేవసర్వంపరికల్పితంచ।
ఇత్థం విజానామిసదాత్మరూపం । తస్యాంఘ్రిపద్మం ప్రణతోస్మి నిత్యం ॥ ౨౭౩॥

టీక॥ యస్య=ఏగురువుయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అహమేవ=నేనే; సర్వం=సమస్తమును, (భవామి = అగుచున్నాను,) మయ్యేవ=నాయందే, సర్వం=సమస్తమును, పరికల్పితంచ= కల్పింపఁబడినవి, (భవతి=అగుచున్నవి,) ఇత్థం=ఈప్రకారముగా, సదాత్మరూపం పరమాత్మస్వరూపమును, విజానామి = తెలిసికొనుచున్నానో; తస్య = ఆగురువుయొక్క, అంఘ్రిపద్మం=పాదపద్మములనుగూర్చి, నిత్యం=యెల్లప్పుడును, ప్రణతోస్మి=నమస్కరించుచున్నాను.

తా ॥ నేనే సర్వమగుచున్నాను, నాయందేసర్వమును గల్పింపఁబడుచున్నవి, యేగురువుయొక్క అనుగ్రహమువలన యీ ప్రకారముగా పరమాత్మస్వరూపమును దెలుసుకొనుచున్నానో, అట్టిసద్గురువుయొక్క పాదపద్మములనుగూర్చి యెల్లప్పుడును నమస్కరించుచున్నాను.

శ్లో ॥ అజ్ఞానతిమిరాంధస్య । విషయాక్రాంతచేతసః ।
జ్ఞానప్రభాప్రదానేన । ప్రసాదంకురుమేప్రభో ॥ ౨౭౪॥

టీక ॥ హేప్రభో=ఓ స్వామీ, అజ్ఞానతిమిరాంధస్య=అజ్ఞాన=అజ్ఞానమనెడి, తిమిర=చీకటిచేతను, అంధస్య=గ్రుడ్డివాడను, విషయాక్రాంతచేతసః=విషయ=శబ్దాది విషయములచేతను, ఆక్రాంత = ఆక్రమింపఁబడిన, చేతసః=మనస్సుగలవాడనగు. మే=నాకు, జ్ఞానప్రభా ప్రదానేన

=జ్ఞాన=పరమాత్మజ్ఞానమనెడి, ప్రభా=కాంతిని, ప్రదానేన=కల్గఁజే యునట్టి, ప్రసాదం=అనుగ్రహమును, కురు=చేయుము.

తా ॥ శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములయం దాసక్తమైన మనస్సు కలిగి పరమాత్మస్వరూపమైన, నన్ను నేను తెలిసికొనక పోవుటయనెడి అజ్ఞానాంధకారముచేత గ్రుడ్డివాడగు నాకు పరమాత్మస్వరూపమే నేననెడి, ఆత్మజ్ఞానముయొక్క తేజస్సును ఇచ్చుటకొఱకు నన్ను అనుగ్రహించుమని సద్గురువును ప్రార్థించవలయును.

ఇతి శ్రీస్కాంధపురాణే, ఉత్తరఖండే, ఉమామహే
శ్వర సంవాదే, గురుగీతాయాం కామ్యజపస్థాన,
జ్ఞాన, ప్రదానాది, ప్రశంసనం, నామ

చతుర్థో ధ్యాయః.

గద్య ॥ ఇదిస్కాంధపురాణాంతర్గత ఉత్తరఖండమునం
దున్న ఉమామహేశ్వర సంవాదమునందలి గురు
గీతయందు గురుగీతామంత్ర జపస్థాన, ఫల
ప్రదానము మొదలైన వానియొక్క ప్రశంసన
మును శ్రీమద్భాగవతకృష్ణదేశికప్రభుస్వా
ములవారి ప్రియశిష్యుడైన ఫీల్డానా
శంకరరావుగారిచే, టీకా తా
త్పర్యములను రచియింపం
బడిన చతుర్థా ధ్యా
యము సర్వాంబును.
సమాప్తము.

—:0:—




శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

## అథ గుర్వష్టక ప్రారభ్యతే.

### గుర్వష్టకములు * ఆరంభము.

శ్లోకం ॥ కళత్రంధనంపుత్రపౌత్రాదిసర్వం ।
గృహంబాంధవాఃసర్వమేతద్ధిజాతం ।
గురోరంఘ్రిపద్మేమనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౧॥

టీక ॥ యస్య=ఎవనికి, కళత్రం = భార్యయును, ధనం = ధనమును, పుత్రపౌత్రాది=పుత్ర = పుత్రులును, పౌత్ర = మనమలును, ఆది=మొదలైన, సర్వం=సమస్తమును, గృహం=ఇల్లును, బాంధవాః=బంధువులును, జాతం=పుట్టిన, ఏతత్ =ఈ, సర్వంహి=సమస్తమును, అస్తి=కలిగియుండినను, తస్య=వానియొక్క, మనః=మనస్సు, గురోః=గురువుయొక్క, అంఘ్రిపద్మే=పాదపద్మములయందు, నలగ్నంచేత్ =కూడుకొనకపోయినయెడల, తతః=ఆసమస్తమునుండుటవలన, కిం = ఏమిప్రయోజనము, తతః=ఆసమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము, తతః = ఆసమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము, తతః=ఆసమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము.

తా ॥ మనస్సు గురుపాద పద్మములయందుంబొందని మనుజునకు, భార్యయును, ధనమును, కొమాళ్లును, మనుమలు మొదలగు సర్వమును గృహమును, బంధువులును, ఇవియన్నియును గలిగియుండినను, ప్రయోజనము లేదని భావము.

శ్లో ॥ షడంగాదివేదోముఖే శాస్త్రవిద్యా ।
కవిత్వాదిగద్యం సుపద్యంకరోతి ।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౨॥

టీక ॥ (యస్య=ఎవని యొక్క) ముఖే=ముఖమునందు, షడంగాది వేదః=షడంగాది=షడంగములు మొదలైనవాటితో గూడుకొనిన, (శిక్ష వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఇవియే షడంగములు) వేదః= వేదములును, శాస్త్రవిద్యా=శాస్త్రవిద్యయును కవిత్వాది=కవనము మొదలైనవాటిని, గద్యం=గద్యమును, సుపద్యం = శ్లోకమునున్ను, కరోతి=చేయబడుచున్నవో, తస్య= వాని యొక్క, మనః=మనస్సు, గురోః=గురువు యొక్క, అంఘ్రిపద్మే=పాదపద్మములయందు, నలగ్నం చేత్ =కూడుకొనకపోయిన యెడల, తతః= అసమస్తమునుం డుటవలన, కిం=ఏమిప్రయోజనము, తతః = అసమస్తమునుండుటవలన; కిం=ఏమిప్రయోజనము. (శేషము సులభము.)

తా ॥ ఎవని మనస్సు గురుచరణారవిందములయం దాసక్తముగాకయుండునో, వాని యొక్క ముఖమునందు షడంగములతో గూడుకొనిన వేదములును, శాస్త్రములును, గద్య, పద్యాదికావ్యములును రచనను జేయంబడియుండినను, యేమియును బ్రయోజనము లేదని భావము.

శ్లో ॥ విదేశేషుమాన్యః స్వదేశేషుధన్యః ।
సదాచారనిత్యః సువృత్తిర్నచాన్యః ।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౩॥

టీక ॥ విదేశేషు=ఇతర దేశములయందు, మాన్యః = పూజ్యుడును స్వదేశేషు=తన దేశమునందు, ధన్యః=పుణ్యాత్ముడును, సదాచారనిత్యః= సదాచార=మంచియాచారమునందు, నిత్యః= ఎల్లప్పుడునుండువాడును, సువృత్తి=మంచి నడవడికగలవాడును, నచాన్యః=దుర్వృత్తి లేనివాడును, (యః=ఎవడో, తస్య=వాని యొక్క,) మనః=మనస్సు, గురోః=గురువు యొక్క, అంఘ్రిపద్మే=పాదపద్మములయందు, నలగ్నం చేత్ =కూడుకొనకపోయె నేని, తతః=అ సమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము. (శేషము సులభము.)

తా ॥ జనుడు ఇతరదేశములయందు పూజ్యుడుగా నుండినను, తన దేశమునందు పుణ్యాత్ముడుగానుండినను, స్థిరమైనశిష్టాచారములుగలవాడుగానుండినను, మంచినడతగలవాడుగానుండినను, వానిమనస్సుసద్గురునిపాదపద్మములయందాసక్తముకానియెడల యేమియును ప్రయోజనము లేదని భావము.

శ్లో ॥ క్షమామండలే భూపభూపాలబృందం ।
సదా సేవ్యతే యస్యపాదారవిందం ।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౪॥

టీక ॥ యస్య=ఎవనియొక్క, పాదారవిందం=పాద పద్మములను క్షమామండలే=భూమండలంబునందు, భూపభూపాలబృందం= రాజరాజులయొక్క సమూహము, సదా=ఎల్లప్పుడును, సేవ్యతే=సేవించబడువాడుగానుండినను,(తస్య=వానియొక్క,)మనః=మనస్సు, గురోః=గురువుయొక్క, అంఘ్రిపద్మే=పాదపద్మములయందు, నలగ్నంచేత్ = కూడుకొనకపోయెనేని, తతః=ఆసమస్తము నుండుటవలన, కిం=ఏమిప్రయోజనము. (శేషము సులభము.)

తా ॥ భూమండలమునందు, తన పాదపద్మములను, రాజరాజుల సమూహము సేవించుచుండెడువాడుగా నుండినను, వానియొక్క మనస్సు గురుపాదపద్మములయందాసక్తముకానియెడలం ప్రయోజనమేమియును లేదనిభావము.

శ్లో ॥ నభోగేనయోగేనవారాజ్యభోగే ।
నకాంతాముఖేనైవవిత్తేషుయుక్తః ।
గురోరంఘ్రిపద్మేమనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౫॥

టీక ॥ నభోగేన=ఆకాశ గమనముతోను, యోగేన=యోగముతోను, రాజ్యభోగేన=రాజ్యభోగముతోను, విత్తేషు=ధనముతోను, కాం

త్రాముఖ్యైనైవ=(స్త్రీ) మొదలైనవాటితోను, యుక్తోవా= కూడికొనియుండువాడైనను, మనః=మనస్సు, గురోః=గురువుయొక్క, అంఘ్రిపద్మే= పాదపద్మములయందు, నలగ్నంచేత్ = కూడుకొనక, పోయినయెడల, తతః=ఆసమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము. (శే. సు.)

తా ॥ జనుడు ఆకాశ గమనమును, యోగమును, భోగమును ధన సంపదలును, (స్త్రీ) మొదలైనవాటిని, గలిగియుండినను, మనస్సు సద్గురుని పాదపద్మములయం దాసక్తముకానియెడల యేమియును ప్రయోజనము లేదని భావము.

శ్లో ॥ యశోమేగతందిక్షు దానప్రతాపా ।
జ్జగద్వస్తుసర్వంకరే యత్ప్రసాదాత్ ।
గురోరంఘ్రిపద్మేమనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౬॥

టీక ॥ యత్ప్రసాదాత్=ఎవనియనుగ్రహమువలన, దానప్రతాపాత్=దానమునందలి పౌరుషమువల్లనైన, మే=నాయొక్క, యశః=కీర్తి, దిక్షు = దిక్కులయందును, సర్వం=సమస్తమైన, జగద్వస్తు=ప్రపంచమనెడి వస్తువు, కరే=హస్తమునందును, గతం=పొందియున్నదో, తస్య = వానియొక్క, మనః=మనస్సు, గురోః=గురువుయొక్క, అంఘ్రిపద్మే =పాదపద్మములయందు,నలగ్నంచేత్=కూడుకొనకపోయెనేని, తత,=ఆ సమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము. (శేషము సులభము.)

తా ॥ సద్గురుని-అనుగ్రహమువలన దానప్రతాపములచేత తనకీర్తి అష్టదిక్కులయందునునిండి, యీజగత్తంతయును స్వాధీనముగా నుండినవాడుగానుండినను, సద్గురునిపాదపద్మములయందు మనస్సులియ్యము కానియెడల, యేమియును ప్రయోజనములేదని భావము.

శ్లో ॥ అరణ్యేనివాసోస్వగేహేచకార్యః ।
నదేహేమనోవర్తతేమేఅనార్ఘ్యే ।
గురోరంఘ్రిపద్మేమనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౭॥

టీ ॥ నివాసః=ఉనికి, అరణ్యే=అడవియందైనను, స్వగేహేచ=తన యింటియందైనను, కార్యే=చేయుచున్నను, మే=నా యొక్క, మనః=మనస్సు, అనార్యే=అయోగ్యమైన, దేహే=శరీరమునందు, నవర్తతే=ఉండకపోయినను, గురోః= గురువుయొక్క, అంఘ్రిపద్మే=పాదపద్మములయందు, మనః=మనస్సే, నలగ్నంచేత్ =కూడికొనకపోయెనేని, తతః=ఆసమస్తమునుండుటవలన, కిం=ఏమిప్రయోజనము,(శేషము సులభము.)

తా ॥ జనుడు అరణ్యమందైనను, తనయింటియందైననునుండి, అయోగ్యమైనదేహమునందు మనస్సునునుంచక, పరమాత్మయందుంచినవాడుగానుండినను, సద్గురునిపాదపద్మములయందు మనస్సును లియ్యము చేయకపోయినయెడల నేమియును బ్రయోజనములేదని భావము.

శ్లో ॥ అనర్ఘాణిరత్నానియుక్తానిసమ్యక్ ।
సమాలింగితాకామినీయామినీషు ।
గురోరంఘ్రిపద్మేమనశ్చేన్నలగ్నం ।
తతఃకిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం ॥ ౮॥

టీ ॥ అనర్ఘాణి=శ్రేష్ఠములైన, రత్నాని=నవరత్నములు, సమ్యక్=విశేషముగా, యుక్తాని=కూడుకొనియుండినను, యామినీషు=రాత్రులయందు, కామినీ=సుందరులైన స్త్రీలను, సమాలింగితా= అధికముగా కౌగిలించుకొనువాడుగానుండినను,గురోః=గురువుయొక్క,అంఘ్రిపద్మే పాదపద్మములయందు, మనః=మనస్సు, నలగ్నంచేత్ =కూడుకొనక పోయెనేని, తతః = ఆసమస్తమునుండుటవలన, కిం = ఏమి ప్రయోజనము. (శేషము సులభము.)

తా ॥ శ్రేష్ఠములైనగొప్పమణులతోఁగూడుకొనిన వాడుగానుండినను, రాత్రులయందు, సుందరులైనస్త్రీలను కౌగిలించినవాడుగానుండినను, సద్గురునిపాదపద్మములయందు, మనస్సునుగీలించకుండిన ఏమియునుబ్రయోజనములేదనిభావము.

శ్లో॥ గురోరష్టకంయఃపఠేత్పుణ్యదేహీ ।
యతిర్భూపతిర్బ్రహ్మచారీచగేహీ ।
లభేద్వాంఛితార్థంపరంబ్రహ్మసౌఖ్యం
గురోరుక్తమార్గేమనోయస్యలగ్నం॥ ౯॥

టీ॥ పుణ్యదేహీ=పవిత్రమైనదేహముగలిగిన, యతిః = సన్యాసియు ను, =భూపతిః=రాజును,బ్రహ్మచారీచ=బ్రహ్మచారియును, గేహీ=గృ హస్థును, (వీరలలో)యః=ఎవడైనను, గురో=గురువుయొక్క, అష్టకం= ఎనిమిదిశ్లోకములను, పఠేత్ =పఠించునో, యస్య=ఎవనియొక్క, మనః =మనస్సు, గురోః=గురువువలన, ఉక్తమార్గే= చెప్పబడినమార్గమునం దు, లగ్నం=కూడుకొనియున్నదో (సః=వాడు,) వాంఛితార్థం=కోరఁబ డినప్రయోజనమును, పరం=శ్రేష్ఠమునగు, బ్రహ్మసౌఖ్యం=బ్రహ్మానంద మును, లభేత్ =పొందును.

తా॥ సన్యాసియును రాజును బ్రహ్మచారియును, గృహస్థును వీర లలో నెవ్వడైనను, పవిత్రమైనదేహముగలవాడై ఈగుర్వష్టకమును బఠియించునో, ఎవనిమనస్సు గురువుచేతంజెప్పంబడిన, మ్మార్గము నందు లగ్నమైయుండునో వాడుకోరబడినప్రయోజనమును, పరబ్రహ్మనంద సుఖమునుబొందునని భావము.

ఇతి=శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభుస్వాములవారికి ప్రి యశిష్యుడైన శ్రీమత్ ఫీల్ఖానాశంకరరావు, టీకా, తాత్పర్యములను రచియించిన గురుఅష్టకములు

స మా ప్త ము.

——:0:——

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

ఉద్గ్రంథములలోనుండియెత్తివ్రాసిన

# భ్రాంతిశహితశ్లోకములు ప్రారంభము.

శ్లో॥ భ్రమేణాహంభ్రమేణత్వం । భ్రమేణోపాసకాజనాః ।
భ్రమేణేశ్వరభావత్వం । భ్రమమూలమిదంజగత్ ॥ ౧॥

టీక ॥ భ్రమేణ=భ్రాంతిచేతనే, అహం=నేనును, భ్రమేణ=భ్రాంతిచేతనే, త్వం=నీవును, భ్రమేణ=భ్రాంతిచేతనే, ఉపాసకాః=ధ్యానమును, సేవయునుజేయునట్టి, జనాః=జనులున్ను, భ్రమేణ=భ్రాంతిచేతనే, ఈశ్వరభావత్వం = ఈశ్వరాభిప్రాయము గలుగుటయును (భవతి=అగుచున్నది,) ఇదంజగత్ = ఈజగత్తునను, భ్రమమూలం = భ్రాంతియే కారణముగా నున్నది.

తా॥ భ్రాంతిచేతనే నేనును నీవును, భ్రాంతిచేతనేఈశ్వరోపాసన జేయునట్టి జనులును, భ్రాంతిచేతనే ఈశ్వరభావమును గలుగు చున్నది ఈజగత్తు భ్రాంతివల్లనే యున్నదిగాని నిజముగా లేదని భావము.

శ్లో॥ త్యజధర్మమధర్మంచ । ఉభేసత్యానృతేత్యజ ।
ఉభేసత్యానృతేత్యక్త్వా । యేనత్యజసితత్త్యజ ॥ ౨॥

టీక ॥ ధర్మం=ధర్మమును,అధర్మంచ=అధర్మమును, త్యజ=విడువుము, ఉభే=రెండైన, సత్యానృతే=సత్యాసత్యములను,(నిజమును అబద్ధమును) త్యజ=విడువుము, ఉభే=రెండైన, సత్యానృతే = సత్యాసత్యము లను, త్యక్త్వా = విడిచి, యేన=ఏయెఱుకచేత, త్యజసి = విడుచుచున్నావో, తత్ = అట్టియెఱుకనున్ను, త్యజ = విడువుము.

తా ॥ ధర్మాధర్మములను సత్యాసత్యములను విడువుము. ఇది ధర్మమని, ఇది అధర్మమని, ఇది సత్యమని, ఇది అసత్యమని, దేనిచేతం దెలిసికొనివిడుచుచున్నావో, అట్టి యెఱుకనుగూడావిడువుమని భావము.

శ్లో ॥ గురుణావరణత్యాగః । అనావరణము త్తమం ।
పరిపూర్ణంపూర్ణ మేవ । పూర్ణాచలసముద్రవత్ ॥ ౩॥

టీక ॥ గురుణా=గురువుచేత, ఆవరణత్యాగః = ఆవరణ = విద్యావిద్యల నెడు ఆవరణములను, త్యాగః=విడిచినయెడల, పరిపూర్ణం= అంతటను నిండియుండిన, ఉత్తమం=శ్రేష్ఠమైన, అనావరణం= ఆవరణములేని, పరిపూర్ణమై, పూర్ణాచలసముద్రవత్ =పూర్ణ=నిండియుండిన, అచలసముద్రవత్ =కదలని మహాసముద్రమువలెను, పూర్ణమేవ= అఖండ స్వరూపముగానే, (భవతి=ఉంచున్నది.)

తా ॥ జనుడు సద్గురునిచేత దేహేంద్రియాది సమస్త వృత్తులును గలిగియుండిన,ప్రకృతిపురుషుల నెడుశరీరాత్మలను, దీసివేయఁబడినవాడై, పరిపూర్ణమును,శ్రేష్ఠమును,ఆవరణరహితమైనఅచలపరిపూర్ణుడై,చలనములేనిమహాసముద్రమువలె, అఖండస్వరూపమేయగుచున్నాడని భావము.

శ్లో ॥ అబీజంవృక్షసంపన్నం । శాఖాపల్లవవర్జితం ।
పుష్పంనాస్తిఫలంనాస్తి । సంపూర్ణంవృక్షవర్జితం ॥ ౪॥

టీక ॥ అబీజం=విత్తనములేని, వృక్షసంపన్నం = వృక్షములయొక్క సమృద్ధి, శాఖాపల్లవవర్జితం=శాఖా=కొమ్మలచేతను, పల్లవ=చిగుళ్లచేతను, వర్జితం=విడువఁబడినది, పుష్పం=పుష్పము, నాస్తి=లేదు, ఫలం =పండు, నాస్తి= లేదు, వృక్షవర్జితం=ప్రకృతి ద్వయమైన దేహములనెడు వృక్షములచేత విడువంబడి, సంపూర్ణం=మిక్కిలినిండియుండిన యచలపరిపూర్ణము, (భవతి-అగుచున్నది.)

తా ॥ అవ్యక్తము, మహత్తు, అహంకారము, పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, ఈ యెనిమిది విధములైన, మహాప్రకృతియే, బ్రహ్మాది స్తంభపర్యంతరముగా నుండెడుసమస్తాకారములాయెను. ఈ యాకారములనెడు బీజరహితమైన వృక్షసమృద్ధి, కొమ్మలు, చిగుళ్లు, పుష్పములు, ఫలములులేనివై శరీరాత్మలనెడు వృక్షములు లేనివై యుండినను, భ్రాంతివలనం దోచుచుండును, పరిపూర్ణా చలబ్రహ్మముతప్ప, మఱియేమియును లేదని భావము.

శ్లో ॥ సర్వశూన్యమయంరూపం । జన్మశూన్యంస్వభావతః ।
జన్మభావేనమృత్యుశ్చ । పరిపూర్ణంస్వభావతః॥ ౫॥

టీక ॥ తస్య=(అట్టి యచలస్వరూపమైన పరిపూర్ణమునకు, రూపం= ఆకారమును, సర్వశూన్యమయం=సర్వ=సమస్తమును, శూన్యమయం = లేకపోవుటయే,స్వరూపముగాగలదియును, స్వభావతః=స్వభావముగా గలది,జన్మశూన్యం=పుట్టుక లేనిది,జన్మభావేన=పుట్టుకగలుగుటచేత, మృత్యుశ్చ=మరణమునుగలిగియుండును, స్వభావతః=స్వభావమే, పరిపూర్ణం=అంతటను నిండియుండిన యచలమే, భవతి=అగుచున్నది.

తా ॥ అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క, స్వరూపము, ఆకాశాదిసమస్త వస్తువులు లేక, సర్వ శూన్యమైనదియును సహజముగా జన్మములేనిదియును, జననమరణములు లేని స్వభావముతో, నంతటనునిండిన-యచలపరిపూర్ణమే యున్నదనిభావము.

శ్లో ॥ జన్మాభావేకర్మంనాస్తి । కర్మాభావేఫలంనహి ।
ఫలాభావేభయంకుత్ర । భయాభావేనసంశయః ॥ ౬॥

టీ ॥ జన్మాభావే=జన్మము లేకపోవుటచేత, కర్మం=కర్మము, నాస్తి లేదు, కర్మాభావే=కర్మము లేకపోవుటచేత, ఫలం=కర్మఫలము, నహి= లేదు,ఫలాభావే=కర్మఫలము లేకపోవుటచేత, భయం=భీతి, కుత్ర=ఎక్కడిది,భయాభావే=భీతిలేకపోవుటచేత, సంశయః=సందేహము,న=లేదు.

తా ॥ అచలపరిపూర్ణ బ్రహ్మమునకు, జన్మము లేకపోవుటవలన కర్మయును, కర్మము లేకపోవుటవలన కర్మఫలమును, కర్మఫలము లేకపోవుటవలన, భీతియును, భీతిలేకపోవుటవలన సంశయమును లేదు, వాస్తవముగా మనుజునకు సద్గురుని కటాక్షము గలుగుటచేత నిజ స్వరూపమును దర్శించిన వెంటనే జన్మ, కర్మ, ఫల, భీతి, సందేహములు లేనివాడగుచున్నాడని భావము.

శ్లో ॥ ఇంద్రజాలమిదంసర్వం । యథామరుమరీచికా ।
అఖండితమనాకారం । వర్తతే కేవలంశివం ॥ ౭॥

టీక॥ ఇదంసర్వం=ఈప్రపంచము మొదలైన సమస్తవస్తువులును, మరుమరీచికాయథా=మరు = నిర్జలభూమియందు, మరీచికాయథా=మృగతృష్ణవలెనే, ఇంద్రజాలం = ఇంద్రజాలమను మాయవలనం దోచుచుండునను, అఖండితం=పరిపూర్ణమును, అనాకారం = ఆకారము లేనిదియును, శివం=మంగళప్రదమునునగు, కేవలం = అద్వితీయమైన, అచలపరిపూర్ణబ్రహ్మమొకటియే, వర్తతే=ఉంచున్నది.

తా॥ ఇంద్రజాలకమాయమైన ఈచూడబడెడు సమస్త ప్రపంచమును, నిర్జలభూమియందు, ఎండమావులవలెనే, పరిపూర్ణమును నిరాకారమును మంగళ స్వరూపమునునగు, అద్వితీయమైన అచల పరిపూర్ణబ్రహ్మమునందు, దోచుచున్నదని భావము.

శ్లో॥ శుద్ధేసుషుప్తావివచ । తస్మిన్నాహంకదాచన ।
తద్వత్సదాపియస్యాస్తి । ప్రపంచంనాస్తితస్యవై ॥ ౮॥

టీక ॥ అహం=నేను, శుద్ధే=నిర్మలమగు, తస్మిన్=ఆపరిపూర్ణబ్రహ్మమునందు, సుషుప్తావివ=సుషుప్తియందువలెనే, కదాచన = ఎప్పుడును, న=లేదు, తద్వత్ =ఆప్రకారముగానే, యస్య=జీవనికి, సదా=ఎల్లప్పుడును, అస్తి=కలదో, తస్య = అటువంటిపరిపూర్ణస్వరూపునకు, ప్రపంచం=జగత్తు, వై =ప్రసిద్ధముగా, నాస్తి=లేదు.

తా ॥ నిర్మలమైన అచలపరిపూర్ణబ్రహ్మమునందు, సుషుప్త్యాది యవస్థలయందుండెడు నేనుయెప్పుడును లేనని, ఎవడు తెలుసుకొనుచున్నాడో అట్టి పుణ్యపురుషునకు యీచూడబడెడు ప్రపంచము ప్రసిద్ధముగా లేదని భావము.

శ్లో ॥ యథానాహంతథాశుద్ధం । తస్మాత్ శుద్ధేననిర్ణయః ।
జగదస్తీతికోవేద । నాస్తికోనచనిర్ణయః ॥ ౯॥

టీక ॥ అహం=నేను,యథా=ఏప్రకారమో, తథా=ఆప్రకారమేగాని, శుద్ధం=పరిశుద్ధమగు అచలస్వరూపమును, న=కాను, తస్మాత్ =అందువలన, శుద్ధే=పరిశుద్ధమగు అచలపరిపూర్ణబ్రహ్మమును, నిర్ణయః =

ఇట్టిదట్టిదని నిర్ణయించుటకు, న=అలవికాదు, జగత్=లోకము, అస్తీతి=వున్నదని, నాస్తీతి=లేదని, కః=ఎవడు, వేద=తెలుసుకొనుచున్నాడో కః=వానికిని, నిర్ణయమును, నచ=లేదు.

తా ॥ నేను నేనే నేలఅహంకారుడు, యేప్రకారముగానున్నాడో, అదే ప్రకారము వుండునేగాని, అచలపరిపూర్ణబ్రహ్మమెన్నటికీ ఖికాదు, అపరిపూర్ణమిట్టి దట్టిదని నిర్ణయించుటకు నెవరికిని యలవికాదు, ప్రపంచము లేదని, యెవడు తెలుసుకొనుచున్నాడో! అట్టి యచల స్వరూపుని నిర్ణయించుటకు నేరికినలవికాదని భావము.

శ్లో ॥ ఆత్మాతీతం కేవలాత్మా । దేహానాస్తికదాచన ।
అస్తినాస్తీతికోవేద । నిర్ణయోనాస్తిసర్వదా ॥ ౧౦॥

టీక ॥ కేవలాత్మా=అద్వితీయమైనయచలస్వరూపము, ఆత్మాతీతం=శరీరయాత్మయుగలపరబ్రహ్మమునకు అతీతమైనది, కదాచన=ఎప్పుడును, దేహాః=శరీరయాత్మలు, నాస్తి=లేదు, అస్తి=ఉన్నది, నాస్తి = లేదు, ఇతి=అని, కః=ఎవడు, వేద=తెలుసుకొన్నవానికి, సర్వదా=ఎప్పుడును, నిర్ణయః=ఏర్పాటు, నాస్తి=లేదు.

తా ॥ అద్వితీయమగు నచలపరిపూర్ణ స్వరూపము, ప్రకృతి ద్వయముగల పరబ్రహ్మ-మునకు అతీతమైనది. అట్టి కేవలాత్మకు, శరీర యాత్మలులేవని, యెవడు తెలుసుకొనునో, అట్టియచలస్వరూపునకు, యేర్పాటులులేవని భావము.

శ్లో ॥ శాస్త్రజ్ఞానంబహుక్లేశం । బుద్ధేశ్చలనకారణం ।
ఉపదేశాద్ధరేర్బుధ్యా । రమతేసర్వకర్మసు ॥ ౧౧॥

టీక॥ శాస్త్రజ్ఞానం=శాస్త్ర=శాస్త్రములయందలి, జ్ఞానం=జ్ఞానము బహుక్లేశం=మిగులకష్టమును, బుద్ధేః=బుద్ధియొక్క, చలనకారణం = చంచలమునకు హేతువైనదియును, (భవతి=అగుచున్నది.) ఉపదేశాత్ =గురూపదేశమువలన, (జనాః=జనుడు) హరేః=భగవంతుని యొక్క, బుధ్యా=బుద్ధితో, సర్వకర్మసు = సమస్తకర్మములయందును, రమతే = క్రీడించు చున్నాడు.

తా ॥ శాస్త్రజ్ఞానము మిగుల దుఃఖములకు హేతువుగాను, బుద్ధిచాంచల్యమునకు కారణముగానుయున్నది, గనుక, గురూపదేశము వలన సమస్తకర్మములయందును భగవద్బుద్ధితో మనుజులు రమించవల యునని భావము.

శ్లో ॥ ఉల్కాహస్తోయథాకశ్చి । ద్ద్రవ్యమాలోక్యతాంత్యజేత్ ।
జ్ఞానేనజ్ఞేయమాలోక్య । పశ్చాజ్జ్ఞానంవినశ్యతి॥　　౧౨॥

టీ॥ కశ్చిత్ = ఒకానొకజనుడు, ఉల్కాహస్తః = ఉల్కా = దీపము, హస్తః = చేతియందుగలవాడై, యథా = ఏప్రకారము, ద్రవ్యం = ధనమును, (అనగా విశేషమైన వస్తువును) ఆలోక్య = చూచి, తాం = అట్టిదీపమును, త్యజేత్ = విడుచునో; (తథా = అప్రకారముగానే), జ్ఞానేన = జ్ఞానముచేత, జ్ఞేయం = తెలుసుకొనదగినదానిని, ఆలోక్య = చూచి, (తెలుసుకొని) పశ్చాత్ = అనంతరము, జ్ఞానం = జ్ఞానము, వినశ్యతి = నశించుచున్నది.

తా॥ ఒకానొకమనుజుడు, ఏప్రకారము హస్తమునందు దీపమునుగలవాడై, తాను గోరినవస్తువును వెదకి కనిపట్టినతరువాత, ఆదీపమును యెటుల పారవేయుచున్నాడో, అదేప్రకారము, జ్ఞానమును యెఱుకచేత, జ్ఞేయమగు అచల పరిపూర్ణబ్రహ్మమ్మునుజూచి, అనంతరము జ్ఞానమను యెఱుకను, విడువవలయునని భావము.

శ్లో॥ జ్ఞానమజ్ఞానినందృష్ట్వా । ద్వయోస్త్యజతినిశ్చయం ।
ద్వయోస్త్యజతియజ్జ్ఞానం । తజ్జ్ఞానంచపరిత్యజేత్ ॥　　౧౩॥

టీక॥ జ్ఞానం = జ్ఞానము, అజ్ఞానినం = అజ్ఞానముగలవానిని, దృష్ట్వా = చూచి, ద్వయోః = జ్ఞానాజ్ఞానములయందలి, నిశ్చయం = నిజమును, త్యజతి = విడుచుచున్నది, ద్వయోః = జ్ఞానాజ్ఞానములనెడు ద్వంద్వపదముల యొక్క, యత్ = ఏ, జ్ఞానం = జ్ఞానము, (నిశ్చయం = నిజమును) త్యజతి = విడుచుచున్నదో, తత్ = ఆ, జ్ఞానంచ = ప్రజ్ఞానమునున్ను, త్యజేత్ = విడిచిపెట్టవలయును.

తా॥ జ్ఞానము, అజ్ఞానముగలవానినిచూచి, జ్ఞానా జ్ఞానములయం దలి, నిజమును విడుచుచున్నది. జ్ఞానాజ్ఞానములనేడు ద్వంద్వపదములన్నియు నబద్ధములని, యేజ్ఞానము తెలుసు కొనుచున్నదో, అట్టిసుజ్ఞానమునున్ను విడిచి పెట్టవలయునని భావము.

శ్లో॥ విద్యాంతంబ్రహ్మవిద్యాంతం । వార్తికాంతమగోచరం ।
పూర్ణబోధంప్రవక్ష్యామి । శృణుశిష్యమహోత్తమం ॥ ౧౪

టీక ॥ హేశిష్య=ఓ శిష్యుడా, విద్యాంతం=సమస్తచదువులకు చివరమైనదియును, బ్రహ్మవిద్యాంతం=బ్రహ్మవిద్యా=పరబ్రహ్మజ్ఞానమునకు, అంతం=కడపటమైనదియును, (చిట్టచివరమైనది) వార్తికాంతం=వార్తిక=వృత్తాంతముల యొక్క సముదాయములకు, (సర్వసమయాచారముల యొక్క మాటలకు) అంతం=కొనమైనదియును, (అనగాశబ్దరహితమైనదియును) అగోచరం = బుద్ధ్యాదీంద్రియములకు, కనుబడనిదియును, మహోత్తమం= మిగులశ్రేష్ఠమైనదియునగు, పూర్ణబోధం = అచలపరిపూర్ణబోధను, ప్రవక్ష్యామి= చెప్పుచున్నాను, శృణు=వినుము.

తా॥ ఓశిష్యుడా, సమస్తవిద్యలకు అంతముగాగలదియును, పరబ్రహ్మ జ్ఞానమును విద్యకు చివరయును, అన్నిమాటల సముదాయమునకు కొనయును, బుద్ధ్యాదీంద్రియములనన్నిటికిం గనుబడనిదియును, సర్వోత్కృష్టమైనదియునగు నచల పరిపూర్ణబోధను జెప్పుచున్నాను, వినుమా యని సద్గురుడుపలికెనని భావము.

ఇతి - శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభు స్వాముల
వారికి ప్రియ శిష్యుడైన శ్రీమత్ప్రజ్ఞానా శంకర
రావుగారిచే టీకా తాత్పర్యములను
రచియించఁబడి ప్రచురింపంజేసిన
భ్రాంతిరహిత శ్లోకములు.
సమాప్తము.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

## గురుసేవాపద్ధతికి ముఖ్యమైన సంగతులుగల పద్యములు.

### అచలగురుఁడుత్తముఁడు.

సీ॥ గురుఁడేగుదెంచినఁ గూర్చుండఁగారాదు కూర్చుండ నెడబాసియుండ
రాదు । బోధింప విడనాడిపోరాదు బోధింపఁబడకున్న నిర్బంధ పఱచ
రాదు । దయనను గ్రహమివ్వ తడవుసేయఁగరాదు తడవైన తత్తరపడఁగ
రాదు । ఒంటిశయ్యాసనంబున నుండఁగారాదు । స్నానాదులను
ముందుసలుపరాదు । వినయ భయభక్తులెదలోన విడువరాదు । గురుని
సేవించు పరమభక్తునకు వత్స ॥ ౧ ॥ గీ॥ గురుఁడు విముఖుఁడైన గురిలేదు
మును బ్రహ్మ । వేదియగు వసిష్ఠు విముఖుఁడగుచు । కరుణఁ జూడకున్న గాదె
కౌశికుఁడు దా । బ్రహ్మఋషియుఁ గామి ప్రచురమగుట ॥ ౨ ॥ వ ॥ అట్లు
గావున ॥ క ॥ ఆ[?]ర్యుఁడొప్పకుండెడు । నాచారములొప్పరాదు అన్యమ
తములా । లోచించి మొగ్గి స్వమత । ప్రాచుర్యమొనర్పరాదు భక్తున
కలుకన్ ॥ ౩ ॥ క ॥ దూషింపఁగరాదితరులు । దూషింపఁగ వినఁగరాదు
దోషంబుల ॥ ద్వేషింపరాదు విడిబడి । భాషింపఁగరాదు గురుని భక్తుఁడు
పెలుచన్ ॥ ౪ ॥ మ ॥ నరమాత్రుండని చూడరాదు పెలుచంబై నెచ్చ్యు
ఉగారాదుసం । కరకార్యంబుల సేయరాదు మదిలో గర్వింపఁగారా
దు । స్మరయుక్తిం బరికింపరాదతని యాజ్ఞల్ మీఱఁగారాదు ను । త్సర
ముం బట్టఁగరాదు సద్గురునిపై సచ్ఛిష్యుఁడైయుండినన్ ॥ ౫ ॥ గీ॥ గురుఁ
డు సుముఖుఁడైన పరతత్త్వమును గాంచి । ముక్తిఁ జెందు నరుఁడు మును న్నగు
రుని । సుముఖతయు గలంగి సూ వెరాజఋషులు । బ్రహ్మఋషులు మోక్షప
దవిఁగనుట ॥ ౬ ॥ ఉ ॥ ఎచ్చట సద్గురుండు నివసించి సుఖంబున వెల్గుచుం
డుదా । నచ్చట కాశిగంగయుఁ బ్రయాగ గయాదులు విశ్వనాయకం ।

డచ్చటవారధుల్ సరసులచ్చటనే యమునాసరస్వతుల్। అచ్చటసర్వతీర్థములు నచ్చటదేవతలొప్పుచుండెడున్ ॥ ౭ ॥ వ॥ అట్లుగావున ॥ క ॥ గురుపదములు సేవింపుచు । గురువాక్యమునమ్ముకొనుచు గురునుతివినుచున్ । గురుమంత్రముజపియింపుచు । గురుసన్నిధి నుండవలయు గురుభక్తుండున్ ॥౮॥ గీ॥ గురుపదాంబుజంబు గొనియభిషేకంబు జేసిజలము లుశిరమునందుం। జల్లుకొనుచుంగ్రోలు సద్భక్తుండఖిలతీ। ర్థములం గ్రుంకుఫలముతానెపొందు ॥ ౯ ॥ క ॥ గురుపదసందర్శనమున । గురుపదపానమునను గురుపదపూజన్ । గురుపదవినతులంద్రిజగ। ద్గురుపద సంప్రాప్తియగునుగురుభక్తునకున్ ॥ ౧౦ ॥ సీ ॥ ఆచార్యపాదపద్మార్చనంబే జగదాచార్యపాదపద్మార్చనంబు । దేశికమంత్రోపదేశమే వైకుంఠదేశికమంత్రోపదేశికంబు । గురుసుప్రసాదానుకూలనంబే బ్రహ్మ గురుసుప్రసాదానుకూలనంబు । సద్గురునామసంస్మరణమే బుధసూల్ల సద్గురునామ సంస్మరణతతియు। గురుతనూతత్వభావనాపరతదేవ । గురుతనూతత్వభావనాపరతయగుట । గురుతరంబైనమోక్షంబు కొదవంబడునె । గురువగునిం జేరియున్న భక్తునకువత్స ॥ ౧౧ ॥

సు, విన.

———:o:———

ఇది శ్రీమద్వేదాంతసారుండును, ప్రకృతి ద్వయదోష రహితుండును అశరీరుండును, అచలపరిపూర్ణుండునునైన శ్రీమద్భాగవతుల శ్రీకృష్ణదేశికప్రభుస్వాములవారికి ప్రియశిష్యుండును, శ్రీవత్సగోత్ర సంభవుండగు, శ్రీ. నరసింహారావుగారికిని, రామాంబయను దేవికిని వరపుత్రులైన ముగ్గురిలో ద్వితీయపుత్రుండును, సజ్జనమిత్రుండునునైన, శ్రీమత్ షిండనా శంకరరావుగారిచే, స్కాంధపురాణమునందలిఉమామహేశ్వర సంవాదమనుగురుగీతలకును, గుర్వష్టకములకును, భ్రాంతిరహితశ్లోకములకును,టీకాతాత్పర్యములనున్ను,గురుసేవాపద్ధతిపద్యములనున్ను, వ్రాసి అచ్చు వేయించి రిజష్టరు చేయించి ప్రచురింపం జేసిన, సర్వంబును

స ం పూ ర్ణ ము.

———

